*జాతీయ జీవిత చరిత్ర*

# పి.సి.జోషి

జీవిత చరిత్ర



గార్గి చక్రవర్తి

అనువాదం

నిడమర్తి ఉమారాజేశ్వర రావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

అట్టమీది ఫొటో సునీల్ జనాహ్

ISBN 978-81-237-5538-0

2009 (*శక 1931*)

© మూలం: గార్గి చక్రవర్తి

© అనువాదం: నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

P.C. JOSHI : A BIOGRAPHY (*Telugu*)

**రూ. 55.00**

సంచాలకులు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా,
నెహ్రూ భవన్, 5 ఇన్స్టిట్యూషనల్ ఏరియా, ఫేస్-II,
వసంత్ కుంజ్, కొత్త ఢిల్లీ - 110 070 ద్వారా ప్రచురింపబడింది.

# విషయ సూచిక

# ముందుమాట

1935లో తొలిదశలోని భారత కమ్యూనిస్టు పార్టీకి, ఇరవై ఎనమిదేండ్ల పి.సి.జోషిని బాధ్యుడిగా పెట్టారు. కమ్యూనిస్టు పార్టీ సభ్యులు అప్పట్లో సుమారు 50 మంది కాగా, 1947 నాటికి జోషి దానిని సుమారు 90,000 మందికి పెంచాడు. ఇంతకంటే ముఖ్యంగా, జాతీయ రాజకీయాల్లో రైతుల, కార్మికుల ఉద్యమాల్లో సి.పి.ఐ (భారత కమ్యూనిస్టు పార్టీ)ని ఒక ముఖ్యశక్తిగా చేశాడు. కళాకారుల, రచయితల, శాస్త్రజ్ఞుల, సమాజంలో యితర మేధావుల పాత్రను గుర్తించిన ఒక అపూర్వ కమ్యూనిస్టు పి.సి.జోషి. దేశంలోని కొందరు ప్రధాన మేధావులతో కమ్యూనిస్టు పార్టీ సంబంధాలను ఆయన పెంపొందించాడు. అఖిల భారత ప్రజా నాట్య మండలి (ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్, ఇప్టా) స్థాపనలో ఆయన మార్గదర్శక పాత్రను పోషించాడు. చెల్లా చెదురుగా వున్న కళాకారుల, గాయకుల, నాట్యకారుల, కవుల, నాటక రచయితల మేధావుల బృందాన్ని ఆయన సమీకరించి ఒక సంఘాన్ని ఏర్పాటు చేశాడు. అలాంటి సంఘం గతంలో లేదు, అటుతర్వాత రాలేదు. కాలం గడిచిన కొద్దీ, భారత జాతీయ ఉద్యమపాత్రను మరింత బాగా అర్థం చేసుకోనారంభించి, దానిలో ఆయన సి.పి.ఐ.ని ఒక ముఖ్య భాగాన్ని చేశాడు. దురదృష్టవశాత్తూ జోషీ రాజకీయ నాయకుడుగా పరిణతి చెందినప్పుడే, పార్టీ నాయకత్వం నుంచి బయటకి గెంటవేయ బడ్డాడు. 1947లో భారతదేశం స్వతంత్రమైందని ప్రకటించడమే ఆయన నేరం.

తీవ్రమైన రెచ్చగొట్టిన సందర్భాలు ఉన్నప్పటికీ, పి.సి.జోషి సి.పి.ఐ.కి

విధేయుడుగానే వుండి, పార్టీ మరింత విస్తృతమయ్యేలా, కొంరిమింటర్న్ ఈ స్వాతంత్ర్యం బూటకం (*యే ఆజాద్ ఝూట్‌హై*) అన్న రాజకీయ పంథా ఊబి నుంచి బయటకు తీసేందుకు తోడ్పడడ్డాడు. సి.పి.ఐ. నిర్మాణపరమైన వ్యవహారాల్లో ప్రధానపాత్ర వహించేందుకు జోషి తిరస్కరించినప్పటికీ, భారత రాజకీయాల్లో సూత్రప్రాయమైన పాత్ర వహించేందుకు స్థిరసంకల్పం వహించాడు. భారత దేశంపై 1962లో చైనా దాడిని ఖండిస్తూ, వామపక్ష కమ్యూనిస్టు నాయకులను నిర్బంధించడాన్ని ఆయన వ్యతిరేకించాడు. 1967లో మతపరమైన మితవాద శక్తులతో సంయుక్త విధాయకదళ్ ప్రభుత్వాలతో సి.పి.ఐ. సూత్రరహితమైన సంబంధం పెట్టుకోవడానికి ఆయన సానుకూలుడు కాదు. అన్నింటికన్న ముఖ్యంగా మతపరమైన శక్తులు భారత ప్రజాస్వామ్యానికీ, ప్రగతికీ అతి ముఖ్యమైన ప్రమాదకారులని ప్రజలను ఆయన అనుక్షణం హెచ్చరించాడు. ఆధునిక భారత రాజకీయ, సాంస్కృతిక రంగంలోని ప్రధాన వ్యక్తుల్లో ఒకడైన పి.సి.జోషి శతజయంతి సందర్భంగా ఆయన జీవితపు ప్రధాన పార్శ్వాలను అచ్చులో సమీకరించిన గార్గీ చక్రవర్తి అభినందనీయురాలు.

– ఆచార్య బిపిన్ చంద్ర

# ఉపోద్ఘాతం

సర్వసామాన్యంగా పి.సి.జోషి అని పిలవబడే పూర్ణచంద్ర జోషి ఓ గొప్ప దేశభక్తుడు, భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత. కానీ, యిప్పుడు ఆయన పూర్తిగా ఉపేక్షించబడ్డాడు. ఆయన జీవితం దేశానికి, ప్రజలకు, కమ్యూనిస్టుపార్టీకి అంకితం చేయబడ్డది. మన స్వాతంత్ర్యోద్యమ దశలో, కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శిగా ఆ పార్టీని 1930-40 దశకాల్లో క్రమబద్ధంగా నిర్మించాడు. ఆయనది సామాన్య జీవితం కాదు. ఆంతరికంగా, బాహ్యంగా పోరాటంలా సాగింది. దృఢవిశ్వాసంతో, శారీరకంగా కదల్లేని అనారోగ్య స్థితిలో సైతం, తాను ఆశించిన స్వప్న సాధనకోసం నిరంతర పోరాటం సాగించిన జీవితం. ఆకర్షణీయ వ్యక్తిత్వం, మానవీయత కలిగిన యీ నాయకుడు ఎంతో మంది యువ, వృద్ధ తరాల వాళ్లనీ, శ్రామిక జనాలనీ, కళాకారులు, మేధావుల్నీ దశాబ్దాలపాటు ఉత్తేజపరిచాడు. ఆయన ఏక కాలంలో ఆలోచించగల, పనిచెయ్యగల భావుకుడు. రాజకీయ వాస్తవాన్ని అర్థం చేసుకోగలిగినవాడు. ప్రాథమిక దశలోని కమ్యూనిస్టు పార్టీని జాతీయ స్థాయికి పెంపొందించినవాడు. అయినప్పటికీ తన జీవితపు తుట్ట తుది దశలో ఆయన సహయాత్రికుల చేత నిర్లక్ష్యం చేయబడి, పక్కకు నెట్టబడినవాడు. జీవితాంతం వరకూ ఆయన దేశపు లౌకికవాద, ప్రజాస్వామిక శక్తులను అన్ని రకాల మితవాద ప్రతిక్రియా శక్తులకు వ్యతిరేకంగా సమీకరించేందుకు ఎడతెగని పోరాటం చేశాడు. ఆయన జీవితకాలంలో జాతీయ సంఘటన రాజకీయాలను ఏ ఒక్కరూ అర్థం చేసుకోలేదు. యీ రోజున అవే రాజకీయాలు

ఈనాడున్న వామపక్ష పార్టీలచేత మన దేశంలో ముందుకు తీసుకువెళ్ల బడుతున్నాయి. సరిగ్గా, ఆయన బతికి వుంటే శతజయంతిని దాటివుండే కాలం యిది. అలాంటి బహుముఖ, ప్రముఖ, తీవ్ర రాజకీయ భావుకుడు, ఆర్గనైజరు జీవిత చరిత్ర వ్రాయడం నిజంగానే ఒక సవాలు. ఆయన సన్నిహిత సహచరులు అందరూ యిప్పుడు లేరు. అందుచేత, యీ శూన్యాన్ని నింపడం అసాధ్యం. 1980 నవంబరులో జోషి మరణానంతరం హిరేన్ ముఖర్జీ, సత్యపాల్ డాంగ్ వంటి ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు, ఆయన సన్నిహిత అనుయాయులు గోవింద్ విద్యార్థి, ఈశ్వరభట్, దిలీప్ బోస్, సునీల్ సేన్, ఆర్థికవేత్త పి.సి.జోషిలు ఆయన ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన ప్రశస్తమైన రోజుల నాటి సంఘటనలను గుర్తుచేసుకుని, ఆయనకు ఘణంగా నివాళులు అర్పించారు. ఆయన శతజయంతి సంవత్సరం (2007) సందర్భంలో మరెన్నో సంస్మరణలు వెల్లవడ్డాయి. వాటిలో మరెంతో విలువైన, లోతైన సమాచారం బయటపడింది. వీటిలో జోషి ఏర్పాటుచేసిన సాంస్కృతికదళ సభ్యురాలైన రేఖా జైన్ రచించినవి, 1940 దశకంలో బొంబాయిలో పార్టీ కేంద్ర కార్యాలయంలో వున్న సుబ్రతా బెనర్జీ, ఆ రోజుల్లో విద్యార్థి సంఘం నాయకులైన సత్యపాల్ డాంగ్, సునీల్ మున్షీల రచనలు ఎన్నో కథనాలు, జోషి వ్యక్తిగత అనుభవాలతో నిండి ఉన్నాయి.

జోషి కాలపు కమ్యూనిస్టు పార్టీ పత్రికలు నేషనల్ ఫ్రంట్, పీపుల్స్ వార్, పీపుల్స్ ఏజ్ వార్తలతో, వ్యాసాలతో, వార్తా కథనాలతో, చిత్తప్రసాద్ చిత్రాలతో సునీల్ జనా తీసిన ఆయా ఉద్యమాల ఫోటోలతో, ఆ కాలపు జనంతో నిండి వున్నాయి. అవి జోషికి సంబంధించిన ఆయన సైద్ధాంతిక సంబంధమైన విషయాలను అర్థం చేసుకునేందుకు నాకు చాలా బాగా తోడ్పడ్డాయి. అజయ భవన్ లైబ్రరీకి, జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలోని సమకాలీన ప్రాచీన సమాచారాలు వీటిని పి.సి.జోషియే స్వయంగా నిర్మించాడు. యివి దేశంలోని వామపక్ష ఉద్యమానికి సంబంధించిన సమాచార సౌధం. ఆ సంస్థల నిర్వాహకులకు నేను కృతజ్ఞురాలిని.

నేను కొన్ని జీవిత చరిత్రల ప్రచురణలు అవి కొంత వ్యక్తిగతమైన వైనప్పటికీ చూశాను. అవి పార్టీ అంతర్గత జీవితాన్ని మరియు జాతీయ, అంతర్జాతీయ

సంఘటనలపట్ల కార్మేడ్ల ప్రతి స్పందనని ప్రతిబింబించాయి. అవి చరిత్రకు ఉపయోగకరమైన సమాచారాంశాలు. మణికుంతల సేన్ 'ఇన్‌సెర్చ్ ఆఫ్ ఫ్రీడమ్: యాన్ అన్‌ఫినిష్డ్ జర్నీ', మొహిత్‌సేన్ 'ఏ ట్రావెలర్ అండ్ ది రోడ్ : ది జర్నీ ఆఫ్ యాన్ ఇండియన్ కమ్యూనిస్ట్', గణేశ్ శుక్లా అముద్రిత వ్రాతప్రతి 'సి.పి.ఐ: యాన్ ఇన్ సైడర్స్ వ్యూ' గ్రంథాలను గురించి నేను ప్రత్యేకించి సూచిస్తున్నాను. ఆయా సంవత్సరాల్లో జోషి రాసిన కొన్ని అరుదైన వ్యాసాలను, 'న్యూ థింకింగ్ కమ్యూనిస్ట్' అనే పుస్తకంలో పునర్ముద్రించబడిన వాటిని నాకు యిచ్చిన రవి బకాయగారికి నేను ప్రత్యేకించి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. నేను ఆర్థిక వేత్త పి.సి.జోషీకి కూడా కృతజ్ఞురాలిని. నేనాయన్ని పలు సందర్భాల్లో నా ప్రశ్నలతో వేధించాను. జోషి వ్యక్తిగత జీవిత సంబంధిత విశేషాలను గురించి తెలుసుకునేందుకు విసుక్కోకుండా ప్రయత్నించాడు. దురదృష్టవశాత్తూ జోషి బాల్యం గురించీ, తొలి జీవిత దశగురించీ స్వల్పంగా సమాచారం దొరికింది.

న్యూఢిల్లీలో హౌజ్‌ఖాస్‌లో నివసించినప్పుడు, 1968 నవంబరు 7న తనని గురించి జోషి రాసుకున్న నోట్సును నేను విపులంగా ఉటంకించాను. కానైతే, వాటిని నేను ఫుట్ నోట్సుగా యివ్వలేదు.

సంశ్లిష్ట గతితార్కిక సంఘటనల మార్గం గుండా పయనించిన పి.సి. జోషి డెబ్బయేళ్ళ జీవిత కాలపరిమితిని పరిశీలించి ఒక రాజకీయ జీవిత చరిత్రను రచించడం సంశ్లిష్ట కృషి. నా పరిమితులను క్షమించమని పాఠకులను కోరుతున్నాను. నా యీ తొలి ప్రయత్నం తర్వాత, పి.సి.జోషి జీవితం, రాజకీయాలు, భావాలు, కార్యకలాపాలను గురించి రాబోయే రోజుల్లో మరింత సమగ్ర, విశ్లేషణాత్మకం అయిన రచనలు రాగలవని మాత్రమే నేను ఆశిస్తున్నాను.

– గార్గి చక్రవర్తి

# 1

# తొలి సంవత్సరాలు




పి.సి.జోషి హిమాలయ పర్వత పాదాల్లోని ఆల్మోరాలో 1907, ఏప్రిల్ 14న జన్మించాడు. అతని తండ్రి పండిట్ హరనందన్ జోషీ. ఆయన ఆ కాలంలోని అత్యంత ప్రసిద్ధులైన హెడ్మాస్టర్లలో ఒకరు. అటు తర్వాత, ఆయన ఆనాటి సెంట్రల్ ప్రావిన్సెస్‌లోని రేవా రాష్ట్రంలో డైరెక్టర్ ఆఫ్ ఎడ్యుకేషన్ అయ్యారు. రేవాకోట సమీపంలోని ఘాగ్రా నదిలో మునిగిపోయి, ఆయన చిన్న వయస్సులో మరణించారు. జోషి తల్లి మాలతీదేవి. చాలా చిన్న వయస్సులో క్షయవ్యాధితో చనిపోయింది. అప్పటికి పి.సి.జోషి వయస్సు కేవలం పది సంవత్సరాలు మాత్రమే. అతని ఒకే ఒక్కసోదరి, క్షయవాధి గ్రస్తురాలైన తన తల్లికి సేవ చేస్తున్న సమయంలో ఆ వ్యాధి తనకు సోకగా కొద్ది రోజుల్లోనే తనూ మరణించింది. అది జోషి జీవితంపై మిక్కిలి ప్రభావం చూపింది.

అతని తండ్రిది బదిలీల ఉద్యోగం. జోషి తల్లిలేని బాల్యం పినతండ్రులు, పెదతండ్రులు, పిన్నమ్మలు, పెద్దమ్మలతో కూడిన ఉమ్మడి కుటుంబంలోను, హాస్టళ్లలోనూ గడిచింది.

పాఠశాలలో అతను గడిపిన సంవత్సరాల్లో గాంధీజీ సహాయ నిరాకరణ ఉద్యమ వీచికలు కొండ ప్రాంతాలకు సైతం చేరాయి. ప్రభుత్వ బిరుదులను వెనక్కి యిచ్చెయ్యడం, ప్రభుత్వ పాఠశాలలను, కళాశాలను, న్యాయస్థానాలను బహిష్కరించడం, విదేశీ వస్త్రాలను నిరాకరించడం, పన్నులచెల్లింపు నిరాకరణ వంటి గాంధీజీ కార్యక్రమాలు ఒక నూతన స్వదేశీ విధానాన్ని సృష్టించాయి.

ఆయన అహింస, సహాయ నిరాకరణ భావాలు దేవదారు వృక్షాల అడవులకు, కొండ చరియలకు ఆశారేఖలను తీసుకువచ్చాయి. పూరన్ అనే

ఓ చిన్న బాలుడు గాంధీజీ స్వరాజ్య నినాదంతో ఉన్నతస్థాయికి ఎదిగినట్లు భావించాడు. 1920 లో అతను మీరట్ జిల్లా హాపూర్‌లోని ప్రభుత్వ హైస్కూల్లో మెట్రిక్ పరీక్ష ప్యాసయ్యాడు. బాలుడు గాంధీజీ స్వరాజ్య నినాదంతో ఉన్నతస్థాయికి ఎదిగినట్లు భావించాడు. 1920లో అతను మీరట్ జిల్లా హాపూర్‌లోని ప్రభుత్వ హైస్కూల్లో మెట్రిక్ పరీక్ష ప్యాసయ్యాడు.

హిందూ, ముస్లింల మధ్య మతకలహాలు పెరిగిన అనంతరం ఉద్యమం ఉపసంహరించ బడ్డాక, అప్పుడు 13-19 ఏళ్ల వయస్సులోవున్న పూరన్ వరుసగా జరుగుతున్న సంఘటనలతో బాధపడి, కంగారు పడ్డాడు. 1922లో అతను అల్మోరాలోని ప్రభుత్వ కళాశాల విద్యార్థిగా ఇంటర్మీడియెట్ పరీక్షలో ప్యాసయ్యాడు, సంస్కృతంలో బంగారు పతకాన్ని సంపాదించాడు. అటు తర్వాత అలహాబాదుకి పంపబడ్డాడు. ఆ రోజుల్లో ఆ విశ్వవిద్యాలయం ఐ.సి.ఎస్.కి మార్గగామిగా పరిగణించబడేది. 1924లో అతను ఇంగ్లీషు, చరిత్ర, ఎకనామిక్స్‌లతో అలహాబాదు యూనివర్సిటీ నుంచి గ్రాడ్యుయేట్ అయ్యాడు. అదే యూనివర్సిటీలో 1928 లో ఎం.ఏలో, అటు తరువాత ఎల్.ఎల్.బిలో ప్యాసయ్యాడు.

అలహాబాద్ జోషి జీవితంలో ఒక మలుపుగా నిరూపించబడింది. ఆయన అలహాబాద్ విశ్వవిద్యాలయం విద్యార్థిగా ఆ కాలపు అత్యంత ప్రసిద్ధ ఉపాధ్యాయులు తారాచంద్, బేణీ ప్రసాద్, ఆర్.పి.త్రిపాఠీ, ఈశ్వరీ ప్రసాద్ వంటి వారితో పరిచయం పొందాడు. ఈ చరిత్రకారుల పలుకుబడి అతని మీద బలమైన ప్రభావం కలిగించింది. చాలా ఏళ్ల తర్వాత 1857 నాటి బ్రిటిష్ వ్యతిరేక తిరుగుబాటును గురించి, దాని శతజయంతి సందర్భంగా జోషి రచించిన చక్కటి గ్రంథం ద్వారా అతనికి చరిత్రకారుడుగా గుర్తింపు వచ్చింది.

అలహాబాద్ జాతీయ రాజకీయాల కేంద్రం కూడా. అక్కడ ఒక వైపున మదనమోహన మాలవ్యా వంటి సాంప్రదాయికులు, మరోవైపున మోతీలాల్ నెహ్రూ వంటి విశాలదృక్పథం కలిగిన లౌకిక వాదులూ వున్నారు. జోషి రాజకీయాల్లోకి ఆకర్షింపబడి, మోతీలాల్ బృందంలో చేరి, 1925 నాటికి ఖాదీ దుస్తులు ధరించే జాతీయవాది అయ్యాడు. ఒక్క ఏడాది లోపున నవ

జవాన్ భారత సభలో క్రియాశీలుడయ్యాడు.

జోషి అలహాబాద్ యువజన సంఘంలో సభ్యుడయ్యాడు. దాని అధ్యక్షుడు జవహర్‌లాల్ నెహ్రూ. అది వాస్తవానికి యువ మేధావుల అధ్యయన కేంద్రాల సమాఖ్య. ఆ రోజుల్లోని రాజకీయ భావాలు కలిగిన విద్యార్థులందరిలాగే జోషి సైతం ఆనంద భవన్‌పట్ల ఆకర్షితుడయ్యాడు. మొదట్లో అతను, నెహ్రూ కొంత యిబ్బంది పడుతున్నట్లుగా, యితరులతో అంతగా మాట్లాడలేనట్లుగా ఆంతరిక ఆలోచనల్లో నిమగ్నుడైనట్లుగా గమనించాడు. వలస దేశాల యొక్క అణచి వేతకు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా 1927లో బ్రసెల్స్‌లో జరిగిన అంతర్జాతీయ సమావేశంలో పాల్గొన్న తర్వాత, సోవియట్ యూనియన్‌కి వెళ్లిన తర్వాత మాత్రమే నెహ్రూకి తన సొంత సందేశం లభ్యమైంది. అక్కడి నుండి ఆయన "స్వీయ చైతన్యపూరిత విప్లవాత్మక తీవ్రవాది" (Seif-conscious revolutionary radical)గా తిరిగి వచ్చాడు. సోవియట్ యూనియన్‌ని గురించి ఆయన రచించిన వ్యాసాలు గుణపాఠం నేర్పేవయ్యాయి. మహాత్మాగాంధీ అనిర్ణీత స్వరాజ్య నిర్ణయానికి వ్యతిరేకంగా నెహ్రూ సంపూర్ణ స్వరాజ్య వాదన జోషి హృదయాన్ని ఉత్తేజపరిచే ప్రతిస్పందనని కలిగించింది. దానితో, అతను వెంటనే అలహాబాద్ యువజన సంఘంలో సభ్యుడయ్యాడు.

కాని, భారత జాతీయ కాంగ్రెస్ మహాసభ 1928లో కలకత్తాలో జరిగినప్పుడు జవహర్‌లాల్ నెహ్రూ తన తండ్రి మోతీలాల్ నెహ్రూ నాయకత్వంలోని అన్ని పార్టీల కమిటీ నివేదికను వ్యతిరేకిస్తాడని జోషి ఎదురు చూశాడు. అదొక మతపరమైన ఒడంబడిక. ఒక ఏడాదిలోగా భారతదేశానికి అధినివేశ ప్రతిపత్తి యిస్తానని బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించినట్లయితే దేశ స్వాతంత్ర్యాన్ని కోరడాన్ని పక్కన పెట్టినట్లయింది. నెహ్రూ నివేదిక, ముస్లింల డిమాండ్లకు హిందూ మహాసభ దృఢమైన వ్యతిరేకత, జాతీయవాదులైన ముస్లింలను బాగా దూరంచేసి, వాళ్ల స్థానాన్ని బలహీనపరిచింది. నెహ్రూ సీనియర్ కాంగ్రెస్ నాయకుల ఒత్తిళ్లకు లొంగిపోయాడు. జోషి తరువాత ఆ రోజులను గుర్తుచేసుకున్నాడు, "జవహర్‌లాల్ నెహ్రూ ఆరాధ్యవ్యక్తిగా నా గౌరవాన్ని క్షీణింపచెయ్యడమే కాక, తొలి అఖిల భారత యువజన మహాసభను జరుపుకునేందుకు అక్కడ (కలకత్తాలో) సమావేశమైన వామపక్ష భావాలు

కలిగిన యువకుల గౌరవం కూడా క్షీణించింది".[1] భ్రమ తొలగడంతో అతన్ని కమ్యూనిస్టుల దిశగా నడిపింది.

జోషి, కలకత్తాలో కార్మిక నాయకుడూ, తన సొంత జిల్లాకు చెందిన అఫ్తాబ్ ఆలీని కలుసుకున్న సమయం అది. అతను రహస్యంగా సంపాదించిన రజనీ పామీదత్ రచించిన 'ఆధునిక భారతదేశం'(Modern India) ను, 1926 ఎం.ఎన్.రాయ్ రచించిన 'భారత రాజకీయాల భవిష్యత్తు' (Future of Indian Politics)లను జోషి తీసుకున్నాడు. అప్పట్లో ఎం.ఎన్.రాయ్ అంటే మరింత గౌరవం ఉన్నప్పటికీ, జోషి ఆర్.పి.దత్ విశ్లేషణతో ఎంతగానో ప్రభావితుడయ్యాడు. అప్పటి నుంచి రజనీ పామీదత్ (ఆర్.పి.డి) జోషికి మార్గదర్శకుడయ్యాడు. జోషి యిలా రాశాడు, "ఆర్.పి.డి. మా బోధకుడూ, మార్గదర్శకుడూ అయ్యాడు. ఆయన *'మోడర్న్ ఇండియా'* మా పాఠ్యగ్రంథం అయింది. ఆయన 'లేబర్ *మంత్లీ'* (నెలవారీ నివేదిక) మమ్మల్ని ముందుకు నడిపింది".[2] జోషి తనే స్వయంగా మాటల్లో యిలా చెప్పాడు. "వివిధ విశ్వ విద్యాలయాల్లో యువజన సంఘాలను సంఘటితంచేస్తూ, కాంగ్రెస్ వామపక్షాలను కలుపుతూ, స్థానిక కమ్యూనిస్టు విప్లవాత్మక బృందాలను కార్మిక, కర్షక పార్టీ యూనిట్లలోకి (ఆ రోజుల్లో సి.పి.ఐ. బహిరంగ చర్చా వేదిక) కలుపుతూ వచ్చిన విద్యార్థి కమ్యూనిస్టును"[3]. నూతన కమ్యూనిస్టు పథంలో జోషి రాజకీయ పథం ఆ విధంగా మొదలైంది.

---

1. పి.సి.జోషి, 'ది నెహ్రూ లెగసీ: ఏ సెల్ఫ్-క్రిటికల్ కమ్యూనిస్ట్ ఏవల్యూషన్', *న్యూ థింకింగ్ కమ్యూనిస్ట్,* డిసెంబర్ 1,1998
2. పి.సి. జోషి, 'రజనీ పామీదత్ అండ్ ఇండియన్ కమ్యూనిస్ట్స్', న్యూ థింకింగ్ కమ్యూనిస్ట్, మార్చి 1, 2001
3. పి.సి. జోషి గురించి సత్యపాల్ దాంగే రాసిన అముద్రిత వ్యాసంలోంచి, రచనా కాలం 13 ఏప్రిల్, 2001

# 2

# రాజకీయ రంగ ప్రవేశం

## మీరట్ కుట్ర కేసు - అటు తర్వాత

పంతొమ్మిదివందల ఇరవయ్యవ దశకం మధ్య సంవత్సరాల్లో జాతీయోద్యమం క్లిష్టదశలో నడుస్తోంది. ప్రత్యేకించి 1922 లో సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ఆకస్మికంగా ఆపివేసిన తర్వాత గాంధీ అహింసాత్మక పోరాటతంత్రంపై పెద్దసంఖ్యలో యువకులు భ్రాంతిని కోల్పోయారు. దేశంలోని వివిధ ప్రాంతాల్లో మతపరమైన పోరాటాలు చెలరేగాయి. మహమ్మదీయుల్లో తబ్లిక్ (మత ప్రచారం), తంజిమ్ (శక్తిని కూడబెట్టడం) హిందువుల్లో శుద్ధి సంఘటన మొదలైన ఉద్యమాలు ప్రారంభమయ్యాయి. జనంలో భ్రమలు తొలగిపోయి, విద్యావంతులైన యువకులను విప్లవాత్మక వీరత్వం ఆకర్షించగా వారిలో కొద్దిమంది మార్క్సిజానికి సన్నిహితులయ్యారు. అందరు తెల్లవాళ్ళతో కూడిన సైమన్ కమీషన్ బృందం 1927 నవంబరులో భారతదేశానికి వచ్చి జనంలో విపరీతమైన కోపాన్ని రేకెత్తించింది. అది సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలకు కారణమైంది. కాని, వాటి ప్రభావం తాత్కాలికమైంది. కాంగ్రెస్ జనం యొక్క ప్రతీక్షలను, ఆశలను నెరవేర్చడంలో విఫలమైంది. అది కార్మిక సంఘాలు, రైతు సంఘాల ద్వారా వామపక్ష బృందాల ఏర్పాటుకు దారితీసింది.

అదే పి.సి.జోషి రాజకీయరంగ ప్రవేశ కాలం. ఆయన రైతు, కార్మిక పార్టీలో అప్పుడే చేరాడు. 1928 సెప్టెంబరులో జరిగిన మీరట్ సమావేశంలో ఉత్తరప్రదేశ్ సంఘపు సంయుక్త కార్యదర్శి అయ్యాడు. అక్కడే ఆయనకు ఆర్.డి.భరద్వాజ్, ఎస్.జి.సర్దేశాయి మెదలగు కమ్యూనిస్టు కార్యకర్తలతో

సంబంధం ఏర్పడింది. ఒక విప్లవం ద్వారా అఖిల భారత కార్మిక, కర్షక పార్టీ బ్రిటిష్ సామ్రాజ్యవాదం నుంచి స్వాతంత్ర్యం సాధించగలదన్న విశ్వాసం జోషీకి కలిగింది. కమ్యూనిస్టుల సంఖ్య బాగా తక్కువ. వాళ్లు బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ ద్వారా బాగా ప్రభావితులయ్యారు. ఆ పార్టీ భారతీయ కమ్యూనిస్టులకు సైద్ధాంతిక మార్గదర్శి. 1920వ దశకంలో భారతదేశంలో కార్మికవర్గ ఉద్యమానికి పునాది వేసిన బ్రిటిష్ కమ్యూనిస్టులు రజనీ పామీదత్తు, ఫిలిప్ స్ప్రాట్, బెన్ బ్రాడ్లీలు. యువవయస్సులో పి.సి.జోషిని ఈ బ్రిటిష్ కమ్యూనిస్టులు విశేషంగా ప్రభావితం చేసారు. జోషి 1928లో స్ప్రాట్, బ్రాడ్లీలను కలిశాడు. వారు పూర్తిగా భారతీయులుగా మారడం, భారతీయుల మధ్య నివసించడం, వారిలో ఒకరిగా ప్రవర్తించడం గమనించాడు.

> వాళ్లు కీలకమైన ఏజెంట్లుగా వ్యవహరించారు. కేంబ్రిడ్జ్ గ్యాడ్యుయేట్ అయిన స్ప్రాట్ చెల్లాచెదరైన స్థానిక బృందాల సంబంధాలను ఐక్యం చెయ్యడానికి తోడ్పడ్డాడు. సామూహికంగా ఆమోదించిన జాతీయ విధానం ద్వారా వారి మధ్య వాదనల ద్వారా వారిని ఐక్యం చేశాడు. ఇంజనీరింగ్ వర్కర్ అయిన బ్రాడ్లీ, భారతీయ కమ్యూనిస్టుల్ని కార్మిక వర్గం గురించి చదవడం, మాట్లాడడం, ఆషామాషీగా రాయడం దశనుండి శారీరకంగా కార్మికవర్గంలో కలిసిపోయి, వాళ్లని సంఘటితం చేసి, ముందుకు నడిపాడు. మన సాంప్రదాయిక, సులభతర భారతీయ పద్ధతుల్లో వాళ్లిద్దరూ సంఘటిత క్రమాన్ని మనలో ప్రవేశపెట్టారు.[1]

వాళ్లందరూ గాంధీపట్లా, భారతీయ కాంగ్రెస్‌పట్లా విమర్శనాత్మక దృష్టి కలిగి వున్నారు. దేశం రైల్వేలు, నూలు పరిశ్రమలు, జనపనార రంగాల్లో పెద్ద ఎత్తున కార్మిక తిరుగుబాటును చూసిన దశ యిది.

1928 డిసెంబరులో, కలకత్తా కార్మికవర్గం తన రాజకీయ కలయిక, పరిణతిల పెరుగుదలను ప్రదర్శిస్తూ, ఓ పెద్ద ప్రదర్శన చేసింది. కార్మిక, కర్షక పార్టీ నాయకత్వంలో వేలాది కార్మికులు కాంగ్రెస్ మహాసభ

---

1. పి.సి. జోషి, 'రజనీ పామీదత్ అండ్ ఇండియన్ కమ్యూనిస్ట్స్'.

వద్దకు నడిచివెళ్ళి, రెండు గంటలపాటు పందిరిని ఆక్రమించారు. పూర్ణ స్వరాజ్యాన్ని డిమాండు చేస్తూ తీర్మానాలను ఆమోదించారు.[2]

యిది సహజంగా కార్మిక సంఘాల్లోకి కమ్యూనిస్టు చొరబాటు లాగా పరిగణించబడింది.

జంషెడ్‌పూర్, బొంబాయి, కలకత్తాల నుంచి దేశపు యితర ప్రాంతాల్లోకి సమ్మెలు వ్యాపించడంపట్ల బ్రిటిష్ ప్రభుత్వం బాగా కలవర పడింది. బెంగాలు, బొంబాయి కార్మికులను సంఘటితం చేస్తున్న బ్రిటిష్ కమ్యూనిస్టులను డిటైన్ చేసేందుకుగాను ప్రభుత్వం పబ్లిక్‌సేఫ్టీ చట్టాన్ని తెచ్చింది. ఇది 1929 నాటి ట్రేడ్ డిస్ప్యూట్స్ చట్టపు ప్రత్యేక న్యాయస్థానాలు సమ్మెలను నిషేధించేందుకు ఉద్దేశింపబడింది. ప్రభుత్వం కార్మిక నాయకుల అణచివేతను ప్రారంభించింది. 1929, మార్చి 20న 31 మంది కార్మిక నాయకులు అరెస్టు చెయ్యబడ్డారు. వారిలో ఎక్కువమంది కమ్యూనిస్టులు. వారిలో ముగ్గురు బ్రిటిష్ కమ్యూనిస్టులు బ్రాడ్లీ శ్ప్రాట్, హచ్చిన్‌సన్‌లతో పాటు ఎస్.వి.ఘాటే, ఎస్.ఎ.డాంగే, ఎస్.ఎస్.మిరాజ్‌కర్, డా.జి.అధికారి, ముజఫర్ అహ్మద్, ధరణీ గోస్వామి, గోపేన్ చక్రవర్తి వంటి భారతీయ కార్మిక నాయకులు అరెస్టు చెయ్యబడిన వారిలో ఉన్నారు. 1929 మార్చి 20న అలహాబాదులోని హాలండు హాస్టలు నుంచి జోషిని కూడా పట్టుకున్నారు. వారిలో ఇరవై రెండు సంవత్సరాల జోషి మిక్కిలి చిన్నవాడు. వాస్తవానికి అదే సంవత్సరం ఆయన కమ్యూనిస్టు పార్టీ సభ్యుడయ్యాడు. ఆ విచారణ మీరట్‌లో మూడేళ్ళు కొన సాగింది. అందుకే అది 'మీరట్ కుట్ర కేసు'గా పరిగణించ బడింది.

ఈ విచారణ బ్రిటిష్‌వారికి ప్రయోజన రహితంగా నిరూపించబడింది. కమ్యూనిస్టు శిక్షితులు తమ ఉపన్యాసాలద్వారా, ప్రేక్షకుల్లో విశ్వాసం కలిగించే స్వీయరక్షణను, తమ ఆదర్శాలనూ, స్వతంత్ర భారతదేశానికి సంబంధించిన భావాల్నీ వ్యక్తం చేశారు. ఆ ఉపన్యాసాలు విపులంగా వార్తా ప్రసార మాధ్యమాల్లో

---

2. వివరాలకు, సుమిత్ సర్కార్, *మోడర్న్ ఇండియా*, మాక్ మిలన్, ఢిల్లీ, పుట 269-70.

ప్రచురించబడ్డాయి. కాంగ్రెస్ నాయకత్వం మీరట్ ఆరోపణల్ని ఖండించింది. అఖిల భారత కాంగ్రెస్ కమిటీలో దాదాపు ఎనిమిదిమంది సభ్యులు మీరట్ ఖైదీలను రక్షించే విషయంలో నిమగ్నులయారు. ఈ మీరట్ రక్షణ కమిటీ మోతీలాల్ నెహ్రూ అధ్యక్షుడుగా ఏర్పడింది. మహాత్మాగాంధీ స్వయంగా జైల్లోని ఖైదీలను కలిశారు. ఈ విచారణ ఆ విధంగా జాతీయవాద శక్తులు కమ్యూనిస్టులకు సన్నిహితమయ్యేలా తోడ్పడింది.

అంతేకాదు, జైలు మార్క్సిస్టు విద్యకి సిసలైన కేంద్రం అయింది. జోషి అన్ని మార్క్సిస్టు ప్రధాన సిద్ధాంత గ్రంథాలు విరివిగా చదివిన కాలం కూడా అదే. ఆ కృషిలో ఆయనకు జైల్లోని పెద్దలు మార్గదర్శకత్వం వహించారు. ఆయన మిగిలిన జీవితానికి ఆ జైలు జీవితవత్సరాలు సైద్ధాంతిక శిక్షణ కాలం అయ్యాయి. ఆ కాలంలో ఆయన విలువైన అనుభవాలను సంపాదించాడు. తర్వాత తన జీవితంలో ఆయన యిలా రాశాడు.

> ప్రముఖ లాయర్లు మమ్మల్ని సమర్థించేవారు. కాని, మా సిద్ధాంతం, విధానం, లేక మా కార్యక్రమాలను గురించి వారికి ఏమీ తెలియదు. క్లుప్తంగా రాసియిచ్చే రచయితగా మొత్తం రుజువులను (ఉపన్యాసాలు, రాజకీయ, కార్మిక, కర్షక సంఘాల కార్యకలాపాలను గురించిన రికార్డును) వారికి క్లుప్తంగా యిచ్చేవాడిని. వాటిద్వారా కేవలం లీగల్, న్యాయ విచారణలకు సంబంధించే కాకుండా, వాటిని అర్థం చేసుకుని రాజకీయ రక్షణవాదాలు కూడా చేసేందుకు నేను క్లుప్తంగా రాసి వారికి అందించేవాడిని. పండిత్ మోతీలాల్ నాయకత్వానవున్న డిఫెన్స్ (రక్షణ)కమిటీతో మాకు ఒప్పందంవుంది. క్రింది కోర్టుల్లో లాయర్లయిన ఎమ్.సి.చాగ్లా, దివాన్ చమన్‌లాల్‌లు, హైకోర్టులో మిస్ శ్యామ్ కుమారి సహకారంతో డా.కె.ఎన్ కట్జూలు లీగల్ డిఫెన్స్‌లతోబాటు మేము సూచించినట్లు రాజకీయ డిఫెన్సును కూడా చేరుస్తారు. ఇండియా జాతీయ రాజకీయ వాస్తవాల దృష్ట్యా, మా ప్రచారాన్ని మార్క్సిజం లెనినిజం, అంతర్జాతీయ విధానాలు ఆలోచించేందుకు, మా ప్రచారాన్ని అత్యుత్తమ పద్ధతిలో పెట్టేందుకు మా వైఖరికీ ఇది నాకు నేర్పింది.

కోర్టు వ్యవహార కార్యకలాపాలను కూడా, స్వయంగా తెలుసుకునే జ్ఞానంలేని, ఓపిక చేసుకోని ప్రెస్ రిపోర్టర్లకు, నేను వాటిని అందజేసే వాడిని. స్వేచ్ఛగా, ఉచితంగా నేనిచ్చే సమాచారానికి విలేకరులు కృతజ్ఞతలు తెలిపేవారు. ఆ విధంగా లాహోర్ కేసు (భగత్ సింగ్‌ది) మరింత ఉత్తేజకరంగా, సంచలనాత్మకంగా ఉన్నాగానీ మీరట్ కుట్ర కేసును గురించి రాజకీయంగా ప్రచారం జరిగింది.

తన డిఫెన్సు పద్ధతిలో, పి.సి.జోషి చాలా సమర్థంగా వాదించాడు. టైప్ చేసిన 65 పేజీల ఆయన డిఫెన్సు డాక్యుమెంటు రాజకీయ కేసును గురించి వెలువడిన వాటన్నింటిలోనూ ఉత్కృష్టమైనది. 1931, ఏప్రిల్ 24న మీరట్‌లో ఆర్.ఎల్.యార్క్ అనే ఎడిషనల్ సెషన్స్ జడ్జి ముందు ఆయన తన ఢిఫెన్స్ వాదనని యిలా సాగించాడు.

నా పేరు పూరణ్‌చంద్* జోషి. నా తండ్రిపేరు పండిత్ హరనందన్ జోషి. నేను కులంరీత్యా కులరహితుడిని. నా వయస్సు 24 ఏళ్లు. నేను విద్యార్థిని, నా స్వగ్రామం ఆల్మోరా పోలీస్ స్టేషన్ దగ్గరి ఆల్మోరా.

ఒక సందర్భంలో ఆయన యిలా అన్నాడు:

బ్రిటిష్ సామ్రాజ్యవాదం కమ్యూనిజంతోనూ, యీ కేసు తీర్పు ప్రాతిపదికతోనూ నికార్సైన జాతీయ స్వాతంత్ర్యం కోసం జరుగుతున్న మొత్తం ఆందోళననూ, సంస్థలనూ, విప్లవంద్వారా స్వాతంత్ర్యవేదికనూ, తరువాత చేసిన శాసనంతో శాసన విరుద్ధమైనదనీ, నేర పూరితమైనదనీ ప్రకటించింది. ఈ కేసు (మీరట్ కుట్రకేసు) కుటిల విప్లవ వ్యతిరేక ఫలితం కోసమన్న అపరిపక్వ ప్రచారంతప్ప మరేమీ కాదు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదపు దోపిడిదారీ స్వభావాన్ని బట్టబయలు చేస్తూ ఆయన తన వాదాన్ని ముగించాడు. ఆయన వాదనల పటిమ ఆయన్ని ఒక నాయకుడిగా రూపొందించింది.

---

* ఇక్కడ జోషి తన పేరు పూరణ్ చంద్ జోషి అని చెప్పాడు. ఆయన మిత్రులూ, బంధువులూ ఆయనను పూరణ్ చంద్ర జోషి అంటారు

క్షీణదశలోని భారతీయ భూస్వామ్య విధానంతోనూ, లంచగొండి భారతీయ పెట్టుబడిదారీ విధానంతోనూ ఒక సామాజిక వ్యవస్థగా సంఘటితమైన బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి అర్థం భారతదేశ ప్రజానీకపు పేదరికం సాటిలేని బానిసత్వాలను పెడచెవిన బెట్టడం. భారత దేశపు సామాజిక ప్రగతి, భారత జనసామాన్యపు జీవితమూ యీ బుర్జువా భూస్వామ్య సామ్రాజ్యవాద వినాశాన్నీ డిమాండ్ చేస్తుంది. ఈ విషపూరిత, సహించరాని సామాజిక వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడినందుకు, విప్లవవాదులం అయినందుకూ మమ్మల్ని జైలుపాలు చేస్తారు.కానైతే, జాతీయ విప్లవం కొద్దిమంది విప్లవవాదుల వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని తొలగించినప్పటికీ, విప్లవం అనివార్యం, అవసరం, అది తప్పక వచ్చి తీరుతుంది. భారతదేశ జన సామాన్యపు జాతీయ విప్లవం బ్రిటిష్ సామ్రాజ్య వాదపు చారిత్రక అభిశంసన. అటు తర్వాత మాటలు కాదు, బులెట్లు మాట్లాడతాయి.

......... నేరస్తులుగా మాకు వ్యతిరేకంగా చేసిన ఆరోపణకు సంబంధించినంత వరకు, అవి మా అభిప్రాయాలకు వ్యతిరేకంగా చేసిన దగాకోరు నేరారోపణగా మేము పరిగణిస్తాము. దాన్ని మేము సీరియస్‌గా తీసుకోలేము. కానీ, మేము ఈ న్యాయవిచారణ కేసును చాలా సీరియస్‌గా తీసుకుంటాము. ఈ కేసులో విచారణలో ఉన్నది మేము కాదు, మా అంతిమ న్యాయమూర్తులైన భారతీయ జనసామాన్యం ముందు విచారణలో ఉన్నది బ్రిటిష్ సామ్రాజ్యవాదం. మేము నిందితులం కాము, దోషారోపకులం. మా అసలు న్యాయమూర్తుల అంతిమ తీర్పు విప్లవానికి అనుకూలంగా ఉంటుందన్న విషయంలో మాకు ఎలాంటి సందేహంలేదు. జూనియర్ క్రౌన్ కౌన్సెల్ అయిన మిస్టర్ మిత్రా నన్ను అడ్డుకుంటున్నట్లు కనిపిస్తున్నాడు. ఆ అరుణ దినాన, ఆయన నవ్వడు, విలపిస్తాడు.

మేము అనాగరికులం కామనీ, విప్లవకారులమనీ మిస్టర్ కెంప్ గ్రహించాలి...

భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదపు ఆర్థిక దోపిడీని బయట

పెడుతూ, జోషి అమల్లోవున్న వలస వ్యవస్థని విపులంగా విశ్లేషించాడు. ఈ విషయంలో రజనీ పామీదత్తు, ఆట్లో కూజినెన్‌లు కోమింటర్న్ ఆరవ ప్రపంచ మహాసభలో (1928) యిచ్చిన రిపోర్టుతో ఆయన మిక్కిలి ప్రభావితుడయ్యాడు. భారతదేశంలో 1930 మార్చిలో ఆ పత్రం ముసాయిదా తీర్మానమూ భారతీయ కమ్యూనిస్టుల్ని విప్లవ వ్యతిరేక పాత్ర వహిస్తున్న గాంధీయిజానికి వ్యతిరేకంగా పోరాడమని సూచించింది.

> కార్మిక, కర్షక పార్టీలు పెట్టీ బూర్జువా సంస్థలుగా పిలవబడ్డాయి. అవి కార్మిక, కర్షక ఉద్యమాలకు అవరోధాలుగా కనిపించాయి. ఒక కేంద్రీకృత పార్టీని స్థాపించమని అడిగినప్పుడు, యీ క్రింది నినాదాలయొక్క ప్రాతిపదికమీద, తమ కార్యక్రమాన్ని బూర్జువా ప్రజాస్వామ్య విప్లవ కార్యక్రమాన్ని ముందుకు పెట్టమని కమ్యూనిస్టులు సూచించబడ్డారు. ఆ నినాదాలు: ప్రధాన లక్ష్యం-సాధారణ రాజకీయ సమ్మె. సాయుధ విప్లవానికి ప్రచారం, తిరుగుబాటుకు సాధనాలుగా సోవియట్లు, వ్యవసాయ విప్లవం, సామ్రాజ్యవాదాన్ని కూల్చడం, సోవియట్ల రూపంలో కార్మిక కర్షక వర్గాల విప్లవాత్మక నియంతృత్వ స్థాపన.[3]

జోషి నిజానికి ఒక 'యువఅద్భుతం' అని పేర్కొంటూ, ప్రసిద్ధ కమ్యూనిస్టు పార్లమెంటేరియన్ హిరేన్ ముఖర్జీ ఇలా అన్నాడు

> తనను సులభతరమైన జీవిత పద్ధతులు ఆకర్షించినా విద్యాపరమైన అభ్యున్నతి ఆకర్షించినా విప్లవపథంలోకి ప్రవేశించాడు. ప్రసిద్ధ మీరట్ కుట్ర ఖైదీల బృందంలో అతను మిక్కిలి చిన్నవాడు. అతని ఆంగ్లభాషా వైశిష్ట్యం (బ్రిటీష్ న్యాయమూర్తులను అద్భుతపరచింది) జైల్లోని కొందరు ఉన్నత కార్మికవర్గ నాయకుల సాహచర్యంతో భారతదేశ పరిస్థితిని గ్రహించాడు. మన పురాతన, జటిల దేశంలో సామ్రాజ్యవాదం సృష్టించిన క్లిష్టస్థితినించి బయటపడే మార్గాన్ని అతను అవగాహన

---

3. శోభన్‌లాల్ దత్తా గుప్తా, *కొమింటర్న్ అండ్ ది డెస్టినీ ఆఫ్ కమ్యూనిజం ఇన్ ఇండియా* 1919-1943, సెరిబన్, కలకత్తా, 2006, పుట 141.

చేసుకున్నాడు.[4]

ఒక ఖైదీగా జోషి మూడు కారణాలద్వారా తనకంటూ ఒక స్థానాన్ని సమకూర్చుకున్నాడు. తన రచనా నైపుణ్యం మూలంగా అతను అత్యుత్తమ ముసాయిదా తయారీ దారయ్యాడు. అతను ఖైదీలందరి తరఫునా శాసన సంబంధమైన విజ్ఞాపన పత్రాలు తయారుచేసేవాడు. రెండవది మిగతావారిని తన వినయపూరితమైన స్వభావంతో ప్రభావితం చేసేవాడు. ఖైదీలందరిని సమీకృతం చేసేందుకు ప్రయత్నించాడు. మూడవది, జైల్లో సైతం అతను క్రమశిక్షణాయుతమైన జీవితం గడిపాడు. అతని అద్భుతమైన తోటపనిని యితరులందరూ మెచ్చుకునేవారు.

1933లో జైలునుంచి విడుదలయ్యాక, జోషి ఉత్తరప్రదేశ్‌లో పార్టీ ఆర్గనైజరుగా పనిచేశాడు. అతని స్థానం పారిశ్రామిక కాన్పూరు. దానిని గురించి పి.సి.జోషి యిలా రాశాడు. "ఇక్కడ నేను కార్మికవర్గ ఉద్యమంతో అత్యవసరమైన మమేకం పొందాను. నా యువదశలో, నా అతి ఉత్సాహంతో మూయిర్ మిల్లు సమ్మెకు నాయకత్వంవహిస్తూ నాకుగా నేను అరెస్టు అయ్యాను. 1934 నాటి ఆర్థికమాంద్యదశలో అఖిల భారత నేతకార్మికుల సమ్మె శ్రేణిలో అదొకటి". 124 ఎ. 153 ఎ సెక్షన్ల క్రింద జోషి రెండేళ్ల ఖైదు శిక్ష పొందాడు. కాని, అతను ఆదర్శవంతుడైన ఖైదీగా, కూలీగా, చాకలిగా పనిచేసి శిక్షలో ఆరు నెలల అత్యధిక తగ్గింపును పొందాడు.

జాతీయస్థాయిలో, లండన్లో బ్రిటిష్ ప్రభుత్వానికీ, భారత నాయకులకు మధ్య జరిగిన రౌండ్ టేబుల్ చర్చలు విఫలమయ్యాయి. అది గాంధీజీ శాసనోల్లంఘన ఉద్యమ పునరారంభానికి దారి తీసింది. తత్ఫలితంగా కాంగ్రెస్ పార్టీ చట్ట వ్యతిరేకమైనదిగా ప్రకటించబడింది. జన బాహుళ్యపు అణచివేత ప్రారంభమైంది. భారత కమ్యూనిస్టులు, గాంధీ శాసనోల్లంఘన ఉద్యమ రాజకీయ ప్రాముఖ్యతను గ్రహించడంలో విఫలమై ప్రధాన స్వాతంత్ర్య పోరాటానికి దూరమయ్యారు. జోషి కమ్యూనిస్టు ఉద్యమ తొలివీరులు సాధించిన ప్రయోజనాలు వేగంగా పరిసమాప్తమవడాన్ని నిస్సహాయంగా వీక్షించాడు.

---

4. హిరేన్ ముఖర్జీ, 'జోషి-ది మ్యాన్', న్యూ ఏజ్, నవంబర్ 16, 1980.

మీరట్ అరెస్టులు సృష్టించిన శూన్యాన్ని రణదివే, దేశ్‌పాండేలు పూరించారు. వాళ్లు కొమింటర్న్ సూచనలను అనుసరించి, అప్పుడున్న జాతీయ బూర్జువా నాయకత్వాన్ని నిరసించడంతోబాటు, జాతీయ విముక్తి ఉద్యమాన్నే తిరస్కరించి, 1930-34 నాటి శాసనోల్లంఘన ఉద్యమానికి బయట ఉండిపోయారు. ఆ విషయంలో పి.సి.జోషి యిలా రాశాడు. అది బాల్య పొరపాటు చెల్లించిన చారిత్రాత్మక మూల్యం. దీనిని గూర్చి ఆయన ఇలా రాశాడు. "1931లో పార్టీలో తొలి చీలిక ఏర్పడింది. వామపక్ష సిద్ధాంతంలో కామ్రేడ్లు రణదివే, దేశ్‌పాండేలు ఒకరితో మరొకరు పోటీ పడ్డారు"[5]

కమ్యూనిస్టుపార్టీ ఇంకా ప్రాథమిక దశలో వుంది. అది తన నిర్మాణ సంబంధమైన లోపాల విషయంలో బాగా నిమగ్నమైవుంది. కమ్యూనిస్టు అంతర్జాతీయ ఆరవ మహాసభ రూపొందించిన దానిలో దాని సామర్థ్యం, సంభవనీయతలను అప్పటి రాజకీయ పరిస్థితులను బట్టి అది ప్రశ్నించలేదు. జైల్లోవున్న మీరట్ కుట్రకేసు ఖైదీలు తమ అభిప్రాయాలను బయటవున్న కామ్రేడ్సుకి పంపారు. వారి రాజకీయ విధానం అవాస్తవికమైనదనీ, అలాంటి విప్లవాత్మక భావ పరంపరలు వారిని కమ్యూనిస్టు కార్మికుని నుంచీ, జనసామాన్యం నుంచీ కూడా దూరం చేస్తాయనీ తెలిపారు. కాని, విధేయులైన కామ్రేడ్లుగా, మూలసూత్రాల విషయంలో వారిని సవాలు చెయ్యలేక పోయారు. పి.సి.జోషి యిలా రాశాడు:

> మీరట్ సెషన్స్ జడ్జి ముందు సంయుక్త స్టేట్‌మెంట్‌లో మనం తీసుకున్న వైఖరి ముఖ్యంగా ఆరవ మహాసభ విధానంపై ఆధారపడి ఉంది. మన ఆ స్టేట్‌మెంటు భారతీయ పరిస్థితులకు మార్క్సిజం, లెనినిజాన్ని సృజనాత్మకంగా అన్వయించినది కాదు. అదొక కట్టుదిట్టమైన పెట్టీ బూర్జువా విప్లవాత్మక పత్రం.[6]

శాసనోల్లంఘన ఉద్యమంలో కమ్యూనిస్టులు చేరకపోయినా రాజకీయ విధానంతో జోషి సంతోషంగా లేడన్న విషయాన్నిది స్పష్టంగా తెలియజేస్తుంది.

---

5. పి.సి.జోషి 'రజనీ పామీదత్తు-భారతీయ కమ్యూనిస్టులు'.
6. పైదే.

ఫాసిజం, యుద్ధాలతో పెరుగుతున్న ప్రమాదం, మిత్రరాజ్యాలైన బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికాలకూ మూలశక్తులైన జర్మనీ, ఇటలీ, జపాన్‌లకీ మధ్య వాస్తవమైన చీలిక మొత్తం ప్రపంచాన్ని టాగోర్ వర్ణించినట్లు "నాగరికతలో సంక్షోభానికి" నెట్టింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం ఇండియా, చైనాలవంటి వలసవాద, అర్ధవలసవాద దేశాల్లోని శ్రామిక జనసామాన్యాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేకత జాతీయ సంఘటనల్లో సమీకృతం అవమని హెచ్చరించింది. అభివృద్ధి చెందిన పశ్చిమ ప్రాంతంలోని రాజ్యాలను ప్రజా సంఘటనలను ఏర్పాటు చేసుకోమని సూచించింది. 1935లో జరిగిన అంతర్జాతీయ (చిట్టచివరి) ఏడవ మహాసభ ఐక్య సంఘటన విధానపు నూతన పద్ధతిపైన దృష్టి కేంద్రీకరించింది. తద్వారా, కాంగ్రెస్ నాయకత్వ స్వభావంపైన తన దృష్టిని మార్చుకొని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కాంగ్రెస్‌ని సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ సంస్థగా చూడటం ప్రారంభించింది.

కొమింటర్న్ ఏడవ ప్రపంచ మహాసభ(1935) కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో కొత్త పరిణామం. గ్రేట్ బ్రిటన్ కమ్యూనిస్టుపార్టీ (CPGB)కి చెందిన బెన్‌బ్రాడ్లీ(తంబే) మీరట్ కుట్ర కేసులో ఒక నేరస్తుడు కూడా. అతను ఆ మహాసభలో భారతదేశం తరఫున మాట్లాడాడు.

> ఇండియా నూతన కమ్యూనిస్టు పార్టీ జాతీయ సంస్కరణ వాదపు తప్పును బహిర్గతంచేసి, జన సామాన్యంలోకి సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ (భూస్వామ్య)వ్యతిరేక విప్లవాల నినాదాలను తీసుకెళ్లింది. కానైతే జనసామాన్యంలో జాతీయ సంస్కరణవాదుల ప్రభావాన్ని యిప్పటి దాకా నిలిపివేయలేక పోయింది. ఇప్పటిదాకా ఈ జన సామాన్యంలోని పురోగామి క్రియాశీల శ్రేణుల్ని విప్లవాత్మక పోరాటానికి సమీకరించే విషయంలో విఫలమైంది. ఈ జనసామాన్యాన్ని జాతీయ కాంగ్రెస్ ప్రభావం నుంచి దూరం చెయ్యలేక పోయింది. ఆ కమ్యూనిస్టు పార్టీ యీ దిశలో కొన్ని పాక్షిక విజయాలు సాధించినప్పటికీ యీ పనిని చెయ్యలేకపోయింది.

జనసామాన్యం గాంధీ నాయకత్వంపట్ల, సామ్రాజ్యవాదంతో లొంగుబాటు దారులపట్ల, సమాధానకర్తలపట్ల తమ అసంతృప్తిని

తెలిపినాకూడా, అదే సమయంలో కాంగ్రెస్‌కు దూరం కాలేదు. ఒక విధంగా సంస్కరణవాద జాతీయ బూర్జువా వర్గం, ఉదార భూస్వాముల నాయకత్వంలోవున్న సామ్రాజ్య వాదానికి సమస్త జాతీయ వ్యతిరేకతకు ప్రాతినిధ్యం వహించారు.[7]

భారత కమ్యూనిస్టు పార్టీకి సమైక్య సంఘటన ఆచరణ మార్గాన్ని అమలు పరచవలసిందిగా సూచించిన రజనీ పామీదత్తు, బెన్‌బ్రాడ్లీ సిద్ధాంత వ్యాసం 1936, ఫిబ్రవరి 29వ తేదీన *ఇంప్రికార్‌*లో ప్రచురించబడింది. అది ఆరవ మహాసభ. కాంగ్రెస్ వ్యతిరేక వేర్పాటువాద మార్గానికి, ఏడవ మహాసభ సూచించిన జాతీయ సంఘటనాదృష్టి కోణానికీ మధ్య ఊగిసలాటని తొలగించింది. అప్పటిదాకా సంస్కరణవాద సంస్థలతో కలిసి సమైక్యంగా పనిచెయ్యాలన్న రాజకీయ విధానంలో మార్పును ఆమోదించడం భారత కమ్యూనిస్టులకు కష్టమైంది. కాని, యూరప్‌లోని సంఘటనలు, ఫాసిజం ఆవిర్భావం, ప్రతిఘటన కోసం ప్రజాసంఘటనల అవసరం వారియొక్క మనోభావాలని మార్చాయి. దేశంలో నూతన విధానాన్ని వివరించేందుకు జోషి కీలకపాత్ర వహించాడు.

కార్మికవర్గ సమూహాల్లో కొద్దిమంది సభ్యులుఉన్న చిన్నదైన భారత కమ్యూనిస్టు పార్టీలో యీ నూతన విధానంపట్ల అంతర్గత ప్రతిఘటన ఉంది. జనసామాన్యపు వర్గ ప్రయోజనాలకి కాంగ్రెస్ ప్రాతినిధ్యం వహించడం లేదు. భవిష్యత్తులో సైతం కాంగ్రెస్ ఆ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించదని భారత కమ్యూనిస్టుల్లో అత్యధిక సంఖ్యాకులు భావించారు. కాంగ్రెస్‌లో, మితవాద పక్షం ప్రాపకం (Right wing) 1934 సమయంలో వ్యాపార వర్గపు ఒత్తిడిల మూలంగా తన పలుకుబడిని సంఘటితం చేసుకుంది.

అయితే, యీ కథకి మరో పార్శ్వం ఉంది. కొమింటర్న్ (1935) ఏడవ మహాసభకి ముందు, మీరట్ జైలునుంచి విడుదలైన మీదట కమ్యూనిస్టులు వేర్పాటువాద మునకనుంచి బయటపడే ఒక మార్గాన్ని కార్మిక సంఘాల ఐక్యతద్వారా, జాతీయవాదుల్లో వామపక్షీయులతో కలిసి సామ్రాజ్యవాద

---

7. వివరాలకోసం శోభన్‌లాల్ దత్ గుప్తా రాసిన పుస్తకంలో 183-184 పేజీలు.

వ్యతిరేక ప్రాతిపదికన కలిసి పనిచేయడం ద్వారా వెతక నారంభించారు. ఆ విధంగా సామ్రాజ్యవాద వ్యతిరేక కూటమి ఏర్పడింది. సాధారణంగా డాక్ అని పిలువబడే డా.గంగాధర్ అధికారి కమ్యూనిస్టు పార్టీకి జనరల్ సెక్రటరీ కావలసిందిగా ప్రోత్సహించబడ్డాడు. కాని, నేత కార్మికులచేత దేశవ్యాప్త జనరల్‌సమ్మె చేయించేందుకు తీవ్రంగా కృషి చేస్తున్నందున అందరు కమ్యూనిస్టుల్ని బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేసింది.

సరిగ్గా అదే కీలక సమయంలో 28 ఏళ్ల పి.సి.జోషి కొత్తగా ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీ ఆధిపత్యాన్ని తీసుకున్నాడు. పార్టీ పనులకు అవరోధాలు లేకుండా కొనసాగేందుకుగాను పార్టీ కేంద్రాన్ని ఏర్పాటు చేసేందుకు మధ్యమధ్య ప్రయత్నాలు జరిగాయి. జైల్లోనూ, బయటా విస్తృతమైన వేర్పాటు ధోరణీ, ముఠా తగాదాలూ కమ్యూనిస్టుల్ని పోరాడే బృందాలుగా వేరుచేశాయి. అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపించే విషయంలో సాధ్యాసాధ్యాల్నీ జాతీయోద్యమానికి అభిముఖంగా కమ్యూనిస్టుల రాజకీయ వ్యూహాలనీ, దానికి తోడు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఏడవ మహాసభ మార్గదర్శకాలకు అనుగుణంగా సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయసంఘటన అవకాశాన్ని కనుగొనాల్సిందిగా రజనీ పామీదత్తుకు సందేశం పంపబడింది. బొంబాయి, కలకత్తా, కాన్పూర్‌లలో పనిచేస్తున్న కమ్యూనిస్టు గ్రూపుల అగ్రనాయకులు అందర్నీ ఆయన కలుసుకుని, వాళ్లు తమ పనిలో తాము నిమగ్నులై వుండటం గమనించాడు. వాళ్లలో ఒకే ఒక్క మినహాయింపు యువశక్తివంత పి.సి. జోషి. పార్టీని రాజకీయ ఒంటరితనం నుంచీ, ముఠాతత్వం నుంచీ బయటికి తేవాలని, కమ్యూనిస్టులు మొత్తం భారతదేశం ముందున్న ప్రయోజనాలకు, కర్తవ్యాలకు సంబంధితులు అవగలుగుతారని, విస్తృత జాతీయ సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనలో చేరనున్న కమ్యూనిస్టుల గురించి తలుచుకోగలరన్న విస్పష్టమైన దృష్టి జోషి కలిగివున్నాడు. ఈ ప్రకంపించే యువకుడి విషయంలో ప్రభావితుడైన రజనీ పామీదత్తు, అతని పేరును అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సంబంధిత సంస్థలకు సిఫారసు చేశాడు. దాని ఫలితంగా, అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపించే బాధ్యత వహించమని జోషి సూచించ బడ్డాడు. కానైతే, తర్వాత కొద్ది విచారంతో దానిని గురించి జోషి ఇలా

రాశాడు. "ఈ బాధ్యత నా జీవితంలో మరీ ముందుగా నాకు లభించింది. దీర్ఘక్రమంలో అది పార్టీకీ, నాకూ చాలా అధిక మూల్యం అయింది."

పి.సి.జోషి జైలు నుండి విడుదలయ్యాక భారత కమ్యూనిస్టు పార్టీ (సి.పి.ఐ) ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించాడు. అజయ్ ఘోష్, ఆర్.డి భరద్వాజ్‌లతోపాటు, పి.సి.జోషి అసంఘటిత బృందాలను అండర్ గ్రౌండ్ (రహస్య)పార్టీ కేంద్రంగా, సంయోగపార్టీ రూపంలో ప్రారంభించాడు. అప్పట్లో పార్టీ చట్టవిర్ధుమైనది కనుక రహస్యంగా ప్రారంభించి, కరపత్రాలు వెలువరించసాగాడు. చెల్లా చెదురుగావున్న పార్టీ గ్రూపులన్నింటిని ఐక్యం చేసేందుకు జోషీ ఫలవంతమైన చర్యలు తీసుకున్నాడు. కట్‌దరే వంటి రహస్య పార్టీ కార్యకర్తలద్వారా, ఐ.సి.ఎస్.గా కలకత్తాలో ఉద్యోగంలో నియమించబడిన మైఖేల్ కారిట్‌తోను, బొంబాయిలోని మైకేల్ స్కాట్‌తోనూ సంబంధాలు పెట్టుకొని, 1936 జూన్‌లో ఒక సమావేశం జరిపారు. ఈ సమావేశానికి పి.సి.జోషి, అజయ్ ఘోష్, భరద్వాజ్, మైకేల్ స్కాట్‌లు హాజరయ్యారు. జోషీ 1936 జూన్‌లో సూరత్‌లో జరిగిన తాత్కాలిక కేంద్ర కమిటీ సమావేశంలో పార్టీ జనరల్ సెక్రటరీగా ఎన్నుకోబడి, 1948 వరకు ఆయన ఆ స్థానంలో కొనసాగాడు. పార్టీ కేంద్రకార్యాలయం కలకత్తాలో ఏర్పాటు చెయ్యబడింది. పశ్చిమ ప్రాంతంలో పార్టీ కార్యక్రమాలను సమీకరించేందుకు అజయ్‌ఘోష్, ఉత్తర ప్రాంతంలో భరద్వాజ్, దక్షిణ ప్రాంతానికి ఎస్.వి.ఘాటే నియమించబడ్డారు. డా.జి.అధికారి కలకత్తాలోని కేంద్రంలో చేరాడు.

వామపక్ష జన సామాన్యపు ఉద్యమాల చరిత్రలో 1936 సంవత్సరం ఒక మైలురాయి. పి.సి.జోషి సి.పి.ఐ. జనరల్ సెక్రటరీ అవడమే కాకుండా, ప్రగతిశీల రచయితల సంఘం, అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్, ఛత్రి సంఘాల ఆవిర్భావాన్ని కూడా 1936 చూసింది. 1935 జూన్ 21 వతేదీన పారిస్‌లో జరిగిన అంతర్జాతీయ రచయితల మహాసభ తర్వాత, జోషి భారతదేశంలో అభ్యుదయ రచయితల సంఘాన్ని ఏర్పాటు చెయ్యవలసిన అవసరాన్ని గుర్తించాడు. ఇది ఫాసిజానికి వ్యతిరేకంగా, సంస్కృతిని కాపాడేందుకు మాక్సిమ్ గోర్కీ, లూయీ ఆరగన్, ఆంద్రే మల్‌రాక్స్,

ఇ.ఎమ్. ఫోర్‌స్టర్ వగైరాలు పాల్గొన్న సమీకరణ అంశం. అక్కడ రచయితలు, సైంటిస్టులు, మేధావులు, మొదలైన వారిని ఫాసిస్టు శక్తులు విస్తృతంగా హింసించడం జరిగింది. అక్కడ ప్రజాస్వామ్యానికి స్థానం లేకపోవడంతో వారిలో చాలామంది తమ దేశాలను వదిలి వెళ్లవలసి వచ్చింది. చివరకు ప్రపంచ ప్రఖ్యాత సైంటిస్టు ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ సైతం జర్మనీని వదిలి వెళ్ళిపోవలసి వచ్చింది. ఆ ప్రపంచ సమావేశం భారతదేశంలో ప్రగతిశీల మరియు ఫాసిస్టు వ్యతిరేక సాంస్కృతిక ఉద్యమాన్ని ప్రారంభించాల్సిన అవసరాన్ని సూచించింది. దాని ప్రాముఖ్యతను జోషీ గ్రహించి, త్వరలో ఒక ముసాయిదాను తయారు చేశాడు. 1936 ఫిబ్రవరిలో, అది విడుదల చేయబడింది. దానిమీద ఆనాటి ప్రఖ్యాత భారతీయ రచయితలు సజ్జాద్ జహీర్, ప్రేమ్‌చంద్, ఆబిద్ హుస్సేన్, దయానారాయణ్ నిగమ్, అబ్దుల్ హక్‌తో పాటు మరికొందరు సంతకాలు చేశారు. ఆ ప్రయత్నం కళని జనానికి మరింత సన్నిహితం చెయ్యడం. దేశవ్యాప్తంగా వచ్చిన ప్రతినిధులు 1936 ఏప్రిల్ 10న లక్నోలో సమావేశమయ్యారు. పెద్దగా సన్నాహాలు లేకుండా ఆ తొలి అఖిల భారత అభ్యుదయ రచయితల సమావేశంలో రాజకీయంగా, సామాజికంగా నిబద్ధులైన రచయితలు సృజనాత్మక రచనకు ఓ కొత్త విస్తృతిని సమకూర్చారు. అభ్యుదయ రచయితల శాఖలు కలకత్తా మొదలగు నగరాల్లో ప్రారంభించబడ్డాయి. పి.సి.జోషి మేధావుల్లో విపుల శ్రేణుల్ని శ్రామిక జన సామాన్యంపట్ల సున్నిత గ్రాహ్యతని కలిగించాడు. రైతుల దుస్థితిని వర్ణించిన ప్రేమ్‌చంద్ *'గోదాన్'* (1936), ఆయన అంతకు ముందు గాంధేయ ఆదర్శవాదాన్ని చిత్రిస్తూ రచించిన *'రంగభూమి'* నవల (1925)కు ఎంతో స్పష్టమైన దూరంలోఉంది. ఈతరం రచయితలు ఫాసిస్టు వ్యతిరేక, భూస్వామ్యవ్యతిరేక ప్రజా సంస్కృతిని సృష్టించారు. పి.సి.జోషి పార్టీ జనరల్ సెక్రటరీ మొత్తందశ అంతట్లోనూ కొనసాగింది. 1938లో ఫరీదాబాద్‌లో జరిగిన రైతు కవుల కాన్ఫరెన్సునాటి నుంచి, 1945 అక్టోబరు 14-17 తేదీల్లో హైదరాబాదులో జరిగిన తొలి అఖిల భారత ఉర్దూ అభ్యుదయ రచయితల కాన్ఫరెన్సుదాకా యీ ధోరణి కొనసాగింది. దీనిని సరోజినీ నాయుడు ప్రారంభించారు.

గాంధీయిజం తన పలుకుబడిని కోల్పోయింది, విప్లవాత్మక వీరత్వం

సైతం అంతరించసాగింది. విద్యార్థుల్లో అధిక సంఖ్యాకులు వామపక్ష సిద్ధాంత ప్రభావంలోకి వచ్చారు. అఖిల భారత విద్యార్థి సంఘం (ఎ.ఐ.ఎస్.ఎఫ్) 1936లో ఏర్పాటు చెయ్యబడింది. స్థానిక, జాతీయ, అంతర్జాతీయ సమస్యలు ఏకమై విద్యార్థులకు ఒక నూతన దృష్టికోణాన్ని కలిగించాయి. 1937-38లో రాజకీయ ఖైదీలనందరినీ విడుదల చెయ్యాలని అఖిల భారత విద్యార్థి సంఘం తన ఉద్యమాన్ని ప్రారంభించింది. విద్యార్థి సంఘాల ఎన్నికలు జరగాలని డిమాండు చేసింది. స్పానిష్ అంతర్యుద్ధ కాలంలో స్పానిష్ ప్రజలతోనూ, జపాన్ దురాక్రమణకి వ్యతిరేకంగా చైనీయులు పోరాడినప్పుడూ విద్యార్థి సంఘాలు స్పెయిన్, చైనా ప్రజలకు సంఘీభావంగా ప్రదర్శనలు చేశాయి. వయోజన విద్యాపోషక ఉద్యమంకోసం సాంఘిక కృషితోబాటు, సామ్రాజ్యవాద ప్రమాదానికి వ్యతిరేకంగా రాజకీయ పోరాటం జరిపి, పెంపొందుతున్న విద్యార్థి ఉద్యమానికి ఓ కొత్త అర్థాన్ని సాధించారు. ప్రప్రథమంగా యువకులకు స్త్రీలకు జాతీయ సమస్యలను అంతర్జాతీయ సమస్యలతో అనుసంధించడం నేర్పారు.

విద్యార్థి కామ్రేడ్సుకు పి.సి.జోషి త్వరలోనే ఉత్తేజకారకుడయ్యాడు. తన రాజకీయ చర్చలల్లో, సామ్రాజ్యవాదం గురించి, ఫాసిజం గురించి కమ్యూనిస్టులకూ, జాతీయ వాదులకూ మధ్య తప్పనిసరి సంయుక్త సంఘటన అవసరం గురించి వారి పనిలోనూ, వారి అధ్యయనంలోనూ ఉండాలని సూచించాడు. వారి విద్యా సంబంధిత జీవితంలో అత్యుత్తములు కమ్మని విద్యార్థులకు చెప్పాడు. అప్పుడు యితర విద్యార్థులు వారిని ఉన్నతంగా చూస్తారనీ, అలాచేస్తే వారిని మీకు దగ్గరివారిగా చేసుకునేందుకు మీ కృషి తోడ్పడుతుందనీ సలహా యిచ్చాడు. పి.సి.జోషి వారికోసం అధ్యయన తరగుతులను నిర్వహించాడు. ఉపన్యాసాలు చేశాడు, వారికి వ్యక్తిగత సలహాలు కూడా ఇచ్చాడు. కొన్నిసార్లు వ్యక్తిగతంగానూ, మరికొన్నిసార్లు సామూహికంగా ఇచ్చాడు.

పూర్వపు అఖిల భారత విద్యార్థి సంఘపు ప్రధాన కార్యదర్శి అయిన సత్యపాల్ డాంగ్ తన విద్యార్థి రోజులను జోషి తనకు ఇచ్చిన సలహాను యిలా గుర్తుచేశాడు.

నువ్వు నిద్రపోయే ముందు ఆరోజున పగటిపూట ఏయే పనులు చేశావో వాటి గురించి ఆలోచించు, వాటిలో ఏది సరైనదో, ఏది పొరపాటైనదో ఆలోచించి, యికపై అలాంటి పొరపాట్లు చెయ్యకూడదని నిర్ధారణ చేసుకో.

రజనీ పామీదత్తు, జవహర్ లాల్ నెహ్రూని స్విట్జర్లాండులో కలుసుకుని యీ క్రింది అంశాలు చర్చించాడు. భారతదేశంలో పోరాడుతున్న జనం అందర్నీ కలిపి ఒక విస్తృతమైన సమైక్య సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ సంఘటన చర్సాస్థలంగా భారత జాతీయ కాంగ్రెస్‌ను అభివృద్ధి చెయ్యాలని సూచించాడు. నెహ్రూయే అధ్యక్షత వహించిన లక్నో కాంగ్రెస్ సమావేశం (1936) సమయంలో, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రతినిధులతోబాటు జోషి నెహ్రూని కలుసుకున్నాడు. అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌నీ, అఖిల భారత రైతు సంఘాన్నీ, భారత జాతీయ కాంగ్రెస్‌తో అనుసంధించాలన్న సూచనకు నెహ్రూ ఆమోదం తెలిపాడు. ఆయన జోషిని మహాత్మాగాంధీ దగ్గరికి తీసుకెళ్లాడు. ఆ ప్రతిపాదనను గాంధీ ఆమోదించాడు. వల్లభాయ్ పటేల్ కూడా తన ఆమోదాన్ని తెలిపాడు. జోషి పటేల్‌ని కలుసుకున్నాడు. కమ్యూనిస్టులు కాంగ్రెస్‌లో చేరేందుకైనా ఆమోదించాలి, లేదా రైతు, కార్మిక సంఘాలను అనుబంధించేందుకైనా పోరాడాలని సర్దార్ పటేల్ హెచ్చరించాడు. దానికి జోషి కమ్యూనిస్టులు కాంగ్రెస్‌లో ఉంటారనీ, అఖిల భారత కార్మిక సంఘం (AITUC), అఖిల భారత రైతు సంఘాల (AIKS)ను భారత జాతీయ కాంగ్రెస్ (INC)తో అనుసంధించేందుకు పోరాడుతారనీ గట్టిగా సమాధానం యిచ్చాడు. జోషి తన రాజకీయ దృఢవిశ్వాసాలతో ఎన్నడూ రాజీపడలేదు.

స్థానిక సమస్యలపైన రైతు ఊరేగింపులూ, సమావేశాలూ, పోరాటాలూ జరుగుతున్న దశ అది. లక్నోలో 1936 ఏప్రిల్‌లో జరిగిన అఖిల భారత కిసాన్ సభ తొలి సమావేశం అఖిల భారత రైతు సంఘ స్థాపన నిర్ణయం తీసుకుంది. 1936 నాటి రైతు ప్రణాళిక జమీందారీ వ్యవస్థను రద్దు చెయ్యాలనీ, వ్యావసాయిక ఆదాయాలపైన పరిమితమైన పన్నులను విధించాలనీ, బాకీలను రద్దుచెయ్యాలనీ సూచించింది. "సాగుబడిలో లేని

ప్రభుత్వ, జమీందారీ భూములను ఐదు ఎకరాలకంటె తక్కువవున్న, అసలు భూమిలేని రైతులకు బదిలీ చెయ్యాలి"అని కూడా అది సూచించింది.[8] బెంగాల్‌రాష్ట్ర రైతు సంఘం 1937 మార్చిలో బంకూరా జిల్లాలో స్థాపించ బడింది. రైతు సంఘ సభ్యత్వం 1938లో 5 లక్షలకు పెరిగింది. జోషి ఉత్తరప్రదేశ్ రైతు ఉద్యమంపట్ల ప్రత్యేక శ్రద్ధ చూపాడు. దాని రాజకీయ ప్రాముఖ్యం గురించి 1938 సెప్టెంబరు 4వ తేదీ *నేషనల్ ఫ్రంట్* సంచికలో రాశాడు. 1937 జూలైలో ఉత్తరప్రదేశ్ కిసాన్ కమిటీ స్థాపన ఐక్య జాతీయ సంఘటన విధానానికి రైతు కార్మికులను వారి స్వీయానుభవం ద్వారా అఖిల భారత కిసాన్ సభలోకి నడిపేందుకు అనుగుణంగావుంది. భూస్వామ్య విధానాన్ని రద్దుచెయ్యడం, రైతులకు అనుకూలంగా కౌలుదారీ చట్టాన్ని మార్చడం ఉత్తరప్రదేశ్ రైతు సంఘ కమిటీ స్వీకరించిన సమస్యల్లో కొన్నింటిని గురించి జోషి యిలా రాశాడు:

> రైతు ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్‌ను అత్యంత వామపక్ష కాంగ్రెస్‌గా చేశాడు. ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ మంత్రివర్గాన్ని బాగా పురోగమించేలా చేశాడు. సుదూరంగా వ్యాపించిన రైతు ఉద్యమాన్ని అక్కడక్కడ వుండే రైతు ఉద్యమం కంటె బాగా ముందుకు తీసుకువెళ్ళాడు.[9]

1937తో పోలిస్తే 1938లో కార్మిక సంఘాల సభ్యత్వం కూడా 50 శాతం పెరిగింది. అఖిల భారత కార్మిక సంఘం (AITUC), కార్మిక సంఘాల జాతీయ సమాఖ్య (NFTU)కి సన్నిహితమైంది. కార్మిక ఉద్యమం అత్యధికంగా వామపక్ష నాయకత్వంలో ఉన్నప్పటికీ 1938 ఏప్రిల్‌లో నాగపూర్‌లో ఒక సంయుక్త సమావేశం జరిగింది. వివిధ పారిశ్రామిక విభాగాల్లో సమ్మెలు జరిగాయి. వేలాది కార్మికులు నిరసన ప్రదర్శనల్లో పాల్గొన్నారు.

కమ్యూనిస్టు పార్టీ కలకత్తాలోని బుర్రాబజారు వాణిజ్య కేంద్రంలో ఒక కార్యాలయాన్ని తెరిచింది. అదొక ధైర్యవంతమైన సాహసం. కానీ, జోషి,

---

8. వివరాలకు సుమీత్ సర్కార్, *మోడర్న్ ఇండియా* చూడండి, పు 340.
9. పి.సి.జోషి, 'యు.పి.కిసాన్ మూవ్‌మెంట్', *నేషనల్ ఫ్రంట్* 1938, సెప్టె. 4.

అధికారి, సర్దార్ పృథ్వీసింగ్‌కు వ్యాపార సహచరులమాదిరి తమ నిజరూపం తెలియకుండా పార్టీ కార్యాలయానికి హాజరయ్యారు. రోజువారీ ఖర్చులను భరించేందుకు కలకత్తాలోని పార్టీకి నియమితమైన నిధులు లేవు. స్థానిక కామ్రేడ్లు, హోల్‌టైమర్లు ట్యూషన్లమీద ఆధారపడి, పార్టీ కోసం ఐచ్ఛికంగా పనిచేశారు. బుర్రా బజారులోని పార్టీకార్యాలయపు ఖర్చుల గురించి తనకి ధనిక వ్యాపారులతో సంబంధాలు ఉన్నాయి కనుక సర్దార్ పృథ్వీసింగ్ శ్రద్ధ తీసుకున్నాడు. తన సంబంధీకుల నుంచి నిధులను పోగు చేసేందుకు జోషి తరుచు కలకత్తా వెలుపలి ప్రాంతాలకు పర్యటనలు చేశాడు.

పార్టీకి ఉత్పత్తి కేంద్రం ఒక ఉంది. అది *ది కమ్యూనిస్ట్‌*ను వెలువరించింది. దానిలో సమైక్య సంఘటన ఎత్తుగడలను వెల్లడించేందుకు సైద్ధాంతిక సమస్యలపైన వ్యాసాలు ప్రచురించబడేవి.

1937 ఎన్నికల్లో ఏడు రాష్ట్రాల్లో కాంగ్రెస్ అధికారంలోకి వచ్చింది. ఆ రాష్ట్రాల్లో కమ్యూనిస్టులు విడుదల చెయ్యబడ్డారు. వాళ్ళు అక్కడ స్వేచ్ఛను అనుభవించగలిగారు. పార్టీ కేంద్ర కార్యాలయాన్ని బొంబాయికి మార్చాలని నిర్ణయించబడింది. ఏడు రాష్ట్రాల్లోని ఆ రాష్ట్రం పార్టీ ఎదుగుదలకు సానుకూలమైన పరిస్థితులు కలిగి వుంది. అక్కడికి చట్టబద్ధమైన పత్రిక స్థాపనకు అవసరమైన ఏర్పాట్లు చేసేందుకు డా.అధికారి పంపబడ్డాడు. మద్రాసులోని హెచ్.డి.రాజా యొక్క 'న్యూ ఏజ్' పార్టీ తరపున ఎస్.వి. ఘాటే తన చేతుల్లోకి తీసుకున్నాడు. పార్టీని నిర్మించేందుకు అత్యంత కీలకమైన సమయం అది. పి.సి.జోషి పార్టీ ప్రధాన ఆర్గనైజరుగా వ్యవహరించాడు. ప్రతి సంవత్సరం ఒకసారి కంటె ఎక్కువసార్లు ప్రతి ఒక్క రాష్ట్రానికే వెళ్లాడు. అక్కడ భవిష్యత్తులో పార్టీ నాయకులయ్యేందుకు, వివిధ ప్రజా సంఘాల నాయకులయ్యేందుకూ కామ్రేడ్సుకి సహాయం చేశాడు.

> సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటన స్థాపనకోసం జోషి రాజకీయ పార్టీల యితర నాయకులను కలుసుకోవడంలో తన అత్యధిక కాలాన్ని వెచ్చించాడు. విపులమైన చర్చకోసం జోషి జయప్రకాశ్ నారాయణ్‌ను అదే సమయంలో కలిశాడు. విస్తృతమైన సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కమ్యూనిస్టులతో ఐక్యం

కావాలన్న నిర్ణయానికి ముందు జరిగిన విషయం యిది.

1938 మొదట్లో పార్టీ కేంద్ర కార్యాలయం బొంబాయికి మార్చబడినప్పుడు, పి.సి.జోషి అక్కడినుంచి తన సంపాదకత్వంలో *'నేషనల్ ఫ్రంట్'* వార పత్రికను వెలువరించాడు. తన రాజకీయ విధానాన్ని ముందుకు తీసుకెళ్లేందుకుగాను 1930, 1940 దశకాల్లో పి.సి.జోషితో కలిసి పనిచేసిన అతని సహచరుడు గోవింద్ విద్యార్థి *నేషనల్‌ఫ్రంట్* కార్యాలయంలో ఆ రోజుల్లో జరిగిన కార్యకలాపాలను జ్ఞాపకం చేసుకున్నాడు.

> అంతకంతకు పెరుగుతున్న కార్మికుల, రైతుల, విద్యార్థుల, మేధావుల సామూహిక ఉద్యమాలకు అది త్వరలోనే ఆలోచనా కేంద్రం అయింది. చట్ట వ్యతిరేక పార్టీకి బహిరంగ కార్యాలయంలా కూడా పనిచేసింది. ఆర్గనైజరుగా పి.సి.జోషి సాటిలేని సామర్థ్యం, రోజుల తరబడి అలసట లేకుండా పనిచేసే సామర్థ్యం ఆయనతో కలిసివున్న మమ్మల్నందరినీ విభ్రాంతి పరచింది.[10]

ఈ వారపత్రిక సంపాదకవర్గంలో పి.సి.జోషి, అజయ్ ఘోష్, ఆర్.డి. భరద్వాజ్ డా.జి.అధికారిలు వున్నారు. ఆ పత్రిక పార్టీ భావాల ప్రచారం సాదనం మాత్రమే కాకుండా, సంయుక్త ఆర్గనైజరుగా కూడా పనిచేసింది. అది త్వరలోనే భారత కమ్యూనిస్టు పార్టీకి గుర్తింపును తెచ్చింది.

పార్టీ చట్టవిరుద్ధమైనదైనప్పటికీ, పి.సి.జోషి ఆ పత్రికను రహస్యంగా నిరంతరంగా ప్రచురించాడు. గతంలో మాదిరిగా ప్రధాన రాజకీయ స్రవంతికి దూరంగా ఉండటాన్ని భగ్నంచేసి, జాతీయ పోరాటంలో చేరడంలోని ప్రాముఖ్యతను తెలియజెప్పి కమ్యూనిస్టు పార్టీ స్థానాన్ని సుస్పష్టం చేశాడు. జాతీయోద్యమంలో కమ్యూనిస్టుల కృషిని ఒక ముఖ్య రాజకీయ శక్తిగా ధ్రువీకరించేందుకు ఆయన ప్రయత్నించాడు.

1938 ఏప్రిల్ 17న 'జాతీయ కాంగ్రెస్-కార్మిక వర్గం' అనే అంశం

---

10. గోవింద్ విద్యార్థి, 'రిమెంబరింగ్ పి.సి.జోషి', మెయిన్ స్ట్రీమ్, నవంబరు 15, 1980.

మీద పార్టీ ముసాయిదా సిద్ధాంతాన్ని వెలువరించగా, అందులో యిలా చెప్పబడింది.

> భారత శ్రామికవర్గం మనదేశంలో సాగుతున్న రాజకీయపోరాటంలో పాల్గొంటేగానీ, మొత్తం భారత ప్రజల ప్రజాస్వామ్య హక్కుల సాధనలో మిక్కిలి సాహసవంతమైన వీరునిలా ముందుకు వస్తేగానీ, జాతీయ కాంగ్రెస్ నాయకత్వంలో సాగుతున్న స్వాతంత్ర్య పోరాటంలో అగ్రభాగంలోకి తనని తాను నెట్టుకుంటేగానీ, విదేశీ సామ్రాజ్యవాదపు పాలనకు వ్యతిరేకంగా ప్రజలందరి పోరాటాన్ని విస్తృతం చేయడం, సమైక్యం చేయడంలో ప్రధానపాత్ర వహిస్తేగాని శ్రామికజన సామాన్యపు సామాజిక విముక్తి సాధన సమస్యలో తను యిముడలేదు.[11]

స్వాతంత్ర్య పోరాటంలో భాగస్వామ్యం దిశగా పి.సి.జోషి నాయకత్వంలో కమ్యూనిస్టులు జాతీయస్థాయిలో పాల్గొన్న కాలమది. 'జాతీయ కాంగ్రెస్-శ్రామిక వర్గం' గురించి రాసిన ముసాయిదా సిద్ధాంతం ప్రకారం-

> యీ క్రింది పనులు చేస్తేగాని కమ్యూనిస్టులు దేశంలో ఒక రాజకీయ శక్తిగా మారటం సాధ్యంకాదు. భారత జాతీయ కాంగ్రెస్‌పట్ల మన వైఖరినంతనీ నిర్ణయాత్మకంగా మార్చుకోవడం, కాంగ్రెస్ లోపలే మనం ఒక నిర్ణయాత్మక శక్తి అవడం, జాతీయ కాంగ్రెస్ ప్రాతిపదికమీద సమైక్య జాతీయ సంఘటనను మొత్తం వామపక్షీయులను వారి సోషలిస్టు అంతర్భాగాన్నీ సమైక్యంచేసి, జాతీయ కాంగ్రెస్ ప్రాతిపదికపైన యునైటెడ్ నేషనల్ ఫ్రంట్ నిర్మించి, తద్వారా అత్యంత నిలకడైన చిత్తశుద్ధి కలిగిన సమర్థులుగా ముందుకు వెళ్లడం మనలో ప్రతి ఒక్కరూ కాంగ్రెస్ సభ్యులవడం మాత్రమే కాక, శ్రామికులు అందరినీ మొత్తంగా కాంగ్రెస్ సభ్యుల్ని చెయ్యడంకోసం మనం ముమ్మరమైన ఉద్యమం విధిగా ప్రారంభించాలి.[12]

---

11. *నేషనల్ ఫ్రంట్,* ఏప్రిల్ 17,1938.
12. *నేషనల్ ఫ్రంట్,* ఏప్రిల్ 17, 1938.

జాతిని ముందుకు నడిపేందుకు వామపక్ష అభ్యర్థి అయిన సుభాష్ బోసును తిరిగి కాంగ్రెస్ ప్రెసిడెంటును చెయ్యాలని 1938, అక్టోబరు 16న సంపాదకీయంలో ప్రతిపాదించిన తొట్టతొలి పత్రిక *నేషనల్ ఫ్రంట్.* ఆ పత్రిక తన సంపాదకీయంలో యిలా పేర్కొంది:

> కమ్యూనిస్టులు, కాంగ్రెస్ సోషలిస్టులు, రాయిస్టులు మరియు వామపక్ష కాంగ్రెస్ సభ్యులు ఒక వామపక్ష కూటమిగా ఏర్పడేందుకు ప్రయత్నాలు చేస్తున్నారు. ఎన్నికల ప్రచారక్రమంలో, వామపక్ష కూటమి పదిలంగా తన కాళ్లమీద తను నిలబడాలి, మొత్తం కాంగ్రెస్ వారిలో యిమడ్చ బడాలి. ఈనాటి పరిస్థితిలో, వామపక్షమే కాంగ్రెస్ కార్యక్రమానికి అత్యంత విశ్వసనీయమైనది.[13]

సుభాష్ బోసు విజయాన్ని పి.సి.జోషి ఒక ప్రముఖమైన విజయంగా ప్రశంసించాడు. ఒక సంపాదకీయంలో ఆయన యిలా రాశాడు:

> నాయకత్వపు ఆదేశం భిన్నంగా ఉన్నా, కాంగ్రెస్ సామాన్య సభ్యులు కోరినందున సుభాష్ బోసు విజయం సాధించాడు....కాంగ్రెస్ ఎల్లప్పుడూ ప్రాతినిధ్యం వహించిన యావత్తు జాతి సమైక్యత, పోరాడాలన్న దాని యిచ్ఛకు సుభాష్ బోసు రూపుదాల్చాడు.[14]

కాంగ్రెస్ త్రిపురి మహాసభ (1939)లో, చట్టవిరుద్ధమెదైనప్పటికీ భారత కమ్యూనిస్టు పార్టీ, సుభాష్ చంద్రబోసు కాంగ్రెస్ అధ్యక్షుడుగా తిరిగి ఎన్నికయ్యేందుకుగాను తన వనరులన్నింటినీ సమీకరించింది. ఆ పార్టీకి అది రాజకీయ పోరాటం.

కార్మికవర్గం, రైతులు విద్యార్థుల ఉద్యమాలను గురించీ, రాజ్యపు ప్రజా పోరాటాలను గురించీ వార్తలను ప్రచురించిన తీవ్రవాద పత్రిక *నేషనల్ ఫ్రంట్.* ఈ పత్రిక ఏ ఆర్థిక తోడ్పాటూ లేకుండా పనిచేసింది. తన రాజకీయ, నిర్వహణ పనులు ఎంతగా ఉన్నప్పటికీ, జోషి నిధులను పోగు చేసేందుకు

---

13. *నేషనల్ ఫ్రంట్,* సంపాదకీయం అక్టోబరు 16, 1938.
14. *నేషనల్ ఫ్రంట్,* ఫిబ్రవరి 5, 1939.

చాలా సమయాన్ని వెచ్చించాడు. ఆయన, శాంతా గాంధీ, నర్గీస్ బాట్లీవాలా, దిల్షాద్ చారి వంటి యువ కామ్రేడ్సునీ, యింకా చాలా మందినీ యీ పత్రిక కోసం నిధుల సమీకరణలో నిరంతరాయంగా పాల్గొనేందుకు సమీకరించాడు. జోషికి ప్రతిరంగంలోనూ అత్యుత్తమ ప్రతిభను గుర్తించే ప్రత్యేక సామర్థ్యం వుంది. తద్వారా ఆయన ప్రముఖ రాజకీయ కార్టూనిస్టు ఆర్.ఎస్.నాయుడు, ఫోటో జర్నలిస్టు డి.హెచ్.టెండుల్కర్‌లను గుర్తించాడు. వాళ్లిద్దరూ పత్రికకు తమ కార్టూన్లనూ, ఫోటోలనూ యివ్వడంతో, పత్రిక సుసంపన్నమైంది. జోషి పత్రిక అమ్మకపు బృందాల్లో సైతం చేరేవాడు. చౌపాటీలో లేక ఏ హాల్లో సమావేశం జరిపినప్పుడైనా జోషీ *నేషనల్‌ఫ్రంట్* సరికొత్త సంచికలను ఏ రాజకీయ పార్టీ అయినా అమ్ముతూ కనిపించేవాడు.

1939లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమవడంతో రాష్ట్రీయ కాంగ్రెస్ ప్రభుత్వాలు రాజీనామా చేశాయి. పి.సి.జోషి మరోసారి అండర్ గ్రౌండులోకి వెళ్లవలసి వచ్చింది. డా.అధికారితో కలిసి, పార్టీ పత్రికల్నీ, సాహిత్యాన్నీ ప్రకటించేందుకూ, దానికితోడు దేశమంతటా ప్రజాఉద్యమాల్ని సమన్వయం చేసేందుకూ రహస్య స్థావరాలను నెలకొల్పాడు. ఆ దశలో ఆయన పార్టీ యొక్క చట్టవ్యతిరేక రహస్య పత్రిక *'ది కమ్యూనిస్టు'* ను సైక్లోస్టైలు రూపంలో వివిధ జాతీయ, అంతర్జాతీయ సమస్యల విషయంలో పార్టీ స్థానాన్ని కామ్రేడ్లూ, జనసామాన్యమూ తెలుసు కునేందుకుగాను వెలువరించాడు. అది పార్టీకి పరీక్షా సమయం. గోవింద్ విద్యార్థి ఆ రోజుల్ని ఇలా స్మరించాడు:

> మేము ఆయన (పి.సి.జోషి)తో ఆ దశలో ఉన్నవాళ్లం. ఆయన ఎంతో ధృఢమైన మానసికశక్తీ, పట్టుదల, విశేషమైన సంఘటనాత్మక సామర్థ్యంతో దేశమంతటా పార్టీ పనిచేసేందుకు చేసిన కృషి మాకు తెలుసు. చాలా రాష్ట్రాల్లో పార్టీ అగ్రనాయకులు అరెస్టు చెయ్య బడినప్పుడు పార్టీ కేంద్రం నిరంతర దాడులకు గురి అయ్యే పరిస్థితి ఉన్నప్పుడు సైతం ప్రజా ఉద్యమాలను నిర్మించడం మేము చూశాం. ఆయన నిర్మాణ సంబంధమైన మేధస్సు కారణంగానే, కఠిన పరీక్ష అనంతరం దేశంలో జాతీయ కాంగ్రెస్ తర్వాత మిక్కిలి పెద్ద విడి

పార్టీగా కమ్యూనిస్టు పార్టీ అంతరించింది.[15]

జోషికి ఆనాడున్న పరిస్థితులపైన కలిగిన ప్రగాఢమైన అవగాహన మీరట్ జైలు జీవితపు రోజుల్లోని వర్గపోరాటపు హద్దులను సైతం అధిగమించింది. స్వాతంత్ర్యం కోసం జరిగిన జాతీయ పోరాటంలో శ్రామికవర్గపు రాజకీయ పోరాటపు భాగస్వామ్యాన్ని ప్రస్తుత దీర్ఘకాలిక దర్శనాన్ని సాధించింది. 1937 నుంచి 1939 వరకు మూడేళ్ళ స్వల్పకాలం లోపల కమ్యూనిస్టు పార్టీ భారతదేశంలో చిన్నదే అయినా గణనీయమైన వామపక్ష శక్తిగా ముందు కొచ్చింది.

---

15. గోవింద్ విద్యార్థి, రచన, మెయిన్ స్ట్రీమ్, నవంబరు 15, 1980.

# 3

# ప్రజాస్వామ్య సంఘటనా కర్త

పి.సి.జోషి ఒక సంఘటనాకర్తగా దాదాపు సాటిలేనివాడు. ఆయన పరస్పర చర్యల విధానం వ్యక్తిగతమైనవి, ప్రోత్సాహకమైనవి. అవి ఇటు ఆయనకు, అటు కమ్యూనిస్టు పార్టీకీ చాలామంది ప్రజలను సన్నిహితుల్ని చేశాయి. ఆయనకుగల ప్రజాసంబంధాలు, చూపించే ఆప్యాయత, సామాన్యభాష, మానవీయతలు రచయితలు, కళాకారులు, విద్యార్థులు, మేధావులతోబాటు జనసామాన్యానికి ఆయనను మిక్కిలి ప్రేమపాత్రుణ్ణి చేశాయి. నూతన పద్ధతుల కోసం, ఆలోచనను ఆచరణతో మిశ్రమం చేయడం, దేశభక్తిని అంతర్జాతీయతతో సమన్వయించడం, వాటన్నింటి కోసం ఆయన వెదికే అంతర్గ మానసిక లక్షణం భారతీయుల్లో అత్యధికుల్ని ఎంతో ఉత్తేజపరచి, ముందుకువచ్చి దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడేలా, అదే సమయంలో చిరకాల భూస్వామ్య విలువలకు వ్యతిరేకంగా పోరాడి, దోపిడీ రహితమైన న్యాయవంతమైన సమాజ నిర్మాణానికి తోడ్పడేలా ప్రోత్సహించింది.

ఆయన నాయకత్వం పార్టీ చరిత్రలోనే కాక, మన జాతి చరిత్రలో సైతం ఒక అత్యంత గణనీయమైన ప్రకరణం. మన జానపద సంప్రదాయంలో నాటుకునివున్న సంస్కృతి, కళల ద్వారా ఆయన ఓ కొత్తరకం సమగ్ర రాజకీయ ఉద్యమాన్ని ప్రారంభించాడు. ఫాసిస్టు వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల సమన్వయంలో, ఆయన బెంగాలు, కేరళ, ఆంధ్ర, పంజాబు వంటి దేశపు వివిధ ప్రాంతాల్లో ఏర్పడిన విడివిడి సాంస్కృతిక బృందాలను ఐక్యంచేసి, జనబాహుళ్యపు సాంస్కృతిక సమున్నతిగా పెంపొందించాడు. ఇది ఆ కాలపు యావన్మందిలో ఓ కొత్త ప్రగతిశీల

ధోరణిని చొప్పించింది. ఆయన మార్క్సిస్టు వైఖరి మొండిదీ, ఖండితమైనదీ, శాఖాభిమానమైనదీ కాదు. భారతీయ సంప్రదాయానికి భిన్న సమస్యలను సంబంధితం చేసే ఆయన సామర్థ్యంతో అదొక కొత్త అర్థాన్ని సమకూర్చింది. ఆయన దశ చాలా క్లిష్టమైన శకం. ప్రధానంగా అంతర్జాతీయ పరిస్థితి నుంచి ఉత్పన్నమైన క్లిష్ట సమస్యలతో నిండినది. ఆ పరిస్థితిలో, కమ్యూనిసుల్ని వారి రాజకీయ ఒంటరితనం నుంచి బయటకు తీసి, వారు జాతీయోద్యమంలో సంలీనమయ్యేందుకు సుదృఢ ప్రయత్నం చేశాడు, తోడ్పడ్డాడు. జాతీయ వాదుల్లో యితర బృందాలు కమ్యూనిస్టుల్ని మధ్య మధ్య కొంత అపార్థం చేసుకున్నా, కమ్యూనిస్టులకు జాతీయ దేశభక్తులుగా ఒక ప్రత్యేక స్థానాన్ని కల్పించేందుకు ఆయన కృషిచేసి సాధించాడు. అంతేకాదు, జనరంజక సాంస్కృతిక లక్షణంలో ఓ కొత్తరకమైన మార్గదర్శకులుగా ఉన్నాడు. సరిగ్గా ఇక్కడ, ప్రజా సామూహిక రాజకీయ సంఘంగా కమ్యూనిస్టు పార్టీని మార్చడంలో జోషి మద్దతు నిస్సందేహంగా ఉన్నతమైనది.

జోషి ప్రజాసంఘాలను పెంచి పోషించి, వాటి వేర్పాటువాద స్వభావాన్ని ధ్రువీకరించి, ఉద్యమానికి మరింత ఎక్కువమందిని సన్నిహితంచేసే విశాల స్వభావాన్ని వాటికి సంతరించాడు. అప్పుడున్న అఖిల భారత కార్మిక సంఘం, అఖిల భారత రైతుసంఘం మాత్రమే కాకుండా భారీ ప్రజాసంఘాలు విస్పష్ట రూపం ధరించిన సమయం అది. విద్యార్థులు, కళాకారులు, రచయితలు, మహిళలు, ప్రజాసంఘాలు, కమ్యూనిస్టేతరులతో, ప్రగతిశీల, దేశభక్త శక్తులతో కలిసి కమ్యూనిస్టుల సమావేశ కేంద్రాలుగా పనిచేశాయి. ఈ ప్రజా సంఘటనల్లో కమ్యూనిస్టు పార్టీ సభ్యుల పాత్రలను గురించిన స్పష్టమైన అవగాహన జోషికి వుంది. ఆ సంఘటనను విస్తృతం చెయ్యడం, ఆ సంస్థ పనిచెయ్యడంలో సహాయపడే సానుభూతి పరులను ఆ సంఘాల్లోకి తీసుకు రావడం, సైద్ధాంతికంగా కమ్యూనిస్టులకు మరింత సన్నిహితుల్ని చెయ్యడం జోషి ప్రధాన లక్ష్యం. ప్రతి ఒక్క కామ్రేడ్ కుటుంబంలో పార్టీపట్ల 'విస్పష్ట సానుభూతిపరుల' బృందం వుండేది. వారు అలా సన్నిహితంగా వున్నా వాళ్లు పార్టీ సభ్యులు కారు. సంక్షోభాల సమయాల్లో ఎంతో సహాయకులుగా ఉండేవారు. తరచు పార్టీకి ఆర్థికంగా సహాయం చేసేవారు, లేక పార్టీ

చట్టవిరుద్ధ సమయాలల్లో లేక యితర క్లిష్ట సమయాల్లో పార్టీ నాయకులకు ఆశ్రయం, రక్షణ యిచ్చేవారు.

పి.సి.జోషి ఎప్పుడూ ప్రజల భాషలోనే మాట్లాడేవాడు. ప్రతి కామ్రేడ్ కుటుంబంలోని పార్టీయేతర సభ్యులు, తల్లులు, జ్ఞాతులు, సోదరీ మణులతో, ప్రతి సంయుక్త కుటుంబపు బంధువులతో సౌహార్ద్రం, సాన్నిహిత్యం కలిగి వుండేవాడు. ఆత్మాభిమాన కమ్యూనిస్టు బృందాలకు వాళ్లు ఏదో రకమైన సహాయం చెయ్యాలని ఆయన భావించేవారు. జోషి కామ్రేడ్ల మరియు పార్టీ సానుభూతిపరుల మనసుల్లో సంఘంపట్ల ఎంతో గౌరవ భావాన్ని చొప్పించాడు. ప్రజల సంఘటనకర్తగా ఆయన పెద్ద తోడ్పాటు అది. ఆయన నిరాడంబరత, చిత్తశుద్ధి, ఆయన ఆకర్షణీయ ముఖంలోని సామాన్యమైన నవ్వు జనాన్ని ఆకర్షించే శక్తి కలిగివుంది. ఆయన మార్గాలు పరస్పర ప్రాతిపదికపైన వున్నాయి. ఏ ఒక వ్యక్తితోనైనా తొలి సమావేశంలోనే అతని వ్యక్తిగత నేపథ్యం, కుటుంబ సమస్యలు వగైరా తన ప్రశ్నల పరంపరతో ఆకర్షించగలిగేవాడు. ఆయన ఎంత వేగంగా మాట్లాడేవాడంటే, మాటలు ఆయన నోటినుంచి ధారావాహికంగా వెలువడేవి. కొన్ని సమయాల్లో వాటిని అర్థం చేసుకోవడం కష్టంగా వుండేది. ఆయన నేరుగా సమాజం, రాజకీయాలు, జాతిని గురించి మాట్లాడేవాడు. దేశ స్వాతంత్ర్యోద్యమం గురించీ, లేక వర్గరహిత సమాజం గురించీ తన భావాలను ఆ మాటలతో జోడించేవాడు. గోవింద్ విద్యార్థి, జోషిని మొట్టమొదట కలిసినప్పటి విషయాలను యిలా రాశాడు.

> నేను స్వయంగా కలిసినప్పుడు అది ప్రగాఢమైన వ్యక్తిగత అనుభవం. ఇంకెలాంటి సంశయం లేకుండా నన్ను నేను ఆయన చేతుల్లో పెట్టుకోగలనన్న వ్యక్తిని నేను చూశాను. ఆయనలో ఒక చిత్రమైన ఆప్యాయత, అంకితభావం చూశాను.[1]

వెనకటి కామ్రేడ్సు చాలామందికి ఆయన సరిగ్గా అలాగే అనిపించేవాడు. నిజానికి, అప్పటి తరంవారిలో చాలామంది యిప్పుడు సజీవంగా లేరు, ఆయన్ని చాలా సగౌరవంగా చూశారు. ఆయన ఒక ఉద్యమాన్ని, ఒక

---

1. జోషీ మరణానంతరం 'మెయిన్ స్ట్రీమ్'లో, నవంబరు 15, 1980.

ప్రజాసామూహిక సంఘాన్ని, ఓ పెద్ద కమ్యూనిస్టు దేశభక్తుల బృందాన్ని నిర్మించాడు.

1940 దశకపు తొలి సంవత్సరాల్లో, 'క్విట్ ఇండియా' ఉద్యమంలో చేరనందుకు కమ్యూనిస్టులు ద్రోహులుగా కించపరచబడినప్పటికీ, 1943లో బెంగాల్‌లో ఏర్పడిన దుర్భిక్షం కారణంగా కలకత్తా వీధుల్లో 35 లక్షల మంది చనిపోయిన సమయంలో మనసారా హృదయ పూర్వకంగా ప్రజా సహాయ కార్యక్రమాల్లో పాల్గొనమని జోషి పార్టీకి మార్గదర్శనం చేశాడు. లారీల నిండా శవాలు, ఓ గిన్నెడు బియ్యపు గంజిని అడుక్కుంటూ హృదయ విదారకంగా స్త్రీల ఏడుపులూ, చెత్తకుండీల నుంచి ఓ ముద్ద అన్నం లేక, తిండి తిప్పలు లేక శుష్కించిపోయిన స్త్రీలు, అంతిమ ఊపిరి కోసం చలిస్తున్న చిన్న పిల్లలు, మన దేశ ప్రజల మనస్సులను క్షోభింపచేశాయి. 1943లో, సుమారు ఒక కోటిమంది ప్రజలు, ప్రధానంగా వ్యవసాయ కూలీలు, కౌలు దారులు, పేదరైతులు, పట్టణ పేదలు తొలగించబడి, యీ కరువుతో వీధుల్లోకి నెట్టివెయ్యబడ్డారు. ముప్పై లక్షలమంది ప్రజలు తమ సంపాదన కోల్పోయారు. రైతుల్లో 15 శాతం మంది భూములు కోల్పోయారు. నిరుపేద, అనాథ స్త్రీలు వ్యభిచార గృహాల్లోకి నెట్టబడ్డారు. వ్యభిచారుల సంఖ్య 20,000 నుంచి 45,000కు పెరిగింది. కలకత్తాలో నియమింపబడిన అమెరికన్ ఉద్యోగులు యిళ్లలో చొరబడి, బెంగాలీ యువతులను ఎత్తుకువెళ్ళి బలవంతంగా వారిపై అత్యాచారం చేసేవారు. ఈ దారుణమైన పరిస్థితిని గ్రహించి, జోషి కలకత్తాలోని అమెరికన్ కాన్సుల్‌కి ఉత్తరంరాసి, బెంగాల్ కమ్యూనిస్టు పార్టీని యీ విషయంలో జోక్యం చేసుకుని, యీ ప్రమాదానికి వ్యతిరేకంగా పోరాడమని సూచించాడు.

కరువు బాధిత, నిరాహార అభాగ్య స్త్రీలు డబ్బు ఎరతో, వ్యభిచారం ద్వారా పీడింపబడి, మిలిటరీ శిబిరాలకు పంపబడేవారు లేక బలవంతాన వారిని వ్యభిచరింపచేసేవారు. ఆ కారణంగానే, కమ్యూనిస్టు మహిళలు అలాంటి స్త్రీలను రక్షించేందుకు మహిళా ఆత్మరక్షా సమితి (MARS)ని ఏర్పాటు చేశారు. ఆత్మరక్ష (స్వీయరక్షణ)అనే పేరు ఆ సంస్థకు జోడించబడింది. కమ్యూనిస్టు మహిళల యీ సంయుక్త సంఘటన చాలామంది కమ్యూనిస్టేతర

స్త్రీలను అప్పటి ప్రసిద్ధ రాణీ మహాలానొబీస్, లీలా మజుందార్ వంటి ఉదార మహిళలను తన సంస్థలోకి తెచ్చింది. రవీంద్రనాథ్ ఠాగూర్ మేనకోడలైన దేవీ చౌధురాణి దానికి తొలి అధ్యక్షురాలైంది.

పలువురు కమ్యూనిస్టు మహిళలు స్త్రీల ఉద్యమాన్ని "స్వతంత్ర భారత దేశం కోసం జరిగే పోరాటాన్ని దారిద్ర్యం, అజ్ఞానం, అధఃపతనాల సంకెళ్ళ నుంచి విముక్తిచేసే సమరశీల దళం"గా మార్చేలా తమకు పి.సి.జోషి శిక్షణ యిచ్చినట్లు అంగీకరించారు.[2] స్త్రీలను ప్రజా ఉద్యమాల్లోకి, పార్టీ పనిలోకి, సృజనాత్మక కృషిలోకి తెచ్చేందుకు జోషి చూపిన ఉత్సాహం కమ్యూనిస్టు మహిళలు మహిళల్లో విస్తృత సంఘాలు ఏర్పరచేందుకు, తద్వారా జాతీయ ప్రయోజనం సాధించేందుకుగల అనివార్య అవసరాన్ని గుర్తించేందుకు తోడ్పడింది. మహిళా ఉద్యమానికి సక్రమమైన దిశా నిర్దేశం చెయ్యడంలో, మహిళా ఉద్యమాన్ని రూపొందించడంలో జోషి ప్రధానపాత్ర వహించాడు. సమకాలీన మహిళా నాయకురాలు మణికుంత సేన్, కమ్యూనిస్టు మహిళలకు జోషి చేసిన బోధనలను గురించి, జోషి గురించిన తన స్మృతుల్లో రాసింది. వారి కృషి పట్టణ ప్రాంతాల్లోని స్వల్పఆదాయ ప్రాంతాలకు పరిమితమైంది:

> ఈ మాదిరి పనిని ఎలా చెయ్యాల్లో మాకు తెలియజేసిన వ్యక్తి అప్పటి పార్టీ నాయకుడు పి.సి.జోషి. మహిళల ప్రత్యేక హక్కుల కోసం పోరాడేందుకు, సమాజపు అత్యున్నత శ్రేణులకు చెందిన వారిని మినహాయించి, మిగతా స్త్రీలందరినీ మేము సంఘటితం చెయ్యాలి. స్త్రీలు స్వాతంత్ర్య పోరాటంలో మిగిలిన అందరితో పాల్గొంటారు. వర్గపోరాట రంగాల్లో వారు అగ్రగాములు అవుతారు. నిర్మాణాత్మక కృషి కోసం స్త్రీలు సంఘటితం చెయ్యబడాలి. స్త్రీల, పిల్లల సంక్షేమ సాధనమే ముఖ్యం. మిగతా పోరాటాలు సరసన కొనసాగుతాయి: ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమం, రాజకీయ ఖైదీల విడుదల కోసం ఉద్యమం

2. రేణూ చక్రవర్తి, 'కమ్యూనిస్ట్స్ ఇన్ ఇండియన్ ఉమెన్స్ మూవ్‌మెంట్', పీపుల్స్ పబ్లిషింగ్ హౌజ్,, న్యూఢిల్లీ 1980 చూడండి.

వంటివి. పి.సి.జోషి మాకు నేర్పిన కొన్ని విషయాలు.[3]

బెంగాల్‌ని తాకిన విపత్తు స్వభావాన్ని జోషి అవగతం చేసుకోగలిగాడు. ఆవిధంగా ఆయన పార్టీనీ, ప్రజాసంఘాన్నీ *భూఖాహై బంగాల్* ( బెంగాల్‌ని పీడించిన ఆకలి) సహాయకారి విస్తృత ఉద్యమంలో సంఘటితం చేసేందుకు మార్గదర్శకం చేశాడు. ఆయన ఒక సాంస్కృతిక బృందంతో బాటు బెంగాల్‌లో పర్యటించాడు, జనాన్ని జపాన్ ఫాసిస్టులకు, ఆహార పదార్థాలను దొంగ నిల్వలుచేసే వాళ్లకు, బ్లాక్ మార్కెటర్లకు వ్యతిరేకంగా మనదేశపు స్వాతంత్ర్య సాధన కోసం, హిందూ, ముస్లింల ఐక్యత కోసం కృషి చేసేలా ఉత్తేజితం చేశాడు. బెంగాల్లోని ఒక జిల్లా మిద్నపూర్ దోవలో కరువులో మరణించిన అయిదు వందల కంటె ఎక్కువ పేద రైతుల పుర్రెల భయంకర దృశ్యాన్ని చూశాడు ఆయన. జోషి బెంగాల్ గ్రామాల్లో పర్యటించి, మానవ కల్పితమైన కరువు స్వభావాన్ని గ్రహించేందుకు వీలుగా ప్రజాసమావేశాలు నిర్వహించాడు. కరువు బాధితుల సహాయం కోసం ఉద్యమాల్ని నిర్మించేందుకూ, దొంగ నిల్వలను బయట పెట్టేందుకు కృషి చేశాడు. వీటన్నిటిద్వారా తిరిగి పార్టీని పునశ్శక్తివంతం చేసేందుకు తోడ్పడ్డాడు. *'బెంగాల్ మరణిస్తే ఎవరు జీవిస్తారు?"* అనే కరపత్రం రాశాడాయన. దాని ద్వారా దొంగ నిల్వదారుల రాజకీయాలనూ, ఆటలను బహిర్గతం చేశాడు. భూమి లేని కూలీలు, కౌలు దారుల దౌర్భాగ్యాన్ని అందులో వెల్లడించాడు. ఎంతో ఉత్తేజకరమైన ఆ కరపత్రంలో ఆయన బెంగాల్‌ని సాధ్యమైన అన్ని పద్ధతుల్లో కాపాడమని జనసామాన్యానికి శక్తిమంతంగా విజ్ఞప్తి చేశాడు. జోషి కరువు బాధిత బెంగాల్లో ఆరువారాల పాటు గడిపాడు. ఆయన కరువు బాధిత ప్రాంతాల్లో విస్తృతంగా పర్యటించాడు. తద్వారా ఆ రాష్ట్ర పరిస్థితి స్పష్టంగా తెలుసుకున్నాడు. ఆ రాష్ట్రాన్ని తాకిన దుర్ఘటనని గ్రహించాడు. ఆ మీదట యిలా రాశాడు:

> నేను బెంగాల్‌ని ఒకే ఒక్క నిశ్చయంతో విడిచి వెళ్ళాను. ప్రతిఒక్క భారతీయ దేశభక్తుడినీ అన్ని విభేదాలనూ విస్మరించి బెంగాల్‌కి

---

3. మణికుంతల సేన్, *'ఇన్ సెర్చ్ ఆఫ్ ఫ్రీడం: అన్ అన్ ఫినిష్డ్ జర్నీ',* స్త్రీ, కలకత్తా, 2001, పుట 95.

అత్యధిక సహాయాన్ని అందించేందుకు ఏకం కమ్మనీ, ప్రతిఒక్క స్త్రీని, పురుషుడిని, పిల్లలను బెంగాల్‌కి డబ్బును సంపూర్ణంగా చెల్లించేలా చెయ్యమనీ విజ్ఞప్తి చేశాను....[4]

పి.సి.జోషి బెంగాల్ దౌర్భాగ్యాన్ని పార్టీ కార్యక్రమంలోనూ, అంతకంటె ముఖ్యంగా జాతీయ కార్యక్రమంలోనూ ప్రవేశపెట్టాడు. బెంగాల్ మరణ వేదనలో వుంది. జోషి బెంగాల్ ప్రజల ఆందోళనా నివారణ చేశాడు. దేశమంతటా సాంస్కృతిక కార్యక్రమ దళాల ద్వారా విరాళాలు పోగుచేసి బెంగాల్‌ని కాపాడేందుకు జాతి వ్యాప్త ఉద్యమాన్ని ప్రారంభించాడు. దాని తీవ్ర ప్రభావం దేశమంతటా వ్యాపించింది. ఆ ఉద్యమం ద్వారా కళ ఒక మాధ్యమం అయింది. కళ రాజకీయ పోరాటానికి ఒక సాధనం అయింది. పాటలు, నాట్యాలు, నాటకాలు, చిత్రాలు, స్కెచ్‌లు అద్భుతాలను సాధించాయి. ఉపన్యాసాలు విఫలమైనా, సాంస్కృతిక కార్యక్రమాలతో ఫలితాలు సాధించ బడ్డాయి. ఇవే ఆహార సంక్షోభాన్ని బయట పెట్టేందుకు ప్రజా సంఘటనలను ఒకే ఉమ్మడి వేదిక మీదికి తెచ్చాయి. దొంగ నిల్వలకు వ్యతిరేకంగా పోరాడి, రేషనింగును ప్రారంభించి, ఉపశమన భోజన కేంద్రాలను ప్రారంభించేలా చేశాయి. ఒక భిన్నమైన భారతదేశం బెంగాల్ సహాయానికి వచ్చింది. జోషి యిలా రాశాడు:

భారతదేశం కోసం, ప్రతి ఒక్క భారతీయుని క్షేమం కోసం బెంగాల్ మరణించరాదు. మనం మన కుటుంబాలను ప్రేమిస్తే, వాటిని బెంగాల్ కుటుంబాల్లా ముక్కచెక్కలు కాకూడదని కోరితే, మనం బెంగాల్‌కు విధిగా సహాయపడాలి.

మనం మన భార్య, సోదరీమణుల గౌరవాన్ని వాంఛించినట్లైతే, బెంగాలీల భార్య, సోదరీమణులు గౌరవం కోల్పోతున్న మాదిరిగా కోల్పోరాదని కోరితే మనం బెంగాలుకి తోడ్పడాలి.

బెంగాల్‌లోని పిల్లలు ఈగల్లా చనిపోతున్నట్లుగా మన పిల్లలు

4. పి.సి.జోషి, *'హూ లివ్స్ ఇఫ్ బెంగాల్ డైస్'*, బాంబే, 1943, పుట 10.

చనిపోకూడదని వాంఛించితే మనం బెంగాలుకి సహాయం చెయ్యాలి. మనం భారతదేశాన్ని ప్రేమిస్తే, మనం బెంగాలుని కాపాడాలి. బెంగాల్ మరణిస్తే భారతదేశం జీవించలేదు.

ఈ మాటలు మొత్తం దేశాన్ని ఉద్వేగపరిచాయి. దొంగ నిల్వదారులను అరెస్టు చెయ్యడంలో ముస్లిమ్ లీగ్ మంత్రివర్గపు వైఫల్యాన్ని బయటపెడ్తూ, బెంగాల్లో స్వయం సహాయ ఉద్యమాన్ని నిర్మించుకోమని పిలుపు నిచ్చాడు. దేశపు యితర ప్రాంతాల్లోని ప్రతి ఒక్క వ్యక్తి ప్రగాఢ మానవత్వానికీ, ప్రగాఢమైన దేశభక్తికీ విజ్ఞప్తి చేశాడు. బెంగాల్‌లో విలవిల్లాడుతున్న జనానికి సాధ్యమైన సహాయాలనూ చెయ్యమని అప్పటికే బెంగాల్ దారుణ పరిస్థితిని గుర్తించిన దేశపు యితర ప్రాంతాల్లోని ప్రతి ఒక్క వ్యక్తికీ విజ్ఞప్తి చేశాడు.

జోషి పార్టీకి రెండు కర్తవ్యాలను యిలా గుర్తు చేశాడు. "స్వయం సహాయ ఉద్యమాన్ని సంఘటితంచేసి, కొనసాగేలా చూడండి, ఉపశమన వంట కేంద్రాలను మెరుగుపరచి, విస్తృతం చెయ్యండి. (పార్టీ కార్యకర్తలు 700 వంట కేంద్రాల్లో పనిచేస్తూ 1,17,000ల మంది కరువు బాధితులకు తిండి పెడుతున్నారు). 'అమన్' పంట కోసం పోరును సంఘటితం చెయ్యండి. బెంగాల్ పంటను బెంగాల్ ప్రజలకు సాధించండి, గత సంవత్సరంలో మాదిరిగా ఆ పంటను దొంగ నిల్వదారుల చేతుల్లోకి పోకుండా చూడండి".

పి.సి.జోషి పవిత్ర రాజకీయ పరిగ్రహణ బెంగాల్ భయపూరిత ఆహార సంక్షోభాన్ని ఆనాటి జాతీయ సమస్యలతో ముడిపెట్టడాన్ని సాధ్యం చేసింది. ఆ రాష్ట్రంలోని కరువు ఫలితాలను తొలగించగలిగిన జాతీయ ప్రభుత్వ స్థాపన సత్వర ఏర్పాటు ఆవశ్యకతను ఆయన గ్రహించాడు.

ప్రస్తుత పరిస్థితిలో బెంగాల్‌కి అత్యుత్తమ మంత్రివర్గం లీగ్-మహాసభ మంత్రివర్గం. ఆచరణలో కాంగ్రెస్, కమ్యూనిస్టుల వాస్తవ సహాయంతో, లీగ్ మంత్రివర్గం ఒకవైపు డా.శ్యామ ప్రసాద్‌కి సిసలైన సహకారాన్ని యిస్తామని చెప్పడం, మరోవైపు ఆయన దాన్ని ఆమోదించేలా చెయ్యడం, బెంగాల్లోని ప్రతి ఒక్క నికార్సైన దేశభక్తుడి కర్తవ్యం.[5]

---

5. అదే వ్యాసం పుట 22.

సృజనాత్మక రంగంలో జోషి చేసిన ఒక ప్రముఖ సహాయం కేంద్ర సాంస్కృతిక దళం స్థాపన. కళాకారులకి, నాటక రచయితలకీ, సంగీతజ్ఞులకీ, నాట్యకారులకీ, ఫోటోగ్రాఫర్లకీ అదొక కేంద్రం అయింది. ఆ సాంస్కృతిక దళం, స్వాతంత్ర్యం, దేశభక్తిని గురించి పాటలతో, ఆకలి బాధతో, బెంగాల్ కరువును గురించిన ఒక నాటకంతో దేశమంతటా పయనించింది. ఈ సాంస్కృతిక దళంతో సాగిన ప్రచారోద్యమం పార్టీ సామాన్య జనానికి చేరువయ్యేందుకు తోడ్పడింది. ప్రత్యేకించి ఫాసిజానికి వ్యతిరేకంగా జరిగిన ప్రపంచయుద్ధాన్ని ప్రజాయుద్ధంగా భావించిన వైఖరి మూలంగా అది జాతీయోద్యమానికి వేరు పడింది.* సంగీత బృందానికి వినయ్‌రాయ్ బాధ్యుడు. తర్వాతి కాలంలో ప్రసిద్ధ నాటకకర్త, బెంగాల్ నాటక రచయితగా మారిన శంభుమిత్రకు నాటకం తయారుచేసే బాధ్యత అప్పగించబడింది. ఆయన బిజన్ భట్టాచార్య నాటకం *'జబన్ బంది'*ని ఎన్నుకున్నాడు. ఆ పుస్తకాన్ని నేమీచంద్ జైన్ హిందీలోకి 'అంతిమ్ అభిలాష' పేరుతో అనువదించాడు. ఆ అనువాదం బెంగాల్ వెలుపలి దేశపు ప్రాంతాల్లో ప్రదర్శించేందుకుగాను చేయించబడింది. నాటక దళం ఆ నాటకాన్ని ప్రదర్శించిన ప్రాంతాల్లో, ప్రజలు ఆ నాటకం చివరన బెంగాల్ కరువు నివారణకు విరివిగా చందాలు ఇచ్చారు. కమ్యూనిస్టు పార్టీ వారపత్రిక *పీపుల్స్‌వార్'* వ్యాసాలు, కథలు, కరువు గురించిన నివేదికలతో నిండి వుండేది. దానితోబాటుగా సునీల్ జనావంటి ఫోటోగ్రాఫర్ల హృదయ విదారకమైన ఫోటోలు, చిత్తప్రసాద్ స్కెచ్‌లు, ఇంకా సవివరమైన సమకాలిక నివేదికలు వుండేవి. బెంగాల్ కరువును గురించి హాజ్రాబేగమ్ రాసిన వ్యాసాలను చదివి, తరువాతి దశలో శ్రామికవర్గ కార్మికురాలు ఒకామె ఆమెకు యిలా రాసింది:

> *పీపుల్స్‌వార్*లో మీరు బెంగాల్ కరువు గురించి రాసిన వ్యాసాలను చదివినప్పుడు, మా ప్రజల బాధలకు నా హృదయం ఛిద్రమయ్యేది. పూజ చీర కొనుక్కునేందు కోసం నా భర్త నాకీ డబ్బు యిచ్చాడు. నాకు

---

* ఆ దశలో రాజకీయ పంథా వివరాలు తదుపరి ప్రకరణంలో ఉన్నాయి.

బోలెడు చీరలు వున్నాయి. నాకు కొత్తది అవసరం లేదు. దయచేసి యీ డబ్బును బెంగాల్‌కి పంపండి.[6]

పార్టీ ప్రచార కార్యక్రమం ద్వారా ఆ మాదిరి ఉద్వేగం జనంలో మొలకెత్తింది. ఆ సాంస్కృతిక దళం గుజరాత్, మహారాష్ట్రల్లో పయనించి కరువు బాధితుల సహాయార్థం నిధులను పోగు చేసింది.*

ఈ ఆకలి బాధిత బెంగాల్ ఉద్యమం యావత్తు జాతినీ ఉత్తేజపరిచింది. కళా సంస్కృతులు ప్రజల్లో రాజకీయ సందేశాలను వ్యాపింపచేసేందుకు చక్కని మాధ్యమాలయ్యాయి. ఈ ఉద్యమ విజయం రాజకీయ పోరాటానికి కళ సాధనమనే జోషి అవగాహనను మరింత బలపరిచింది. ఆ సాంస్కృతిక దళంలో దేశపు వివిధ భాగాలకు చెందిన ప్రతిభావంతులైన యువతీ, యువకులను ఎంపిక చేసి మొత్తం జనం కోసం ఏదైనా చెయ్యమని వారిని ఉత్తేజపరిచాడు. ఉపాధ్యాయుల్లో శాంతివర్ధన్, రవిశంకర్, అవనీదాస్ గుప్తా, సచిన్ శంకర్, నరేంద్ర శర్మలు తరువాత కళాకారులుగా జ్వలించి, సాంస్కృతిక రంగంలో పేరు ప్రతిష్ఠలు సాధించారు. కేంద్రబృంద సభ్యులు వివిధ జానపద, ప్రాచీన పద్ధతుల్లో ప్రయోగాలు చేశారు. తద్వారా జానపద కళలు, సామూహిక సంగీతం, బహిరంగ స్థలాల్లో నాటక ప్రదర్శనలు తిరిగి పునరుజ్జీవితాలయ్యాయి, ఉధృతమయ్యాయి. జోషి తరచు స్వయంగావచ్చి రిహార్సల్స్‌ను చూసేవాడు. అతని హాజరు వర్ధమాన ప్రతిభల పెరుగుదలను ప్రోత్సహించేవి. ఏదోఒక రూపంలో ప్రతిభను ప్రతి ఒక్కరిలోనూచూసి, దాన్ని పార్టీకోసం, దేశం కోసం జోషి వినియోగించేవాడు. ఆయన వారిలో ఆత్మవిశ్వాసాన్ని చొప్పించి, తమ అత్యుత్తమ ప్రతిభను వినియోగించుకునేలా వారిని ఉత్తేజపరిచాడు. సనాతన వాతావరణం నుండి వచ్చిన వారైనా చాలా

---

6. *పీపుల్స్ వార్,* జులై 19, 1945.

* ప్రత్యక్షంగా బెంగాల్ కరువును చూసి చిత్త ప్రసాద్ గీసిన 22 నలుపు తెలుపు స్కెచ్‌లు పార్టీ ద్వారా స్థాపించబడిన పీపుల్స్ పబ్లిషింగ్ హౌజ్ ద్వారా *బెంగాల్: ఎ టూర్ త్రూ మిద్నాపూర్ డిస్ట్రిక్ట్ ఇన్ నవంబర్ 1943* పేర ప్రచురించబడ్డాయి.

మంది స్త్రీలు తమ స్వంత పరిధులనుంచి బయటకువచ్చి, యీ సాంస్కృతిక ఉద్యమం ద్వారా సాగుతున్న సామాజిక పరివర్తనలో భాగస్తులయ్యారు.

1943 మేలో యీ సాంస్కృతిక దళం అఖిల భారత ప్రజా నాట్యమండలి (ఇప్టా)గా రూపాన్ని దాల్చింది. నాటకం, పాటలు, నాట్యాల రూపంలో అంత వరకు సాగిన అన్ని ప్రగతిశీల ధోరణులను 'ఇప్టా' సుసంఘటితం చేసింది. జోషికి ఆ కాలపు మనదేశపు సంపన్న సాంస్కృతిక పూర్వ సంపదను చేజిక్కించుకుని, మన దేశీయుల జీవితాలతోనూ, ఆనాటి ఆకాంక్షలతోనూ ఆ సంస్కృతియొక్క గణనీయ పార్శ్వాలతో సంఘటితం చేయాలన్న వాంఛ కలిగింది. ఇప్టా (అఖిల భారత ప్రజా నాట్యమండలి) సాంస్కృతిక ఉద్యమంగా పరిణమించింది. అది ప్రజల కళ యొక్క ఒక నూతన స్ఫూర్తిగా మారేలా ప్రయత్నించింది. పాత కళారూపాలు ఉత్తేజంచేసే నూతన ఇతివృత్తాలతో కలిసిపోయాయి. దేవాలయాలు, రాజభవనాల గోడల మధ్య ఉండిపోయిన, కథాకళి వంటి సాంప్రదాయిక నాట్యాలను కార్మిక, కర్షక ప్రజాతంత్ర ఉద్యమాలు వాటి ఏకాంతత నుంచి బయటకు తెచ్చి ప్రజల ఆనాటి విప్లవాత్మక మానసికావస్థకి అనుకూలంగా ప్రతిబింబించేలా చేశాయి. కళ, సంగీతం, నాట్యం, నాటకాలు స్వాతంత్ర్యం కోసం, ఆర్థిక న్యాయం కోసం, ప్రగతిశీల సంస్కృతి కోసం ప్రజలు జరుపుతున్న పోరాటాలకు అనుగుణంగా వ్యక్తీకరించసాగాయి. 'ఇప్టా' భూస్వామ్య వ్యతిరేక భావజాల పరిరక్షణకు, సామ్రాజ్యవాదానికీ, ఫాసిజానికీ వ్యతిరేకంగా కూడా నిలిచింది. ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల కారణాలను, వాటి పరిష్కార మార్గాలను వారు గ్రహించేందుకు అనుకూలంగా 'ఇప్టా' కృషి చేసింది. అందుకు రైతులు, కార్మికులు, విద్యార్థులు, మహిళలు, పాటల ద్వారా, పద్యపఠనం ద్వారా నాట్యాల ద్వారా, నాటక ప్రదర్శనల ద్వారా జనాన్ని ఉత్తేజపరచి, ఆహార పదార్థాల దొంగ నిల్వదారులకు వ్యతిరేకంగా వారు పోరాడేలా, జాతీయ నాయకుల జైళ్ళ నిర్బంధ విముక్తి కోసం, జాతీయ ప్రభుత్వాన్ని డిమాండు చేసేలా, అదే సమయంలో ఫాసిజం ప్రమాదం తెలుసుకునేలా ఉత్తేజితం చేశారు. ఈ నాలుగు సమస్యలూ ఏకం చెయ్యబడ్డాయి, త్వరలో స్థానిక ప్రయత్నాలు జాతివ్యాపిత ప్రజా నాట్యమండలి ఉద్యమంలో సంలీన

మయ్యాయి. ఇదంతా నిజానికి పి.సి.జోషి మేధా సంతానం. కళారూపాన్ని సృజనాత్మక సంబంధాల ద్వారా భారతీయ ప్రజల జీవితంతో సన్నిహితం చేసి, దాని ద్వారా తమ చుట్టూవున్న సామాజిక, రాజకీయ పరిస్థితులను వారికి తెలియజెయ్యవలసిన అనివార్య అవసరాన్ని ఆయన గ్రహించాడు.

బొంబాయిలో జనవరి 8, 1945న జరిగిన 'ఇప్టా' మహాసభ ఒక మహత్తర సంఘటన. ఆ సంఘటన యొక్క లక్ష్యం కళని ప్రజల జీవితంతో ముడిపెట్టడం. ఆ సాంస్కృతిక సంధ్య ప్రధానాంశం "స్పిరిట్ ఆఫ్ ఇండియా" అనే ఒక నృత్యనాటిక. దాన్ని ప్రేమ్ ధవన్ రూపొందించాడు. ప్రేక్షకుల మనస్సులను ప్రభావితం చేసిన సంగీతకారుడు బినయ్‌రాయ్. ఆ నృత్యాన్ని రూపొందించింది శాంతివర్ధన్. విదేశీ సామ్రాజ్యవాదం కింద మధ్యయుగ భూస్వామ్యవాదం కింద, బయటకు వస్తున్న పారిశ్రామిక పెట్టుబడీదారీ వ్యవస్థ కింద అణచబడుతున్న ప్రజల దైన్యాన్ని అది వేదిక మీద బహిర్గతం చేసింది. ఆ వీరగాథా నాటకంతోబాటు, ఒక కొంకణీ నాటిక, ఆంధ్ర జానపద కళా రూపం 'బుర్రకథ' మహారాష్ట్ర గ్రామీణ ప్రాంతపు ప్రజారంజకమైన 'తమాషా', గుజరాతీ నాటకం 'మృచ్ఛకటిక', పిల్లల పాటలు ప్రదర్శించ బడ్డాయి.

అటు తర్వాత అహ్మద్ అబ్బాస్ రచించిన 'జుబేదా' అనే హిందీ నాటకం ప్రదర్శించబడింది. ఆ నాటకానికి బల్‌రాజ్ సహానీ అద్భుతంగా దర్శకత్వం వహించాడు. ఈ నాటకంతో జోషి విపరీతంగా ప్రభావితుడయ్యాడు. ఆయన యిలా రాశాడు.

> 'ఇప్టా' జుబేదా వంటి మరిన్ని నాటికలను ప్రదర్శించగలిగితే వాటిలో ఏ ఒక్కదానికీ నేను హాజరు కాకుండా వుండను. బొంబాయిలో దేశభక్తులందరూ హాజరై అది ప్రదర్శించబడే హాలును నింపేస్తారు.[7]

అటు తర్వాత ఆయన ఒక కథను చెప్పాడు. అది వ్యక్తిగా జోషి కలిగి వున్న గొప్పతనాన్ని వెల్లడించింది. ఆ కథను ప్రస్తావిస్తూ ఆయన యిలా కొనసాగించాడు.

హీరో సెలవు పెట్టి తిరిగి వచ్చినప్పుడు జుబేదా కలరాతో చనిపోతూ

---

7. *'పీపుల్స్ వార్'*, జనవరి 21, 1945.

వుండటం మాత్రమే చూస్తాడు. జుబేదా అంత్యక్రియ ప్రేక్షకులందరినీ కదిలించివేసింది. ఆమె శరీరం మీద కాంగ్రెస్, ముస్లింలీగ్, ఎర్ర జెండాలు ఒకదాని తర్వాత మరొకటి వెయ్యబడ్డాయి. డాక్టర్ మహ్మద్ ఆ పక్కన కూర్చొని, కన్నీళ్ళు తుడుచుకోవడం నేను చూశాను. ఇక్బాల్ గేయం హిందుస్థాన్ హమారాతో ముగిసేసరికి ఆయన యిలా అన్నాడు: "మేము మా కాలంలో చెయ్యలేని పనిని, ఓ యువకులారా మీరు చేస్తున్నారు. మీకు నా హృదయ పూర్వక శుభాకాంక్షలు". ఆయనా, ఆయన తరంవాళ్ళూ గతంలో చేసినదాన్ని బట్టి మీరు గర్విస్తున్న యీ పనిని మేము చెయ్యగలిగాం అని నేనాయనకి చెప్పాను. అందుకు ఆయన ఎంతో ప్రభావితుడయ్యాడు.[8]

ఈ విధంగా జోషీ విభిన్న రాజకీయవాదులతో పరస్పరం ముచ్చటించి, వారిని ప్రభావితం చేశాడు. అదేవిధంగా, బిజన్ భట్టాచార్య రచించిన నాలుగు అంకాల బెంగాలీ నాటక ప్రదర్శన ఓ పెద్ద నాటకశాలలో జరగడం 'ఇప్టా' చరిత్రలో మరో మైలురాయి. అది 'నబన్న' (కొత్త పంట)లో బెంగాల్ రైతాంగపు సమకాలిక జీవితం, బెంగాల్ కరువు తర్వాత వారి దైన్యం, చాలా పాత్రలతో, అనేక రకాల దృశ్యాలతో కూడివుంది. నాటకాలు రచయిత, నటుడు, డైరెక్టరు, అందరు ప్రేక్షకులతో కూడిన సంయుక్త ప్రదర్శనలతో సృజించబడ్డాయి.

ఈ ఉద్యమపు సజీవ భాగాలు కార్మిక సంఘాలు, రైతు సంఘాలు, వాటితో బాటు అభ్యుదయ రచయితల సంఘాలు, ఈ తదుపరి ఉద్యమ ప్రారంభకుల్లో వివిధ రాజకీయ అభిప్రాయాలు కలిగినవారు ఉన్నారు. కాంగ్రెస్ వాదులు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు, మితవాదులు, ఉదార వాదులు, శ్రమజీవులు, రైతు నాయకులు వున్నారు. జవహర్‌లాల్ నెహ్రూ ఆ సంఘానికి ఒక సందేశం యిస్తూ యిలా అన్నాడు:

భారతదేశంలో ప్రజా నాట్యమండలి అభివృద్ధిపట్ల నాకు చాలా ఆసక్తి వుంది. అది ప్రజలమీద, వారి సంప్రదాయాల మీద ఆధారపడితే, దానికి చాలా పెద్ద స్థావరం వుంది. లేకపోతే, అది గాలిలో పనిచేస్తుంది.

---

8. పైదే.

మీరు ప్రజల వైఖరి మీద ప్రత్యేక ఒత్తిడి చూపుతున్నారన్న విషయాన్ని మీ కరపత్రంలో చూసి సంతోషించాను. చైనా, స్పెయిన్‌లలో ఆ వాతావరణం వుంది. భారతదేశంలో అదింకా కొరతే. ఏమైనప్పటికీ, యీ దిశలో ఒక ప్రయత్నం జరగాలి. ఈ కృషిలో మీ సంఘానికి సంపూర్ణ విజయం చేకూరాలని నేను కోరుతున్నాను.[9]

అఖిల భారత రైతు మహాసభ కోసం ప్రయత్నాలు భాక్రాలో ప్రారంభ మయ్యాయి. అది రైతుల ప్రతిభలను వెదకమని 'ఇప్టా'ను ఆదేశించింది. ఒక పక్షంలోగా, అది నటులను, ఆరు నాటకాల రచయితలను సమీకరించ గలిగింది. వాటిలో మూడింటిని పట్టణవాసులు రచించారు. మూడు పెద్ద వాటిని గ్రామీణులు రచించి, ప్రదర్శించారు. ఈ సంయుక్త ప్రయత్నాలు ప్రజల్లో అన్ని విభాగాల వారినీ ఏకం చెయ్యగలిగాయి.

సంస్కృతి పట్ల జోషి వైఖరి గతాన్ని తిరస్కరించడం కాదు, ప్రస్తుతమున్న ప్రజల సమస్యలతో ఏకీకరించుకోవడం. చరిత్రను, ప్రజలు పెంపొందించిన సంస్కృతిని, సంప్రదాయాన్ని గ్రహించడం, వాటిని జన సామాన్యపు సమస్యలతోను, అంశాలతోను సమన్వయించడాన్ని ఆయన యువజనానికి నేర్పాడు. జానపదుల సంస్కృతిలో, జానపద పాటల్లో, జానపద కళలో ఆయన ఆసక్తి సామాన్యజనానీకం పట్ల ఆయన శ్రద్ధనుంచి పుట్టింది. చరిత్ర వాహికలో అస్తిత్వ భావంతో ఆయన ప్రతి కామ్రేడ్‌ని ఉత్తేజపరచ గలిగాడు.

జోషి విస్తృత దృష్టినీ, ఊహాశక్తినీ అర్థం చేసుకుంటే, 'ఇప్టా' సంస్థాపన, అదే సమయంలో కమ్యూనిస్టుపార్టీ తొలి మహాసభ జరపడం ఏకకాలిక సంభవం కాదు, ఒకటి మరొకదాన్ని పూరించడం. తొలి పార్టీ మహాసభ బొంబాయిలో 1943 మే23 నుంచి జూన్1 వరకు జరిగింది. అదే సమయంలో 'ఇప్టా' తొలి మహాసభ కూడా బొంబాయిలో 1943 మే 25 న జరిగింది. ఆ పార్టీ మహాసభకి దేశమంతటి నుంచీ పెద్ద సంఖ్యలో కామ్రేడ్లు పాల్గొన్నారు. పి.సి.జోషి తన రాజకీయ, సంస్థాత్మక నివేదికను

9. 'ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్', బులిటెన్ నెం.1, జులై 1943, బొంబాయి, పేజి.14

సమర్పించాడు. అది యుద్ధకాలం, ఫాసిజం ప్రమాదకాలం. ఆ రెండు పశ్చిమ దేశాలనుంచీ, తూర్పు దేశాలనుంచీ ముమ్మరమైంది. గాంధీజీ నాయకత్వంలో భారత జాతీయ కాంగ్రెస్ *'చెయ్యండి లేక మరణించండి'* (Do or Die) అనే నినాదంతో 'క్విట్ ఇండియా' ఉద్యమాన్ని ప్రారంభించింది. కమ్యూనిస్టు పార్టీ వైఖరి భిన్నమైంది. సోవియట్ యూనియన్‌పై నాజీ దాడి తర్వాత పార్టీ ఆ యుద్ధాన్ని ప్రజాయుద్ధంగా పరిగణించి, క్విట్ ఇండియా ఉద్యమంలో చేరలేదు. అందుకే ఆ పరిస్థితి చాలా క్లిష్టమైనదై, పార్టీ ప్రధాన కార్యదర్శికి ఒక పెద్ద సవాలు అయింది. పార్టీ తక్షణ సమస్య జనానికి శిక్షణయిచ్చి, వాళ్ళని ఆ పరిస్థితి సంక్లిష్టతను రాజకీయంగా అర్థం చేసుకునేలా చెయ్యడం. ఆ సమయంలో జోషి అత్యున్నత ప్రజాదరణ కలిగినవాడు, తనని తానొక గొప్ప ఆర్గనైజరుగా, పలు ప్రజాసంఘాల నిర్మాతగా రుజువు చేసుకున్నాడు. 'క్విట్ ఇండియా' ఉద్యమానికి దూరంగా వుండి, రాజకీయంగా కమ్యూనిస్టులు జాతీయ ప్రధాన ఉద్యమానికి వేర్పాటు తనాన్ని సంతరించుకున్నా, జోషి బహుళోత్పాదక రచయితల్నీ, కళాకారుల్నీ, పార్టీలోకి గాని లేక దానికి సన్నిహితంగా గాని వారిని పార్టీ రాజకీయ స్థానాన్ని, ఆ క్లిష్ట సమయంలో సైతం అవగతం చేసి ఓ పెద్ద విభాగాన్ని సన్నిహితుల్ని చేయడంలో విజయం సాధించాడు. 'వోల్గా నుంచి గంగ దాకా' అనే ప్రసిద్ధ గ్రంథరచయిత, ప్రసిద్ధ బౌద్ధ పండితుడు రాహుల్ సాంకృత్యాయన్, కమ్యూనిస్టు పార్టీ సభ్యుడయ్యాడు. ఆయన పార్టీ కేంద్ర కార్యాలయంలో చాలాకాలమే ఉన్నాడు. కేరళకు చెందిన వల్లథోల్, హైదరాబాదుకి చెందిన మఖ్దూం మొహియుద్దీన్, బెంగాలుకి చెందిన విష్ణుదే, అంతేకాక వినయ్‌రాయ్, సచిన్ శంకర్, ప్రేమ్‌ధవన్, కైఫీ అజ్మీ, ఆలీ సర్దార్ జాఫ్రీ, సజ్జాద్ జహీర్, చిత్తప్రసాద్‌లు పార్టీలోకి వచ్చిన సృజనాత్మక వ్యక్తుల్లో కొందరు. పార్టీ రాజకీయ విధానాన్ని నమ్మి వారు జనానికి సేవ చేసేందుకు పార్టీలోకి వచ్చారు.

అప్పట్లో అంతటా రాజకీయ పరిస్థితి సంశ్లిష్టంగా ఉన్నప్పటికీ, పార్టీ ఒక శక్తివంతమైన, సృజనాత్మక రాజకీయ శక్తిగా పెంపొందుతూ వచ్చింది. 1943 మార్చి నాటికి పార్టీ సభ్యత్వం రెట్టింపును మించింది. 9,219 మంది పూర్తి సభ్యులు, కాగా, 8,816 మంది అనుబంధ లేక దరఖాస్తుదారీ సభ్యులుగా

వున్నారు. ఆ పూర్తి సభ్యుల్లో 2000 మంది పార్టీ హోల్‌టైమర్లు, సి.పి.ఐ.తో చేరిన కార్మిక సంఘాల్లో 1,97,629 మంది కార్మికులు వున్నారు. అదే విధంగా రైతుసంఘాల్లో 2,81,109 మంది రైతులు వున్నారు. ఆంధ్రలో మహిళా సంఘంలోనూ బెంగాల్లోని మహిళా ఆత్మరక్షా సమితిలో 25,822 మంది స్త్రీలు వున్నారు. 190 బాలసంఘాల్లో 6400 మంది పిల్లలు వున్నారు. పీపుల్స్ వార్ పత్రిక అమ్మకం 124 శాతం పెరిగింది. మరో ఆరుభాషల్లో రాష్ట్రాల పత్రికలతో బాటు 'పీపుల్స్‌వార్' అయిదు భాషల్లో ప్రచురించబడింది. 11 భాషల్లో 65,000 ప్రతులు పార్టీ శాఖల పత్రికలు ప్రచురించబడగా, 26 కరపత్రాలు 42,500 ప్రతులు అచ్చు వేయబడ్డాయి. వీటిలో 92.5 శాతం వరకు అప్పటికే అమ్మివేయబడ్డాయి.[10] ఇదంతా పార్టీ విధానాలను దేశ ప్రజలు అంతకంతకు అధికంగా ఆమోదిస్తున్న విషయాన్ని తెలియజేస్తుంది. పార్టీ కామ్రేడ్లు అత్యుత్తమ దేశభక్తియుత ఆర్గనైజర్లుగా అంతకంతకు అధికంగా పరిగణింప బడుతున్నారన్న వాస్తవాన్ని కూడా యిది వివరిస్తుంది.

ప్రథమ పార్టీ మహాసభ ఓ గొప్ప సాంస్కృతిక ఘటనగా కూడా అయింది. వివిధ రాష్ట్రాలకు చెందిన సాంస్కృతిక బృందాలు తమ ప్రత్యేకతలతో వచ్చి, ప్రదర్శించి, పండగ వాతావరణాన్ని సృష్టించాయి. 1936లో జోషి పార్టీ ప్రధాన కార్యదర్శి బాధ్యతను చేపట్టాడు. 1943 నాటికి సి.పి.ఐ. (భారత కమ్యూనిస్టు పార్టీ)ని ఒక జాతీయ రాజకీయ సంస్థగా తీర్చిదిద్దాడు. యుద్ధ కాలంలో విప్లవాత్మక సంఘటనల ద్వారా భారత కమ్యూనిస్టు పార్టీని ప్రజా సామూహిక రాజకీయ పార్టీగా జోషి నిర్మించగలడన్న విషయంలో మరో అభిప్రాయం లేదు. కరువు, సహాయ, పునరావాస కృషిలో, బెంగాల్లోని కరువు బాధిత గ్రామీణ ప్రాంతాల్లో వంట కేంద్రాల నిర్వహణలో, రోడ్లను నిర్మించడం, జలవనరులను ఏర్పాటు చెయ్యడంలో, చేతివృత్తిదారులకు సహకార సంఘాలను ఏర్పాటు చెయ్యడంలో, ఆహార పదార్థాలకు చౌకధరల రేషన్ దుకాణాలు ఏర్పాటు చెయ్యడంలో పార్టీని నిమగ్నం చెయ్యడం ద్వారా, దాన్ని రాజకీయ ఒంటరిస్థానం నుంచి జోషి వేరు చెయ్యగలిగాడు. జోషి జాతీయ

---

10. పీపుల్స్ వార్, మార్చి 7, 1943.

దృష్టికోణం, ఆయన నాయకత్వం లేనిదే యిది సాధ్యమై ఉండేది కాదు.

ఆ దశలో జోషిని సన్నిహితంగా చూసినవారు ఆయన్ని గురించి ఉన్నతంగా చెప్పారు. ఆ రోజులను గుర్తు చేసుకుని, సుబ్రతా బెనర్జీ యిలా అన్నాడు:

> జనాన్ని తనకు సన్నిహితుల్ని చేసుకోవడం, వారిని పార్టీ కార్యక్రమాల్లోకి దింపడంలో ఆయనకి అద్భుతమైన సామర్థ్యం ఉంది. అందుకే ఆ రోజుల్లోని ప్రముఖ మేధావులు, కవులు, రచయితలు, చిత్రకారులు, నటులు, కళాకారులు, పార్టీకి సన్నిహితులయ్యారు. స్వాతంత్ర్య సాధన జాతీయ పోరాటపు ప్రధాన స్రవంతి నుంచి దూరమైన మేము 'పీపుల్స్ వార్' రోజుల్లో యీ సంఘం ద్వారా గొప్ప బలాన్ని సంతరించుకున్నాం.

ఒక కామ్రేడ్‌గానీ, లేక పార్టీ సానుభూతిపరుడు గానీ అత్యుత్తమంగా చెయ్యగలిగిన పనిని అంచనా వెయ్యడంలోనూ, విలువ కట్టడంలోనూ జోషికి ప్రత్యేకమైన సామర్థ్యంవుంది. వారిలో ప్రతి ఒక్కరి ప్రతిభలను ఆయన వినియోగించుకుని, వారిని పార్టీ కార్యక్రమాల్లో నిమగ్నం చేశాడు. దేశపు వివిధ ప్రాంతాలకు చెందిన ప్రతిభావంతులైన యువకులను ఆయన ఎలా ఎంపిక చేసి సన్నిహితుల్ని చేసుకున్నాడో తెలుసుకోవడం ఆసక్తికర విషయం.

యుద్ధకాలంలో చిట్టగాంగ్‌లోని పార్టీ కామ్రేడ్లు వర్ధమాన కళాకారుడైన చిత్తప్రసాద్‌ని ముందుగా గుర్తించారు. చిత్తప్రసాద్‌కి పార్టీతో ఎలాంటి సంబంధాలు గాని, కలయికలు గాని లేవు. అతను పోస్టర్లు రాసి, వాటిని ఓడరేవు నగరంలోని సానుకూల ప్రాంతాల్లో అంటించేవాడు. బెంగాల్ పార్టీ కార్యదర్శి భవానీసేన్ వాటిలోంచి భావంలోనూ, శైలిలోనూ వినూత్నమైనవి తీసుకునేవాడు. అతను వాటిని బొంబాయిలో వున్న పి.సి.జోషీకి పంపాడు. వెంటనే ఆయన "చిత్తప్రసాద్‌ని పట్టుకుని, బొంబాయికి పంపెయ్యి"[11]అనే ఆదేశాన్ని పంపాడు. అతని రాకముందు, గోవింద్ విద్యార్థికి తన పోస్టర్లను పార్టీ కేంద్ర కార్యాలయపు గుండ్రని వరుస మెట్ల గోడలమీద ప్రదర్శించమని

---

11. గణేశ్ శుక్లా, వ్రాతప్రతి 'సి.పి.ఐ: ఒక అంతర్ వ్యక్తి దృక్పథం', పేజి. 207.

చెప్పాడు. బెజవాడలో జరిగిన రైతు మహాసభకి కొద్దిముందు బొంబాయికి వచ్చాడు. అదేకాలంలో మరో ప్రతిభావంతుడైన ఫోటోగ్రాఫరు సునీల్ జానా కలకత్తాలో దొరికాడు. ఆయన్ని బొంబాయి పంపారు. చిత్తప్రసాద్ స్కెచ్‌లు, అక్షరాల లినోకట్లు, సునీల్‌జానా ఫోటోల కలయిక అద్భుతమైనది. బెంగాల్ కరువు స్కెచ్‌లు(రేఖాచిత్రాలు), రైతులు, కార్మికులు, మహిళల ఫోటోలు *'పీపుల్స్‌వార్', 'పీపుల్స్ ఏజ్'* పత్రికలకు బంగారునిధి అయ్యాయి. పార్టీ వెలుపలి వ్యక్తులు పలువురు దాని రాజకీయ విధానం జాతి వ్యతిరేకమైందని భావించినా, పార్టీలోనే కొద్దిమంది జోషిని సామాజిక సంస్కరణవాది అంటూ గొణుగుడు కార్యక్రమం సాగిస్తున్నా, అది కమ్యూనిస్టు ఉద్యమానికి స్వర్ణదశ. కానైతే, కామ్రేడ్లలో చాలామందికి జోషీ మార్గదర్శకుడుగా మిగిలాడు.

కయ్యూరు అమరవీరులు ఉరి తియ్యబడక ముందు తమ నాయకుడైన పి.సి.జోషిని కలవాలన్నది వారి అంతిమ కోరిక. 1943 మార్చి 23వ తేదీన కమ్యూనిస్టు పార్టీ సభ్యులైన ఇరువదేళ్ల నలుగురు యువరైతులు, కన్ననూర్ జైలులో ఉరి తియ్యబడ్డారు. ఆ కేసుకి ప్రాతిపదిక యిదీ.1930 దశకపు చివరి సంవత్సరాల్లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో పనిచేస్తున్న కమ్యూనిస్టులు భూస్వామ్యవాద వ్యతిరేకంగా తీవ్రవాద రైతాంగ ఉద్యమాన్ని సంఘటితం చేశారు. యుద్ధ ప్రారంభంతో రైతులపై బ్రిటిష్ ప్రభుత్వపు అణచివేత ముమ్మరమైంది.

1941 మార్చి 28న కయ్యూరు గ్రామంపై పోలీసు దాడికి వ్యతిరేకంగా రైతు సంఘపు ఊరేగింపు జరిగింది. ఒక పోలీస్ కానిస్టేబుల్ ముస్లిం రైతు మహిళతో దుష్ప్రవర్తన చేశాడు. దాని పర్యవసానంగా జరిగిన ఘర్షణలో ఆ పోలీసు కానిస్టేబుల్ చంపివెయ్యబడ్డాడు. 60 మంది వ్యక్తులకు వ్యతిరేకంగా కేసు జరిగింది. చివరకు నలుగురు యువకులు కున్నహంబు, చిరుకందన్, అప్పు, అబుబాకర్‌లు మరణశిక్ష విధించబడ్డారు. ఉరికంబం ఎక్కేముందు వాళ్ళు తమ నాయకుడైన పి.సి.జోషీని చూడాలని కోరారు. జోషి కేరళ వెళ్లి, ఆ కయ్యూరు వీరులను, వారి తల్లులను కలిశాడు. ఆ యువ కామ్రేడ్ల త్యాగాన్నీ, వీరత్వాన్నీచూసి, మానసికంగా చలితుడై, పార్టీ పత్రిక *'పీపుల్స్‌వార్'*లో 1943 ఏప్రిల్ 11 వ తేదీన అపూర్వమైన ఒక వ్యాసం రాశాడు:

## కయ్యూరు వీరుల ఉరితీతకి ముందు మానవత్వ కుసుమాలు ఎన్నడూ నశించవు

... వాళ్ళు ఇంగ్లీషుగాని హిందీగాని అర్థం చేసుకోలేదు, నేను మలయాళ భాషలో మాట్లాడలేక పోయాను. జైలరు అనుమతితో పి.కృష్ణ పిళ్లే వారి వాక్యాలన్నింటినీ అనువదించాడు. నా బుగ్గలమీద కారిన కన్నీళ్ల జడి నా నోట మాటలను సాధ్యం చేశాయి. లేకపోతే నేను ఉక్కిరి బిక్కిరై నేలమీద కూలిపోయేవాడిని. పార్టీ తరఫున నేను వాళ్ళకి చెప్పినదాని సారాంశం యిదీ:

పార్టీ మిగతా ఏ సభ్యుని కంటె, మీ నలుగురిపట్ల గర్వంగావుంది. మేము కేవలం వందల్లో ఉన్నప్పుడు మీరు మా దగ్గరికి వచ్చారు. ఈనాడు మేము 9,000 కంటె ఎక్కువమందిపార్టీ సభ్యులం,8,000 మంది కాండిడేట్ (అభ్యర్థి) సభ్యులం. మా పదిహేడు వేల మందిమి మీరు గొప్పగా పట్టుకున్న పతాకాన్ని ఉన్నతంగా పట్టుకుని, మీరెంతో వీరోచితంగా చేసిన పోరాటాన్ని కొనసాగిస్తాం.

మీరు స్వాతంత్ర్యం, మన దేశానికి సమృద్ధి, అలాగే మొత్తం ప్రపంచానికే సమృద్ధి కోసం. అమర లక్ష్యసాధన కోసం మరణిస్తున్నారు. మనది న్యాయ సాధన లక్ష్యం. మీరు దాని విజయం కోసం మీ ప్రాణాలను సమర్పిస్తున్నారు. మీరు మీ కలలను సాధిస్తున్నారన్న విషయం, మీరు మరణించడం లేదన్న విషయం మాకు తెలుసు.

మాకు ప్రేమపాత్రులైన మీ నలుగురినీ పార్టీ కోల్పోతున్నది. కానీ, మీవంటి కామ్రేడ్ల కృషి, కామ్రేడ్లలో మీవంటి ఉదాహరణలు మన పార్టీని యినాడీ స్థితికి తెచ్చాయి. మీరు మలబార్‌లో పార్టీలో చేరినప్పుడు, అదొక యువ దేశభక్తుల బృందం. ఈనాడు మీ రాష్ట్రంలో మనం ఒక ప్రధాన రాజకీయ పార్టీ. దేశమంతటా ప్రజల అత్యుత్తమ పుత్రులు ఇప్పుడు పార్టీలో చేరుతున్నారు.ఎక్కడెక్కడ పార్టీ విషయం తెలుసో, అక్కడక్కడ మీ పేర్లు ప్రేమతోనూ, గౌరవంగానూ ఉచ్చరించబడుతున్నాయి. దేశభక్తి కలిగిన యువకులూ, మహిళలూ పార్టీలో చేరడాన్ని గర్వకారణంగా భావిస్తున్నారు. ఎందుకంటే, పార్టీ మీవంటి యువ అమరవీరుల్ని పెంచింది.

పార్టీ మిమ్మల్ని కోల్పోతుంది. కాని, నలుగురు అమర వీరుల్ని సంపాదిస్తోంది. వాళ్లు మిమ్మల్ని ఉరికంబాలకు పంపనివ్వండి. దాన్ని మేము అడ్డుకోలేము. మీ నలుగురివల్లా ఉత్తేజం పొంది మేము 400, 4000 మందిని ... నూతన పార్టీ సభ్యులను సంపాదిస్తాం.

దీన్ని పార్టీ నివారించలేదు, ఇందుకోసం మేము కృషి చేస్తాం. మనం విజయం సాధిస్తాం, మీరు నమ్మకంగా ఉండండి కామ్రేడ్స్. మన లక్ష్యం అమరమైనది. అలాగే దాని సాధనమైన మన పార్టీ అమరమైనది. హింస మనల్ని ఎన్నడూ బలహీన పరచలేదు, మనల్ని బలపరచింది మాత్రమే. మీ అమరత్వం మన పార్టీకి కీర్తిని తేవడమే కాక, దాన్ని బలపరుస్తుంది. ఏ ఒక్క కమ్యూనిస్టూ యింతకంటె మెరుగైన ముగింపు కోరలేదు.

మీ కుటుంబీకులు మిమ్మల్ని కోల్పోతున్నారు. యీ విషయం మాకు తెలుసు. మీరు పార్టీలో చేరినప్పుడు మీరు ప్రజల్ని మీ తల్లితండ్రులుగా ఆమోదించారు. మీ తల్లితండ్రులు బాధపడినట్లుగా ఏ భారతీయ తండ్రీ లేక తల్లీ బాధపడకుండా ఉండేలా మీరు పనిచేశారు.... శాంతించండి కామ్రేడ్స్, మేము, మనలో మొత్తం 17,000 మందిమి మీ కుటుంబాలను మా కుటుంబాల్లాగే శ్రద్ధగా చూస్తాం. మీ తల్లితండ్రులు పార్టీని తమ కుటుంబంలా, ప్రతి ఒక్క పార్టీ సభ్యుడూ తమ కొడుకుగా భావించేలా మేము అందుకు చేయగలిగిందంతా చేస్తాం.

మిమ్మల్ని కలుసుకునే అవకాశం నా జీవితంలో అతి గొప్పరోజు. మీరు మీ జీవితం కంటె అధికంగా ప్రేమించే పార్టీనుంచి మీకు నేను శుభాకాంక్షలు తెస్తాను. నేనిక్కడినుంచి మీ గ్రామానికి వెళ్తున్నాను. అక్కడ మీ తల్లితండ్రుల్ని కలుస్తాను. వాళ్లకి మీ సందేశం ఏదైనా వుందా?"

వాళ్ళు నలుగురూ కలిసి యీ మాట చెప్పారు "వాళ్ళకి సహాయకులుగా ఉండండి, వాళ్లని బాధపడవద్దని చెప్పండి".

"ఇంకేమైనా వుందా?" అని వాళ్లని అడిగాను.

"మీరు యింతకుముందే చెప్పినవన్నీ మా మనసుల్లో లోతుగా నాటుకు పాయాయి" అన్నారు వాళ్లలో ఒకరు. జైలు అధికారి తన రిస్టువాచ్‌ని చూడడం ఆరంభించాడు. నేను వాళ్లని తొందరపడమని చెప్పాను.

మొదటి జైలుగదిలోవున్న కున్హంబు యిలా ప్రారంభించాడు, "నేను ప్రజల కోసం పని చేసేలా పార్టీ సమర్థుణ్ణి చేసింది. నేను నా కర్తవ్యాన్ని నిర్వహించానని పార్టీ భావిస్తే, నేను ఆశించిందల్లా అదే".

అప్పు యిలా అన్నాడు, "పార్టీ బలం పెరగుతోందన్న గొప్ప వార్తను మీరు తెచ్చారు. మేమిప్పుడు మరింత శక్తితో ఉరికంబాలను ఎక్కుతాం. మేము దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడేందుకూ, ప్రాణాలు అర్పించేందుకూ పార్టీలో చేరాం."

చిరుకందన్ యిలా అన్నాడు, "మేము కేవలం నలుగురు రైతుబిడ్డలం కాని ఇండియాలో లక్షల, కోట్లమంది రైతులు ఉన్నారు. మేము ఉరితీయ బడవచ్చు. కాని, వాళ్లు నాశనం చెయ్యబడలేరు. మమ్మల్ని ఆద్యంతం నిలిపింది యిదే. దేశమంతటి నుంచీ మాకు వచ్చిన లేఖలు, వాళ్లకు సేవ చేసేందుకు మేము మరింత కాలం బతకనందుకు మేము విచారిస్తున్నాం. మాకింతకంటె మరే విచారమూ తెలియదు. మాకు మరిన్ని జీవితాలు వుంటే, మన లక్ష్య సాధన కోసం మరల మరల ప్రాణాలు యిచ్చేవాళ్ళం."

అబూబాకర్ జైలు చివరి గదిలో వున్నాడు. అతడు "మేము అమర వీరుల జీవితాల నుంచి ఉత్తేజం పొందాము. ఇప్పుడు మేమూ వాళ్లలో ఒకళ్లమై వాళ్ల గౌరవంలో పాలుపంచుకుంటామని మేమెన్నడూ కలగనలేదు. మేము నిర్భయంగా ఉరికంబాలకు ఎక్కుతామని కామ్రేడ్లందరికీ చెప్పండి. నా తల్లి చాలా ముసలిది. ఆవిడని ఉత్సాహపరచండి. నా సోదరులు చాలా చిన్నవాళ్లు. వాళ్లని పార్టీ కృషి కోసం విద్యావంతుల్ని చెయ్యండి. మా కుటుంబంలో అందరికంటె నేనే పెద్దవాడిని. వాళ్లని జాగ్రత్తగా చూసుకునేందుకు ఏ ఒక్కడూ మిగిలిలేడు." అన్నాడు.

అతను తన మాటలు ఆపగానే, జైలరు సమయం ముగిసిందన్నాడు. వాళ్లతో కరచాలనం చేసేందుకు నేను అనుమతిని అడిగాను. అతను అంగీకరించాడు...

కయ్యూరు అమరవీరులు "పి.సి.జోషి జిందాబాద్", "కమ్యూనిస్టు పార్టీ జిందాబాద్" అంటూ ఉరికంబాలు ఎక్కారు. 'కయ్యూర్ బంధురే...' అంటూ పార్టీ కామ్రేడ్లు రాసిన పాటలు అన్ని భాషల్లోనూ పాడబడ్డాయి. ఆ పాటల్లో

వాళ్ల పరాక్రమం అమరం అయింది.

జోషి రైతు సంఘ స్థాపనకు చాలా ప్రాముఖ్యం యిచ్చాడు. బెంగాల్ కరువు మూలంగా సర్వనాశనం చేయబడింది. అందుకే అది అఖిల భారత రైతు మహాసభకు స్థావరం చెయ్యబడింది. ఆ మహాసభ నేత్రకోనలోన జరిగింది. అది మైమెన్‌సింగ్ జిల్లాకు చెందినది. జోషి అక్కడకు హాజరైన ప్రతినిధులకు తమ శక్తినంతనీ రైతుసంఘాన్ని నిర్మించేందుకు వెచ్చించమని విజ్ఞప్తి చేశాడు. రైతులనుంచే కమ్యూనిస్టు పార్టీ బలంలో మూడోవంతు సమకూరిందని ఆయనకి తెలుసు. హిందువుల్లోనూ, ముస్లింలలోనూ, దేశపు అత్యంత పీడితుల్లోనూ అత్యధికశాతం రైతులదే. ఆ మహాసభలో రైతు మహిళలు చాలామంది పాల్గొనడం జోషిని సంచలితం చేసింది. ఆయన యిలా అన్నాడు:

... కాంగ్రెస్ మహాసభలో గాని, ముస్లింలీగ్ మహాసభలో గాని యింత పెద్ద సంఖ్యల్లో స్త్రీలను మీరు చూడరు. ఇక్కడ హాజరైన ప్రతి పది మందిలో ఒక స్త్రీ వుంది. రైతు ఉద్యమం గ్రామీణ ప్రాంతాలకు చెందిన వెనుకబడ్డ స్త్రీలను సైతం ఉత్తేజితుల్ని చెయ్యగలిగినప్పుడు, ఇక ప్రపంచంలో ఏ శక్తీ దాన్ని అణచలేదు, అది తప్పక విజయ వంతం అవుతుంది". [12]

కాని, పీపుల్స్‌వార్‌లో ఒక మహిళా జర్నలిస్టు రాసినదాన్ని బట్టి అక్కడ కొంత అసంతృప్తి కూడా ఉంది. మధ్యతరగతి మహిళలు వ్యవహరిస్తున్న తీరు, తమలో తాము మాట్లాడుకోవడం, ఉపన్యాసాలు సరిగా వినకపోవడం ఆ జర్నలిస్టును కొంత చికాకు పెట్టింది. ఆ జర్నలిస్టు జోషితో ఫిర్యాదు చేసినప్పుడు, ఆయన జవాబిచ్చి ఆ మహిళలను బలపరిచాడు. ఆ రిపోర్టు యిలా కొనసాగింది:

'ఇలాంటి సజ్జన మహిళలు ఇళ్ల నుండి బయటకి రావడం, ఖాళీ నేలపై కూర్చోవడం, దానికి తోడు రైతు స్త్రీలతో, సామాన్య (హజాంగ్) స్త్రీలతో

12. పీపుల్స్‌వార్, మే 6, 1945.

కలిసి కూర్చోవడం గొప్ప విషయం కాదా? బెంగాల్ జాతీయ జీవితంలో యిలాంటి విషయాలు ఎప్పుడైనా సంభవించాయా? మన ఉపన్యాసాలు సామాన్యమైనవి కావు. నేరుగా చెప్పేవి కావు. అందుకే వాళ్లు ఆ ఉపన్యాసాలు వినడం కంటె పరస్పరం మాట్లాడుకోవడం మొదలెట్టారు. సాంస్కృతిక కార్యక్రమం మొదలయ్యేదాకా వేచిచూడు, అప్పుడు వాళ్లెంత శ్రద్ధగా వింటారో నువ్వు చూస్తావు'.[13]

నిజానికి, జోషి ఆ హజాంగ్ మహిళలను బహిరంగంగా ప్రస్తుతించాడు, చినుకులు పడనారంభించినా వాళ్ళు సభాస్థలి నుంచి వెళ్లిపోరు, వేదికమీది నుంచి నాయకులు వాళ్లను వెళ్లిపొమ్మని ఆదేశించేదాకా వాళ్లు వెళ్లిపోరు. హజాంగ్ మహిళలు బృందాలు బృందాలుగా వెళ్లి భోజనాలు తయారు చేసేందుకు కూరగాయలను తరిగేందుకు తోడ్పడ్డారు. ఆ రిపోర్టరు ఒక ముసలి హజాంగ్ స్త్రీని చూసింది. ఆమె వయస్సు సుమారు 80 ఏళ్లు. ఆమె రక్తం కారుతున్న తన పాదాలను నీటిలో కడుక్కుంటూండగా రిపోర్టరు ఆమెని యిలా అడిగింది, "నువ్వీ వయస్సులో యింత దూరం వచ్చేందుకు శ్రమ ఎందుకు తీసుకున్నావ్?" ఆమె యిలా సమాధానం యిచ్చింది, "ఏమిటీ, పోయిన మూడు నెలలలుగా గ్రామంలోని కుర్రాళ్లందరూ యీ సమ్మేళనం కోసం బియ్యాన్ని, వెదుళ్లు మొదలైనవాటిని పోగుచేస్తున్నారు. అప్పటి నుండి నేను నేత్రకోన, నేత్రకోన, నేత్రకోన అనేమాటతప్ప మరేదీ వినలేదు. మీరు నేను వచ్చివుండ కూడదని అనాలనుకుంటున్నారా... మరణించేందుకు నా చుట్టూ ఉన్న వేలాదిమంది మన ప్రజలమధ్య కాక, యింతకంటె మెరుగైనచోటు మరొకటుంటుందా?"[14]

భారతదేశం అంతటినుంచీ ప్రతినిధులు వచ్చారు; సుమారు ఒక లక్ష మంది జనం వచ్చారు ఆ మహాసభకి. బంకిం ముఖర్జీ, అబ్దుల్లా రసూల్, పరులేకర్, పుచ్చలపల్లి సుందరయ్య, ముజఫర్ అహ్మద్, భవానీ సేన్‌లు రైతు ఉద్యమంతో సంబంధంవున్న కొందరు నాయకులు వేదిక మీద వున్నారు.

---

13. పీపుల్స్‌వార్, మే 13, 1945.
14. పై దానిలో, ఒక రిపోర్టు 'ఏమాంగ్ కిసాన్ ఉమన్'.

ప్రతినిధులూ, ప్రేక్షకులూ బస్సుల్లోనూ, రైళ్లలోనూ వచ్చారు. కొందరు రైలుపైన కూర్చుని సైతం వచ్చారు. ఆ మహాసభ జోషికీ, పార్టీకీ వున్న అధిక ప్రజాదరణను తెలియపరచింది. పి.సి.జోషి ఉపన్యాసంతో ఒక ముసలి రైతు అత్యంత ప్రభావితుడయ్యాడు. అతను యిలా చెప్పాడు:

> జోషి గొప్ప వ్యక్తి. మనమందరం అర్థం చేసుకోగల విషయాలను గురించి ఆయన ఎలా చెప్పగలిగాడు? రైతులమైన మనం అర్థం చేసుకోలేని ఉన్నత రాజకీయాలను గురించి మాట్లాడుతాడని నేను భావించాను. మీరు చెప్పండి, ఆయన బెంగాలీ కాదు, మన గ్రామాల్లో జరుగుతున్నదంతా ఆయన ఎలా తెలుసుకోగలిగాడు? ఆహార ధాన్యాల దొంగ నిల్వదారులను గురించి ఆయన చెప్పిన ప్రతి ఒక్కమాటా నిజమా? ఆయన మనల్ని చెయ్యమన్న పనుల్ని మనంచేస్తే, మన దురవస్థ నిజానికి గత విషయం అయిపోతుంది.[15]

రెండవ ప్రపంచ యుద్ధం ముగిశాక, రాబోయే ఎన్నికల గురించిన ప్రకటన 1945 ఆగస్టు 21వ తేదీన జరిగింది. స్వాతంత్ర్యం అన్న పదం లేకపోయినా, సంపూర్ణ స్వీయ ప్రభుత్వం ఏర్పడే అవకాశం వుందని వేవెల్ సెప్టెంబరు 19 న హామీ యిచ్చాడు. ఆ ఎన్నికలకు ప్రచార క్రమాన్ని రాజకీయ పార్టీలు ముమ్మరం చేశాయి. జోషి ఆ ఎన్నికల కార్యక్రమపు ముసాయిదాని తయారుచేశాడు. ఆ ఉద్యమ దృక్కోణాన్ని కామ్రేడ్ల దృష్టికి తెచ్చాడు. ఆయన 1945 అక్టోబరు 7న కమ్యూనిస్టు పార్టీ మిగతా పార్టీలను దూషించదనీ, కానీ జనానికి సామాన్య వాస్తవాన్ని తెలియజేస్తుందనీ రాశాడు.

> భారతదేశపు ప్రధాన పార్టీలు ఒకదానితో మరొకటి పోరాడితే భారతదేశ స్వాతంత్ర్యాన్ని సన్నిహితం చెయ్యలేరు, కాని, భవితవ్యపు అంతిమ మధ్యవర్తుల్లా, భారతదేశాన్ని బ్రిటిష్ సామ్రాజ్యవాదుల చేతుల్లో మాత్రమే వదులుతారు.

జోషి తన ఎన్నికల యాత్రలో దేశమంతటా పర్యటించాడు. ఆయన

15. పీపుల్స్‌వార్, మే 6, 1945.

ప్రధాన లక్ష్యం పార్టీ రాజకీయ స్థానాన్ని తెలియజెయ్యడం, జన సామాన్యంతో సంబంధాలు స్థాపించుకోవడం. బెంగాల్లో ఆయన మిద్నపూర్, జెస్సోర్, ఢాకా, మైమెన్‌సింగ్, చిట్టగాంగ్ జిల్లాల్లో పర్యటించాడు. అస్సాం సరిహద్దులో పార్టీ రైతుల బలీయ కేంద్రమైన సుసాంగ్‌లో సమావేశాలు జరిగాయి. ఆయన ఎక్కడికి వెళ్లినా, ఆయన మీటింగులు పెద్ద సంఖ్యలో హిందూ, ముస్లిమ్ రైతులను ఆకర్షించాయి. ఆయన ఆ సమావేశాల్లో పార్టీ విధానాన్నీ, కరువు కాలంలో జనానికి నిస్వార్థంగా సేవ చేసి, దొంగ నిల్వదారులకు వ్యతిరేకంగా ప్రచారంచేసి తన పార్టీ నిర్వహించిన రాజకీయ పాత్రనీ వివరించాడు.

బెంగాల్‌నుంచి జోషి బీహారులో పర్యటించి, పాట్నా, లక్షిసరాయ్, ముంఘీర్, బెగుసరాయ్‌లలో సమావేశాలు జరిపాడు. అక్కడి పరిస్థితి బెంగాలుకు భిన్నమైంది. అక్కడ ఆయన ప్రతికూల జనాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఆయన సమావేశాల మీద దాడులు జరిగాయి. అక్కడ గుంపు *'కమ్యూనిస్టు పార్టీ నశించాలి', 'పి.సి. జోషీ నశించాలి', 'కమ్యూనిస్టు పార్టీ గద్దర్ హై'* అంటూ నినాదాలు చేస్తూ, ఒక రైల్వేస్టేషను దగ్గర ఒక మూక జోషి మీద దాడి చేసింది. ఒక సిఖ్ఖు కామ్రేడ్ కత్తితో దాడి చేసిన వారిని తరిమేసి పి.సి.జోషీని కాపాడాడు. అన్ని రాష్ట్రాల్లోనూ బీహార్ అతి క్లిష్టమైనది. బహుశా పార్టీకి అత్యున్నత ప్రతిఘటన అక్కడ జరిగింది.

బీహార్‌లోని షేక్‌పురాలో జరిగిన రైతుల సమావేశంలో జోషి ఎన్నికల ప్రచారం యితరత్రా మేఘావృత దృశ్యంలో వెండిచార వంటిది. గ్రామంలో బ్రిటిష్ ఏజెంట్లైన జమీందార్ల మీద, వడ్డీ వ్యాపారుల మీద, దొంగ నిలువ దారుల మీద పోరాటం జరపమని జోషి వారికి పిలుపునిచ్చాడు. జోషి మహావక్త కాడు, ఆయన ఉపన్యాసాల్లో వాక్ఛూరత ఉండేది కాదు. అవి సంభాషణల రూపంలో వుండేవి. రైతులు వివిధ గ్రామాల్లో సగర్వంగా ఎర్రజండాని ఒక చేత్తో పట్టుకుని, రెండవ చేతిని పిడికిలి బిగించి పైకెత్తి సెల్యూట్ చేశారు. వందలాది రైతులు జోషికి కమ్యూనిస్టు సెల్యూట్ చెయ్యడాన్ని అనుమతించకుండా ఆయన్ని వెళ్లిపోనిచ్చేవారు కారు. జోషి ఒక బృందం నుంచి మరో బృందానికి వెళ్లి, వారి నమస్కారాలు స్వీకరించి, వాళ్లతో మాట్లాడాడు. అప్పుడు మాత్రమే రైతులు తమ గ్రామీణ డప్పులు మోగిస్తూ



సి.సి.ఐ తోలి సమావేశం, ముంబాయి, 1943.



కేంద్రీయ సాంస్కృతిక దళం



వ్రాతబల్ల వద్ద



పి.సి.జోషి, కల్పన జోషి, 1943

52B



కల్పన దత్ (జోషి).

S2C



సునీల్ జనాహ్ తీసిన పి.సి.జోషి ప్రసిద్ధ చిత్రం

520

తమ ఈలలు ఊదుతూ వెనక్కి తిరిగి వెళ్లారు".[16]

జోషి, ఉత్తరప్రదేశ్‌లోని కార్మికవర్గ ప్రాంతాలైన అలహాబాద్, లక్నో, కాన్పూర్‌లలో సమావేశాలకి హాజరయ్యాడు. అక్కడ నుంచి ఆయన ఆంధ్రకు వెళ్లాడు. అక్కడ పార్టీపైన విస్తృతమైన దూషణ ఉద్యమాలు జరిగాయి. పార్టీ కామ్రేడ్లపైన శారీరక దాడులు జరిగాయి. దేశమంతటా పార్టీ కార్యాలయాల పైన దాడులు జరిగాయి. పార్టీ పత్రికలు వెలువడటం, వాటి అమ్మకాలు బహిరంగంగా జరగడం అడ్డుకోబడ్డాయి. వాటిని లాక్కుపోవడం లేక తగల బెట్టడం జరిగాయి. తమిళనాడులోని రైతు మహాసభపైన దాడి జరిగింది. సమావేశపు పాక తగలబెట్టబడింది. కార్మికులను పొడిచి, ఎర్రజండాను తగుల పెట్టారు.

పార్టీ వ్యతిరేకులు లేక యితర రాజకీయ పార్టీలు చేస్తున్న ఆ దాడులను పరిస్థితులను ఎదుర్కొనేందుకు గాను నాయకులను సరికొత్త వ్యూహాన్ని రూపొందించేలా బలవంతం చేశాయి. ఈ సత్యాన్ని వెలువరించి, యితర పార్టీల అసత్యాలను, ఆరోపణలను తిప్పికొడుతూ కరపత్రాలను ప్రచురించి భారీ ఎత్తున పంచమని జోషి కామ్రేడ్లకు చెప్పాడు.అలాంటి గుండాయిజానికి వ్యతిరేకంగా ఆయన గట్టిమాటలతో ఆ కరపత్రాలు రాశాడు:

> ఎప్పుడెప్పుడు మన కామ్రేడ్స్ పైన విడిగానూ, బృందాలుగానూ దాడులు జరుగుతాయో, వాళ్లు తమని తాము ధైర్యంగా కాపాడుకుని, చుట్టూ వున్న సామాన్య ప్రజలను వచ్చి సాయం చెయ్యమని, ఎవరు ఎటువంటి వారో చూడమని చెప్పాలి. మన యువ మహిళా కామ్రేడ్లు తమ మీద రౌడీయిజం చేసేవాళ్లనీ ఎదిరించినట్లు నోళ్లతో, పిడికిళ్లతో ఆత్మ గౌరవాన్ని కాపాడుకోవాలి.
>
> ప్రతి ఒక్క కామ్రేడూ ఏ ప్రాంతమైన, అక్కడి పరిస్థితులు ఏవైనా, ఇబ్బందులు ఎంతటివైనా గట్టిగా రక్షణ కృషి చెయ్యాలి. ఎంతటి ఏ రెచ్చగొట్టడాలైనా మనం ఎలాంటి ఎదురు దాడులనూ జరిపేందుకు

16. *పీపుల్స్ ఏజ్,* మార్చి 3, 1946.

మనం పథకం వేసుకోము.[17]

ఈ దాడులూ, దూషణ కార్యక్రమాలూ కమ్యూనిస్టులపైన జరిగినా, 'క్విట్ ఇండియా' ఉద్యమంలో పాల్గొననందుకు వారిని దేశద్రోహులుగా ఆరోపించినా, పార్టీ నాయకత్వం కింద జరిగే ఫ్యూడల్ అణచివేత వ్యతిరేక పోరాటాలు దేశపు వివిధ ప్రాంతాల్లో నిరాటంకంగా కొనసాగాలి. అలా జరిగిన ఒక పోరాటం మహారాష్ట్రలోని వర్లీ గిరిజనులది. దానికి నాయకత్వం వహించినది గోదావరీబాయ్ పరులేకర్. ఆమెని ప్రేమగా బాయీ అని పిలిచేవారు. మహారాష్ట్రలోని ఠాణే జిల్లాలోని అంబర్‌గాంవ్, దహనూ, పాల్‌ఘర్ తాలూకాల్లో జీవించే పురాతన ఆదివాసీలపై విధించబడిన దాస్యానికి వ్యతిరేకంగా ఆమె పోరాటం జరిగింది. వారిమీద భూస్వాముల పీడన పరమ దారుణంగా వుండేది. కమతందారుల భార్యలను భూస్వాములు తమ స్వంత ఆస్తిగా ఉపయోగించుకుని ఆనందం పొందేవారు. 1945 లో థాణే జిల్లాలోని టిట్‌వాలాలో ఉద్యమం ప్రారంభించాలన్న నిర్ణయం జరిగింది. *'నిర్బంధ వెట్టిచాకిరీ నశించాలి'* అన్న నినాదాన్ని తొలిసారి విన్న మీదట వర్లీలు ఉత్తేజితులయ్యారు. గోదావరీబాయి వాళ్లమధ్య కొండల్లో, అడవుల్లో పని చెయ్యడం మొదలెట్టింది. ఆమె వాళ్లని బలవంతపు వెట్టిచాకిరీ నుంచి విముక్తుల్ని చెయ్యాలన్న ఏకైక నిర్ధారణతో వారిమధ్య నివసించింది. చివరకు వర్లీల భారీ తిరుగుబాటు 1945లో ప్రారంభమై 1947 దాకా కొనసాగింది.[18]

గోదావరీబాయిని వెంటనే అక్కడి నుండి వెళ్లిపోవాలన్న అజ్ఞ వచ్చినా, ఆ తరువాత 1947 ఫిబ్రవరిలో ఆమె రెచ్చగొట్టే ఉపన్యాసాలు చేసిందన్న అసత్యపు ఆరోపణలతో ఆమెను అరెస్టు చేసినా, సైన్యాన్ని పంపిచినా, వర్లీల పోరాటం విజయవంతమైంది. ప్రభుత్వాన్ని వెనుదిరిగేలా చేసింది. 1947 ఏప్రిల్ 5వ తేదీన సైన్యం వెనక్కి రప్పించబడింది ఆదివాసీ వర్లీలు వెట్టిచాకిరి నుంచీ, నిర్బంధ వివాహాలనుంచీ, యితర రకాల దోపిడి నుంచీ విముక్తులు

---

17. పీపుల్స్ వార్, నవంబరు 4, 1945.
18. వివరాలకోసం రేణూ చక్రవర్తి రచన, 162–169 పేజీల్లో చూడండి

చెయ్యబడ్డారు. పీడిత ప్రజల సమస్య పరిష్కారానికి పూర్తిగా అంకితమైన గోదావరీబాయి వంటి వాళ్ళు సరిగ్గా ఆ దశలో తయారైన కమ్యూనిస్టులు.

అదేవిధంగా, దేశపు తూర్పు భాగాన బెంగాల్ 19 జిల్లాలను మరో రైతు తిరుగుబాటు తాకింది. అదికమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన కౌలు దారుల హక్కుల కోసం జరిగిన తిభాగా ఉద్యమం. దాన్ని తిభాగా ఉద్యమం అని ఎందుకన్నారంటే సేద్యగాళ్లకు పంటలో మూడింట రెండువంతుల భాగం లభించాలనీ, కేవలం మూడోవంతు మాత్రమే భూస్వాములకు దక్కాలనీ అది పోరాడింది. తిభాగా అన్న పదానికి మూడింట రెండు వంతులు అని అర్థం. ఆ ఉద్యమంలో పాల్గొన్న రైతుల్లో పురుషులూ, స్త్రీలూ పెద్ద సంఖ్యలో ఉన్నారు. వాళ్ళు లాఠీలను, తుపాకులను ఎదుర్కొన్నారు. వాళ్ల పోరాట నినాదం *'మేము మా ప్రాణాలు యిస్తాం గానీ, మా వరిధాన్యాన్ని యివ్వం'.* సుహ్రావర్దీ ప్రభుత్వపు ఆధ్వర్యంలో కఠిన పోలీసు అణచివేత జరిగినప్పటికీ ఆ పోరాటం ఒక సంవత్సరం పాటు కొనసాగింది. అప్పటి ప్రభుత్వం చివరకు రైతుల కోర్కెల్లోని న్యాయసమ్మతాన్ని ఆమోదించి, జమీందారీ వ్యవస్థ రద్దుకు ముసాయిదా తయారు చేసింది. కాని, భూస్వాముల తీవ్ర ఒత్తిడి మూలంగా, దాన్ని శాసనసభలో(అసెంబ్లీ) ప్రవేశపెట్టలేదు. ప్రభుత్వపు భూమిపన్ను కమీషనర్ నివేదిక బెంగాల్ కరువు తర్వాత రైతుల దుర్దశ, పేదరికం మరింత పెరిగిందని పేర్కొంది. "75 లక్షల రైతు కుటుంబాల్లో 57 లక్షల రైతు కుటుంబాలు చేతిముద్దలతో జీవిస్తున్నాయి". రైతులు పంట ధాన్యాన్ని భూస్వామి ధాన్యాగారంలో చేర్చవలసి వస్తోంది. వాళ్లు వివిధ రకాల బలవంతపు వసూళ్లతో బాధలు పడుతున్నారు. కరువు అనంతరం ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. ఇవన్నీ కౌలుదారులను, వారి కుటుంబాలను తీవ్రంగా దెబ్బతీశాయి. 1940 దశకంలో రైతు ఉద్యమం రైతుల్లో మిక్కిలి చైతన్యాన్ని పెంచేందుకు తోడ్పడింది. రైతులు నిలవదారుల(జోతేదార్ల) ధాన్యపు కొట్లనుంచి ఆహారధాన్యాన్ని బయటకుతీసి, దాన్ని పేదలకు చౌక ధరల్లో అమ్మడానికి ఆ ఉద్యమం తోడ్పడింది. తిభాగా ఉద్యమం ఆవిధంగా కరువుదశలో ఆహార సంక్షోభం అనుభవం నుంచీ, దానికి తోడు భూస్వామ్య దోపిడీ గురించి రైతుల్లో పెరుగుతున్న చైతన్యం నుంచీ పుట్టి పెరిగింది.

సి.పి.ఐ (భారత కమ్యూనిస్టు పార్టీ) సైతం తెలంగాణా ఉద్యమంలో చారిత్రక పాత్ర వహించింది. హైదరాబాద్ నైజాం బ్రిటిష్ వారితో కలిసి కుట్ర ద్వారా తన రాజరిక రాజ్యాన్ని స్వతంత్ర రాజ్యంగా గుర్తింపచెయ్యాలనీ, దాన్ని భారత యూనియన్‌తో విలీనం చెయ్యరాదనీ చేసిన కుట్రను కమ్యూనిస్టు పార్టీ సరిగ్గా అర్థం చేసుకుంది. రాజరిక రాజ్యాలన్నింటిలో హైదరాబాదు మిక్కిలి పెద్దది. ఆ ప్రాంతం నలభైశాతం పెద్దపెద్ద భూస్వామ్య ఎస్టేట్లుతో కూడి వుంది. రైతుల నుంచి విపరీతమైన అద్దెలు, బలవంతపు శ్రమ, చట్ట రహిత దోపిడీలు, బాదుళ్లు, చంపడాలు అక్కడ సాగిన అత్యంత హీనమైన అణచి వేతలు, దోపిడీల పద్ధతులు. 1944 ఏప్రిల్లో బెజవాడలో జరిగిన జనం విపరీతంగా పాల్గొన్న అఖిల భారత రైతు సంఘ మహాసభ ప్రజారక్షణ కోసం నిరసన కార్యక్రమాన్ని వెలువరించింది. అఖిల భారత కార్మిక సంఘాన్ని (ఎ.ఐ.టి.యు.సి), అఖిల హైదరాబాద్ విద్యార్థి సంఘాన్ని, మహిళా సంఘాల్ని ఆ పోరాటంలో పాల్గొనమని కమ్యూనిస్టు పార్టీ పిలుపు నిచ్చింది. 1945లో జనం నిర్బంధ శిస్తులకు వ్యతిరేకంగా తిరగబడ్డారు. నైజాం నవాబు సాయుధ బలగాలు, అతని రజాకార్ ముఠాలపైన సాయుధ ప్రతిఘటన జరిగింది. నైజాం పాలనని శాశ్వతంగా అంతం చేయడమే దాని లక్ష్యం. అది సుదీర్ఘ పోరాటం. ఒక గ్రామం తర్వాత మరో గ్రామం ఆ పోరాటంలో చేరినాయి. ఆ కాలంలోనే ఆంధ్ర మహిళా సంఘం ఒక బలవత్తరమైన ప్రజా సంఘంగా పెరిగింది. కానైతే, అంతకంటె ముందు కూడా, 1943 సెప్టెంబరులో, మహిళలకు శిక్షణ యిచ్చేందుకుగాను ప్రత్యేక శిక్షణా శిబిరాలు ఏర్పాటు చెయ్యబడ్డాయి.[19] గణేశ్ శుక్లా తన జ్ఞాపకాల్లో యిలా రాశాడు:

> తెలంగాణా సాయుధ పోరాటం వెనుక జోషి ప్రథమ ఉత్తేజకారుడు. ఆయన దేశపు వివిధ ప్రాంతాలనుంచి ఆయుధాలను, మందుగుండు సామానులను సరఫరా చేసేందుకు విస్తృత సమాహారాన్ని నిర్మించాడు. దీంట్లో ఆయనకు పలువురు మిలిటరీ అధికారుల తోడ్పాటు వుంది.

19. వివరాలకు రేణు చక్రవర్తి రచనలో 138-139 పేజీలు చూడండి.

వాళ్లు ఉచితంగా ఆయుధాలను యిచ్చారు. వాళ్లు వాటిని ఓడలో తెలంగాణాకు చేర్చేందుకు ఏర్పాట్లు చేశారు. జోషికి, అధికారికి తప్ప మరే నాయకునికీ యీ రహస్య కార్యక్రమం విషయంలో ఏ నిర్దిష్ట అభిప్రాయమూ లేదు.[20]

సాయుధ పోరాటం 1951 చివరిదాకా కొనసాగింది. నిజాం నవాబు చివరికి లొంగిపోవలసి వచ్చింది.

అఖిల భారత కార్మిక సంఘం (ఎ.ఐ.టి.యు.సి) నాయకత్వాన జీతాల పెంపుదలను డిమాండు చేస్తూ కార్మికుల హక్కులను కాపాడేందుకు గాను అనేక వీరోచిత పోరాటాలు జరిగిన దశ యిదే. కార్మికుల భారీ తొలగింపుకు నిరసనగా కలకత్తాలోని ఇనుము, స్టీలు ఫాక్టరీలోని కార్మికుల సమ్మె, హౌరా, హుగ్లీలలోని జనపనార మిల్లుల్లో సమ్మెలు, 1946 జనవరిలో కోలారు బంగారు గనుల్లో సమ్మె, 1946 జులై 29న అఖిల భారత పోస్టల్ బృహత్ సమ్మె, 1946 ఆగస్టులో మద్రాసు కార్పొరేషన్ కార్మికుల సమ్మె, 1946 ఆగస్టు–సెప్టెంబరు మాసాల్లో 40,000 కార్మికుల దక్షిణ రైల్వే సమ్మె, 1946 నవంబరులో కోయంబత్తూరులో నేత కార్మికుల సమ్మెల కమ్యూనిస్టు పార్టీ ప్రారంభించిన పోరాటాల్లో కొన్ని. 1947లో జరిగిన సమ్మెల సంఖ్య 1811. వీటిలో 18 లక్షల మంది కార్మికులు కార్మిక సంఘాల సమ్మెల్లో పాల్గొన్నారు.

1946 ఫిబ్రవరిలో బొంబాయిలో జరిగిన భారీ నౌకా తిరుగుబాటు దేశాన్ని కంపింపజేసింది. రాయల్ భారత నౌకాదళంలోని కమ్యూనిస్టు కామ్రేడ్లు బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా యీ తిరుగుబాటును సమీకరించారు. భారతీయ నౌకా సిబ్బంది బ్రిటిష్ ఆఫీసర్లకు వ్యతిరేకంగా తిరగబడ్డారు. బొంబాయి, దాని పరిసరాల్లో మొత్తం 12 తీర సంస్థల్లో సుమారు 20,000 మంది నౌకా సిబ్బంది హార్బరులోని 20 ఓడలు పిడుగుపాటు సమ్మె చేశారు.

కాంగ్రెస్, ముస్లింలీగ్, కమ్యూనిస్టు పార్టీల జెండాలు వందల సంఖ్యలో అప్పటికప్పుడు కుట్టబడి రహస్యంగా ఓడలకు పంపబడ్డాయి. ఆ మూడు జెండాలూ ప్రతి ఓడ తెరచాప కొయ్యల మీదా అంటించబడాలన్న

20. గణేశ్ శుక్లా రచనలో పేజి. 89.

సూచనలు చెయ్యబడ్డాయి. ఆ జండాలు రాత్రికి రాత్రి పైకి వెళ్లాయి. ఈ ముందు జాగ్రత్త చర్యలో తిరుగుబాటుదారులకు తోడ్పాటు విషయంలో అన్ని పార్టీల, అన్ని కులాల, అన్ని జాతుల సమైక్యతను దృఢీకరించేందుకు తీసుకోబడింది. అదేవిధంగా మూడు జెండాలు చాలా భవనాలపైనా, చెట్లపైనా, ఓడరేవు ఎదుటి కరెంటు స్తంభాల మీద చోటు చేసుకున్నాయి.[21]

బొంబాయి ప్రజలు ఈ తిరుగుబాటుదారులకు అండగా నిలబడ్డారు. ఆ వెంటనే ఒక హర్తాళ్‌లో ఆయుధ రహితులైన జనం మీద విచక్షణా రహితంగా జరిగిన కాల్పులతో బొంబాయి ప్రకంపించింది. పీపుల్స్ ఏజ్ పత్రిక యిలా రాసింది:

...ఆ కాల్పుల మధ్య సైతం నావికులకు సహాయంగా జనం పరుగులు తీశారు. గేట్‌వే ఆఫ్ ఇండియా చుట్టూ వున్న సముద్రతీరం అన్నిరకాల జనంతో యువకులు, వృద్ధులు, స్త్రీ,పురుషులు, బాలబాలికలు, హిందువులు, ముస్లింలు, భారతదేశపు అన్ని ప్రాంతాల నుంచీ వచ్చిన వారితో నిండిపోయింది. ఓడల నుంచి పైకి వచ్చే మోటారు లాంచీల మీద విసిరేందుకుగాను, వాళ్లు పళ్లు, యితర ఆహారాల గంపలతో, పొట్లాలతో వచ్చారు. భారతీయ సైనిక దళాలు చూస్తూ నిలబడి, వారికి అడ్డుపడలేదు. సామాన్య ప్రజలు లోపల వున్న నావికులకు ఆహార పొట్లాలు అందజేసేందుకు తమ అత్యుత్తమ కృషి చేశారు.[22]

సాయుధ బలగాల్లో వున్న సుబ్రతా బెనర్జీని భారత నావికాదళపు సమ్మెను గురించి రాయమని జోషి ప్రేరేపించాడు. ఆయన సుబ్రతాకి ఆ సమ్మెలో పాల్గొన్న చాలామందిని, ఆ తిరుగుబాటు నాయకుల్లో కొందరిని పరిచయం చేశాడు. అంతే కాదు, సుబ్రతా బెనర్జీ ఆ సంఘటనను స్వయంగా యిలా గుర్తు చేసుకున్నాడు:

---

21. గణేశ్ శుక్ల రచన పుట. 89.
22. పీపుల్స్ ఏజ్‌లో అరుణ్ బోస్ నివేదిక, మార్చి 3, 1946.

కాంగ్రెస్ అప్పటికి కేంద్రంలోని తాత్కాలిక ప్రభుత్వంలో చేరింది. అధికార బదిలీక్రమం ప్రారంభమైంది. భారతీయ సాయుధ బలగాలను పునర్నిర్మించే విషయంలో విస్తృత చర్చలు జరిగాయి. ఈ అంశంపైన కమ్యూనిస్టు దృక్పథం నుంచి విజ్ఞాపన పత్రం తయారు చెయ్యమని జోషి సూచించాడు..... జోషితో మరల మరల జరిగిన చర్చలు పెద్ద సహాయం చేశాయి. అతి త్వరలో దేశమూ, కమ్యూనిస్టు పార్టీ పలుమార్పుల్లో యిరుక్కున్నాయి. అలాంటి పరిస్థితుల్లో, నేను తయారు చేసిన విజ్ఞాపన పత్రం పెద్దగా ఉపయోగపడలేదు.

అప్పుడు విస్తృతమైన ఆలోచనాస్థితి, విశాల దృష్టి కలిగిన జోషి పార్టీ కేంద్ర కార్యదర్శిగా, థర్డ్‌క్లాస్ రైలు బండిలో, కేవలం కూర్చుని మాత్రమే దేశమంతటా పయనించాడు. ఆరోజుల్లో మూడుశ్రేణుల పద్ధతి యింకా లేకపోవడమే యిందుకు కారణం. ఆయన జనాన్ని కలిసేందుకు, వారి ఆచారం, జీవన విధానం తెలుసుకునేందుకూ, గిరిజనులతో బాటు భారత సమాజపు అన్ని విభాగాల సంస్కృతినీ, కళలనీ తెలుసుకునేందుకూ నిరంతరాయంగా ప్రయత్నించాడు. ఆయన తెలివైన ఊహలు పార్టీ తన శైశవావస్థ నుంచి క్రమశిక్షణాయుతమైన భారత జాతీయ ప్రజాపార్టీగా, 1947లో 80,000 సభ్యత్వంతో పెరిగేలా చేశాయి. ఆయన యాత్రలు కూడా ఆయన రాజకీయ భావాల ప్రచారోద్యమంలో ఒక భాగం. ఆయన ఒకసారి యిలా అన్నాడు:

> ... పార్టీ విధానాలను ప్రజలు తెలుసుకునేలా చెయ్యడంలో అత్యుత్తమ పద్ధతులు మూడవతరగతి రైలు పెట్టెలో పయనించడం, పార్టీ పత్రికను తెరవడం. అది జనంలో ఉత్సుకతను రేకెత్తించి, అనేక ప్రశ్నలకు దారి తీస్తుంది. అవి ముందు కామ్రేడ్లకు మొదట ప్రజల భావాలను, ప్రశ్నలను అర్థం చేసుకునేందుకు, అటు తర్వాత వారి సందేహాలను, దుర్భ్రమలను తొలగించేందుకూ ఒక అవకాశం యిస్తాయి. భారతీయ ప్రయాణికులు ఉత్సుకత కలిగినవాళ్లు. ఏవిధంగానైనా చర్చలు 'కాలక్షేపానికి ఒక రూపం. వేరుసెనగలు, శనగ గింజల అమ్మకం దారులు

తమ అమ్మకాలు పెరగడానికి కూడా అది మార్గం అంటారు.[23]

ఆ దశలో, పి.సి.జోషి పార్టీ ప్రజా సంఘాల నిర్మాతగా పెంపొందాడు. కళాకారుల్నీ, మేధావుల్నీ, రచయితల్నీ, నాటక రచయితల్నీ జనానికి, పార్టీకి సన్నిహితంచేసి, తన సాంస్కృతిక వ్యాప్తి కోసం ఆయన అవిశ్రాంత కృషి చేశాడు. దీన్ని సదా అందరూ జ్ఞాపకం చేసుకుంటారు. నూతన సాంస్కృతిక పునర్ జాగృతికి ఆయన మహామహుడు. కమ్యూనిస్టు నాయకుడుగా ఆయన సహాయం యిదొక్కటి మాత్రమే అనుకుంటే ఆయన్ని కించపరచడమే అవుతుంది. ఎందుకంటే, ఆయన యింతకంటే ఎక్కువ కృషి చేసినవాడు. నిజానికి ఆయన గొప్ప భావుకుడు. బెంగాల్ కరువు తర్వాత రైతుల దుస్థితిని ఆయన గుర్తించి, పార్టీని సమరశీల రైతు ఉద్యమ నిర్మాణం కోసం, పార్టీని అదే సమయంలో దేశమంతటా కార్మికవర్గ పోరాటాలను పెంపొందించేందుకు తోడ్పడటం కోసం పార్టీని సన్నద్ధం చెయ్యడం ఆయన మహత్తర దృష్టికి సాక్ష్యం. అది సామాజిక పరివర్తనకు గాను సామూహిక రాజకీయ కార్యక్రమాల ప్రాముఖ్యతను తెలిపే విషయం. అదే సమయంలో గణనీయమైన సూచకుడుగానే కాక, గొప్ప ఆర్గనైజరుగా కూడా తనని తాను రుజువు చేసుకున్నాడు. ప్రముఖ జర్నలిస్టుగా ఆయన తన విస్పష్ట సముచిత రచనల ద్వారా, తన వ్యక్తిగత సమీకరణాల ద్వారా జనానికి ఆయన చేరువయ్యేవాడు. అన్నింటికంటె ముఖ్యంగా, ఆయన భారత కమ్యూనిస్టు పార్టీని ఓ చిన్నదశ నుండి ఎనభై వేలకు పైగా సభ్యత్వంతో పెంపొందించాడు.

---

23. మొహిత్ సేన్ రచన, *ఏ ట్రావెలర్ అండ్ ద రోడ్: ద జర్నీ ఆఫ్ అన్ ఇండియన్ కమ్యూనిస్టు',* రూపా అండ్ కో., న్యూ ఢిల్లీ 2003, పుట 120.


Acc.No = 2614
Cl.No: 900

# 4

# జోషి - జాతీయోద్యమం

మన జాతీయోద్యమం క్లిష్టదశలో సాగుతున్న సమయంలో పి.సి.జోషి భారత కమ్యూనిస్టు పార్టీ బాధ్యతను తీసుకున్నాడు. పార్టీని ఆయన చిన్న చిన్న స్థానిక బృందాలనుంచి కేంద్రీకృత అఖిల భారత రాజకీయ సంఘంగా నిర్మించ గలిగాడు. ఆయన నాయకత్వంలో సి.పి.ఐ. జాతీయ స్థాయిని సాధించింది. కొద్దికాలంలోనే ఆయన జాతీయ నాయకుడుగా గుర్తింపబడ్డాడు. ఆయన స్థిరమైన దేశభక్తి అంతర్జాతీయతతో మిళితమైంది. ఆలోచన, ఆచరణలలో ఆయన ప్రబల సామర్థ్యం ఆయనను ఒక విస్పష్ట తరహా స్వాతంత్ర్య యోధుడిగా చేసింది. మరే యితర కమ్యూనిస్టు నాయకుడికీ అలాంటి రాజకీయ అవగాహన, వ్యక్తిగత ఆకర్షణశక్తీ లేవు. వీటితో ఆయన కమ్యూనిస్టేతరుల్నీ, చివరకు కమ్యూనిస్టు పార్టీ వ్యతిరేకుల్ని సైతం తనకి సన్నిహితుల్ని చేసుకునే శక్తి సమకూరింది. సి.పి.ఐ, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీతో, వామపక్ష కాంగ్రెస్ వ్యక్తులతో స్థానిక విప్లవాత్మక బృందాలతో నాయకత్వాన్ని పంచుకుంది. కాని, సి.పి.ఐ. అందరికి ఆమోదయోగ్యమైన నిర్ణయాత్మక పాత్రను వహించింది. దీనిని అందరు గుర్తించారు. ఇదంతా పి.సి.జోషి నిర్వహించిన నిర్మాణాత్మక భూమిక వల్ల సాధ్యమైంది.

పి.సి.జోషి జీవితం, కార్యకలాపాలూ అంతర్జాతీయ, జాతీయ, రాజకీయ సమస్యలకు సంబంధించిన వివిధ సమస్యలతో ముడిపడి వున్నాయి. పార్టీ నాయకత్వం తీవ్రమైన సవాలును ఎదుర్కొంది. ఒక వైపున, బ్రిటిష్ సామ్రాజ్యవాదం నుంచి విముక్తి పోరాటం, మరోక వైపున, ఫాసిజం, నాజీయిజాల దాడి నుండి ప్రజాస్వామ్యాన్నీ, సోషలిజాన్నీ రక్షించడం కోసం

పోరాటం. పి.సి.జోషి ఫాసిజాన్ని సామ్రాజ్యవాదపు మిక్కిలి చెడ్డరూపంగా పరిగణించాడు. రహస్య స్థావరంలో (అండర్‌గ్రౌండ్‌లో) నుంచి పనిచేస్తున్న సి.పి.ఐ.యుద్ధ సమస్య మీద సరైన రాజకీయ వైఖరి తీసుకోవడం కష్టమైంది.

దేవలీ శిబిరం(క్యాంప్)లో నిర్బంధించబడిన కామ్రేడ్లు రణదివే, డాంగే, అజయ్‌గోష్‌లు ఆ యుద్ధాన్ని ప్రజాయుద్ధంగా వర్ణించి, యుద్ధప్రయత్నానికి తోడ్పడాలని వాదిస్తూ తయారుచేసిన పత్రాన్ని రహస్యంగా బయటికి పంపారు. జోషీ ప్రతిస్పందన దానికి పూర్తి వ్యతిరేకమైంది. ఆయన ఆ పత్రం గురించి బాగా తర్వాత యిలా రాశాడు.

> అది నాకు మింగుడు పడలేదు. ఆ దేవలీ పత్రానికీ, రాయిస్టు విధానానికీ తేడా నాకేమీ కనిపించలేదు.[1]

సోవియట్ యూనియన్‌పైన నాజీల దాడి తర్వాత సైతం, కాంగ్రెస్ జాతీయ నాయకత్వం తన యుద్ధ వ్యతిరేక వైఖరిని కొనసాగించడాన్ని కటువుగా ఖండిస్తూ దేవలీ శిబిరంలోని కామ్రేడ్లు ఒక పత్రాన్ని తయారు చేశారు. కానైతే, బ్రిటిష్ కమ్యూనిస్టు నాయకులు జోషిని, డా.అధికారిని దేవలీ శిబిరపు పత్రాన్ని కొద్దిగా మెత్తబరచమని అడిగారు. అప్పుడది జాతి మనోవైఖరినీ, పార్టీ పరిధికి బయటఉన్న వారి ప్రవృత్తినీ వినియోగిస్తుంది. ఆ యుద్ధం గ్రేట్ బ్రిటన్ కమ్యూనిస్టుపార్టీతో పాత సంబంధాలను పూర్తిగా తుంచివేసింది. అప్పుడు తిరిగి పార్టీ అండర్ గ్రౌండ్‌లోకి వెళ్లాల్సి వచ్చింది. "బ్రిటిష్ సామ్రాజ్యవాద యుద్ధంనుంచి ప్రజాయుద్ధం (పీపుల్స్‌వార్) నినాదానికి ఊగడం"అంత తేలిక కాదు[2] జోషి అంగీకరించినట్లు ఆయన అదే వ్యాసంలో యిలా కొనసాగించాడు.

> కామ్రేడ్ అధికారి అంతర్జాతీయ విధానంపట్ల నాకంటె తీవ్రమైన విధేయుడు. ఆయన ఎంతగా వినమ్రుడో అంత అలుపులేని వాడు.

---

1. పి.సి.జోషి 'రజనీ పామీదత్తు, భారత కమ్యూనిస్టులు', నుండి.
2. పైదే.

> రజనీ పామీదత్తు తర్వాత నేనాయన్ని చాలా గౌరవించాను. నేను నాయకత్వంలో ఉన్నప్పుడు, నేను నా అత్యధిక పోరాటాన్ని సాగించి నప్పుడు ఆయన తీర్పును నా తీర్పుకంటె ఎక్కువగా విశ్వసించి, ఆయనకి నేనెప్పుడూ లొంగేవాడిని.[3]

ఆ పత్రం 1941 నవంబరులో (స్వాతంత్ర్యానికి ముందంజ) శీర్షికతో, హన్సరాజ్ పేరిట ప్రచురించబడింది. హన్స్‌రాజ్ అన్నది రహస్య జీవితంలో పి.సి.జోషి పేరు. దాని పీఠికలో యిలా రాయబడింది.

> సింగపూర్ పతనం, ఫ్రాన్స్ పతనం ఎలాంటి పరివర్తన అంశమో అలాంటిదే... సింగపూర్ పతనపు వినాశకర పరిణామాలు, మొత్తం ఫాసిస్టు వ్యతిరేక సంఘటననంతనీ తేరిచూచేలా చేసింది, వలసదేశాల విముక్తి సమస్యను, అన్నింటికంటె ముఖ్యంగా భారతదేశ సమస్యను అంతకు ముందటి కంటే యిప్పుడు మరింత సత్వర సమస్యగా చేసింది. అన్ని స్వాతంత్ర్య వాంఛిత దేశాల దారుణ ఆపత్తును వాయిదా వేయగలగడం కంటె భారతదేశానికి తక్షణ సమస్యను చేసింది. దక్షిణ పసిఫిక్‌పైన జపాన్ ఆధిపత్యం వహించింది, సముద్రం మీద మరియు గాలిలోనూ యావత్తు భారతీయ సముద్రమూ వెలివడివుంది.[4]

జోషి రాసిన యీ కరపత్రం పార్టీలోని కామ్రేడ్లకి బైబిల్ అయినా, హిట్లర్ ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడే యుద్ధవ్యూహం భావం జనానీకం చేత అపార్థం చేసుకోబడింది. జపాన్ దౌర్జన్యపు దాడి ప్రమాదం భారత దేశంలో అధికమవడం ప్రారంభమైనప్పటి నుంచీ, ఆ కొత్త పరిస్థితికి సంబంధించి వెనకటి దేవలీపత్రాన్ని పక్కన పెట్టి ఒక కొత్త విధాన పత్రాన్ని రచించమని జోషిని అడిగారు. జాతీయుల మానసిక భావస్థితికి అనుకూలంగా "విధానాన్ని మెరుగు పరచి, మరింత హితకరంగా మార్చే" అవకాశం యిది.

---

3. పి.సి.జోషి 'రజనీ పామీదత్తు, భారత కమ్యూనిస్టులు'.
4. హంసరాజ్, *'ఫోర్‌వర్డ్ టూ ఫ్రీడం (ఇండియా ఇన్ ద వార్ ఆఫ్ లిబరేషన్)'*, ఆనంద్ ప్రెస్, న్యూఢిల్లీ 1941, పుట. 13.

ఈ సారి జోషి "జాతీయ రక్షణ, జాతీయ ఐక్యత, జాతీయ ప్రభుత్వం" అనే క్రొత్త నినాదాన్ని ముందుకు తెచ్చాడు.[5] జోషీ అప్పుడు *భారత కమ్యూనిస్టు పార్టీ దేశవిముక్తి పోరాటంలో దాని విధానం, కృషి* ( The Indian Communist Party: Its Policy and Work in the War of Liberation) అనే పుస్తకం రాశాడు. హారీపాలిట్ రాసిన ముందుమాటతో 1942 సెప్టెంబరులో అది ప్రచురించబడింది. దీనిలో జోషీ యిలా రాశాడు.

> సోవియట్ యూనియన్ (యు.ఎస్.ఎస్.ఆర్) పైన దాడితో సామ్రాజ్యవాద యుద్ధప్రభావం ప్రజాయుద్ధంగా మారింది... సోవియట్ యూనియన్ విజయం ప్రపంచమంతటా ప్రజావిముక్తికి హామీ అయింది.[6]

ఫాసిజాన్ని పోషించడంలో పశ్చిమదేశాల పాత్రను గురించి చెప్తూ ఆయన యిలా వివరించాడు.

> బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు యీ ప్రమాదం తెలియనివారు కారు, అయినప్పటికీ, వాళ్లు యీ (ఫాసిస్టు) శక్తులు పెరగడాన్ని ఉద్దేశ పూర్వకంగా అనుమతించారు, యూరప్‌లోనూ, తూర్పుదేశాల్లోనూ సోవియట్ యూనియన్‌కి వ్యతిరేకంగానూ యీ విప్లవవ్యతిరేక శక్తిని పెంపొందించనిచ్చారు. ప్రపంచ అధినేతలుగా, యీ ప్రతికూల చర్యను పోషించేందుకు ప్రపంచమంతటా సాగుతున్న, పెరుగుతున్న ప్రజా ఉద్యమాలను నెట్టిపారేసేందుకు వాళ్లు 'భారీ, ప్రమాదకర' ఆటలు ఆడుతున్నారు. ప్రజలకు, సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా తమ ప్రతికూల ఘర్షణలను పరిష్కరించుకునేందుకు వాళ్లు ప్రయత్నిస్తున్న పద్ధతి యిది.[7]

ఈ విధానానికి అర్థం ఫాసిజాన్ని బలపరచడం, రెండవ ప్రపంచ యుద్ధాన్ని

---

5. పి.సి.జోషి, *'రజనీ పామీదత్తు, భారత కమ్యూనిస్టులు'*, పుట. 13.
6. పి.సి.జోషి, *'ఇండియన్ కమ్యూనిస్టు పార్టీ: ఇట్స్ పాలసీ అండ్ వర్క్ ఇన్ ద వార్ ఆఫ్ లిబరేషన్'*, సిపిజిబి ప్రచు, లండన్, సెప్టెంబరు 1942, పుట. 3
7. పైదే, పుట. 4.

సోవియట్ యూనియన్‌పైకి వ్యాపింపచెయ్యడం. ఫాసిస్టుల, ఫాసిస్టు అనుకూల విప్లవ వ్యతిరేకుల యీ దారుణ విధానాన్ని ఓడించేందుకు, ప్రజా ఉద్యమాల పురోగామి విభాగాలు ప్రపంచవ్యాపిత ఫాసిస్టు వ్యతిరేక శాంతి సంఘటనను సృష్టించేందుకు ప్రయత్నించాయి.[8] ఈ నూతన పరిస్థితిలో, భారతదేశపు పార్టీ పాత్రను ఆయన సముచితంగా వివరించాడు.

> ...భారతీయ ప్రజలు, తూర్పు వలసదేశాల్లోని ప్రజలు, తమకు స్వాతంత్ర్యం సామ్రాజ్యవాదుల బహుమతిగా రాదన్న విషయాన్ని తమ అనుభవం ద్వారా తెలుసుకున్నారు. అలాగే జపాన్ ఫాసిస్టుల రక్తరంజిత కత్తులద్వారా సైతం రాదని కూడా తెలుసుకున్నారు.[9]

తర్వాత మరింత వివరిస్తూ, యిలా రాశాడు.

> ఈ యుద్ధాన్ని వ్యతిరేకించి మనం మన స్వాతంత్ర్యం కోసం యిక ఏమాత్రం పోరాడలేము. అలా చెయ్యడం ద్వారా మనం మన పీకలను నరుక్కుంటాం. మనం బ్రిటిష్ సామ్రాజ్యవాదంపైన దెబ్బ కొట్టలేం, సరికదా జపాన్ ఫాసిస్టుల పనిని వాళ్ళకోసం చేసిపెడతాం. మనం బ్రిటిష్ సామ్రాజ్యపు బానిసలం కనుక యీ యుద్ధానికి వెలిగా ఉండలేము. ఈ యుద్ధంపట్ల తటస్థ వైఖరి తీసుకోవడమంటే మనం ఎక్కడున్నామో అక్కడే ఉండటం బ్రిటిష్ సామ్రాజ్యవాదం కింద, నిస్సహాయంగా జపాన్ ఫాసిజం కింద మరింత హీనస్థితిలో వుండేందుకు నిరీక్షిస్తాం. ఈ యుద్ధంపట్ల తటస్థ విధానం భారతదేశ స్వాతంత్ర్యానికి దారితియ్యదు కానీ జపాన్ తోడేళ్ళ రాజ్యానికి మనల్ని నడుపుతుంది.[10]

జోషి, జపాన్ ఫాసిజం తూర్పు సరిహద్దుమీద ముసురుతున్న ప్రమాదాన్ని గురించి మాత్రమే కాకుండా, సామ్రాజ్యవాదం, ఫాసిజం అనే రెండు శత్రువుల

---

8. పైదే, పుట. 4.
9. పైదే, పుట 6.
10. పైదే, పుట 13.

మీద పోరాడేందుకు జాతీయ వ్యూహాన్ని వెల్లడించాడు. అంతిమ గమ్యం భారతదేశ స్వాతంత్ర్యం.

> కమ్యూనిస్టుపార్టీ అభిప్రాయంలో, ప్రజల భావిమార్గాల సారాంశాన్ని మూడు నినాదాల్లో చెప్పవచ్చు. అవి ప్రతిష్టంభనని ధ్వంసం చేయ్యండి, జాతీయ ఐక్యతని ధ్రువీకరించండి, ప్రజా సమూహాలను సమీకరణ చేయండి.[11]

జోషి అదేవ్యాసంలో యిలా కొనసాగించాడు.

> కాంగ్రెస్, ముస్లింలీగ్, ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, అఖిల భారత రైతు సంఘం, అఖిల భారత విద్యార్థి సమాఖ్యల ఐక్య సంఘటనలో కమ్యూనిస్టు పార్టీ సాధ్యమైనంత విస్తృత సమీకరణను సాధించేందుకు కృషి చేసింది. జాతీయ కాంగ్రెస్ మన ప్రజల ప్రధాన రాజకీయ సంస్థ. భారత ప్రజల జాతీయ ప్రజల అత్యున్నత ఐక్యతను అది సాధించింది. ముస్లింలీగ్ మన దేశంలోని రెండవ అతిపెద్ద జన సమూహపు రాజకీయ సంఘం. కార్మిక సంఘాలు, రైతు సంఘాలు, విద్యార్థి సంఘం పోరాట సంఘాలుగా జనించి, జాతియొక్క పోరాటశక్తులుగా పనిచేశాయి. సంయుక్త సంఘటనలోఈ ప్రజా సంఘాల విస్తృత ఐక్యత భారతదేశ విస్తారమైన ఐక్య సంఘటన.[12]

భారతదేశ స్వాతంత్ర్యం కోసం నిలిచే అన్ని పార్టీలకు, అందరు దేశ భక్తులకు మేము విజ్ఞప్తి చేస్తున్నాం.

> పీపుల్స్‌వార్‌ని ప్రజల చేతుల్లోకి తీసుకెళ్ళేందుకు ఏకం కండి.
> జాతీయ ప్రభుత్వం కోసం పోరాడేందుకు అలాగే ప్రజాస్వామిక స్వేచ్ఛల కోసం కూడా ఏకం కండి.
> ప్రజల రక్షణ కోసం ఏకం కండి.
> మన ప్రియమైన దేశ రక్షణ కోసం ఏకం కండి.

---

11. పైదే, పుట 15.
12. పైదే, పుట 16.

ప్రజా యుద్ధాన్ని గెలిచేందుకు, భారతదేశ స్వాతంత్ర్యం కోసం ఏకం కండి.[13]

యుద్ధానంతర దశలో, కాంగ్రెస్‌లోని మితవాద, అతివాద నాయకులు యిద్దరూ భారత కమ్యూనిస్టుల్ని (సి.పి.ఐ)ద్రోహులుగా ఆరోపించారు. మితవాద విభాగపు నాయకుడు. 'సాంప్రదాయిక, పురాతన భావాల జాతీయ వాది' సర్దార్ పటేల్ అంటూ జోషి ఆయనను వర్ణించాడు. వామ పక్షానికి ఫార్వర్ట్‌బ్లాక్‌తో బాటు జయప్రకాశ్ నారాయణ్ వంటి కాంగ్రెస్ సోషలిస్టులు నాయకత్వం వహించారు. కమ్యూనిస్టు పార్టీ తరపున జోషి కొన్నిసార్లు మహాత్మాగాంధీని కలిసి, ఆయన్ని కదిలించి, పార్టీ రాజకీయ విధానం సరైనదని ఆయన్ని నమ్మించేందుకు ప్రయత్నించాడు. కాని, గాంధీజీ వైఖరిలో మౌలికమైన మార్పు రాలేదు. దాని ఫలితంగా *'గాంధీ- జోషి లేఖలు'* ప్రచురించబడింది. అది దేశమంతటా జోరుగా అమ్మబడింది. అది ప్రధాన భారతీయ భాషలన్నింటిలోకీ అనువదించబడింది. నిజానికి, గాంధీజీతో జోషి సుదీర్ఘ ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రజాయుద్ధం పట్ల జోషి అభిప్రాయమేమిటో తెలియజేసింది. దాని గురించి ఆయన యిలా రాశాడు: "ప్రజా యుద్ధంలో ప్రజలకి అర్థం, ఏ మాత్రం మినహాయింపు లేకుండా ప్రపంచ మంతటి ప్రజలని అర్థం".ఆయన ప్రపంచాన్ని రెండు శిబిరాలుగా విభజించాడు. ఒకటి స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, రెండవది ఫాసిస్టు, సామ్రాజ్యవాద బానిసత్వం. ఆయన యిలా వాదించాడు:

> ప్రతి ఒక్క ప్రజాసమూహమూ తాము ఏ శిబిరంతో కలుస్తారో, ఎవరి విజయాన్ని తాము కోరుకుంటారో ఎన్నుకోవాలి. ప్రతి దేశ ప్రజల, మొత్తం ప్రపంచ ప్రజల భవితవ్యం ఏ శిబిరం గెలుస్తుందో దానిమీద ఆధారపడుతుంది.
>
> గెలిస్తే, అది ప్రపంచపు ప్రతి ఒక్క దేశపు ఫాసిస్టు, సామ్రాజ్యవాద బానిసత్వం అందరి స్వాతంత్ర్యపు అంతం అవుతుంది.
>
> మిత్రరాజ్య పక్షం జయిస్తే, స్వాతంత్ర్య లక్ష్యం పరిరక్షించ

13. పైదే, పుట 32.

బడిందన్నమాట. ప్రతి ఒక్క జాతి తన విముక్తి కోసం, ప్రపంచ విముక్తి కోసం ఈ శిబిరం పోరాడుతుంది. ప్రాచ్యభాగంలోని బానిస దేశాలు చాలా క్లిష్టమైన పరిస్థితిలో ఉన్నాయి. తామే బానిస శృంఖలాల్లో మగ్గిపోతున్నప్పుడు, తమ హృదయాల్లో దేశభక్తి జ్వలిస్తున్నా ఎలా పోరాడ గలరు? ఒక నూతన పరిస్థితిలో, నూతన వ్యూహంతో తమ స్వీయ జాతీయ విముక్తి పోరాటాన్ని సాగించాలన్నది సామాన్య సమస్య. మొదట మనం ప్రత్యామ్నాయాలను కొట్టివేద్దాం. వలసవాద ప్రజల దేశభక్తి పూరిత నాయకులు ఈ యుద్ధాన్ని వ్యతిరేకిస్తే, వాళ్ళు నేరుగా తమ సొంత దేశపు ఫాసిస్టు బానిసత్వానికి తోడ్పడుతారు. ఫాసిస్టు సామ్రాజ్యవాదులు మిగిలిన ప్రపంచాన్ని ఆక్రమించుకోవడానికి, తమ వనరులు సమకూర్చే బలంతో తమస్వదేశ వినాశానికి చిహ్నం.

యుద్ధంలో వున్న రెండు శిబిరాలను మనమెంత ఎక్కువ స్పష్టంగా విడమరచి అర్థం చేసుకుంటే, నేటి ప్రత్యేక పరిస్థితుల్లో మన జాతీయ విధానాన్ని మరింత సరిగా రూపొందించడం కోసం ఫాసిస్టు దురాక్రమణదారు పై జాతీయ ప్రతిఘటన, ఫాసిజంపై పోరాడుతున్న యితర ప్రగతిశీల శక్తుల్తో కలిసి పోరాడటం మనమీది సామ్రాజ్య వాదం నేటి పెత్తనాన్నుంచి జాతీయ విముక్తి సాధనకేకైక మార్గం.[14]

అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ తరపున తరపున జోషి చేసిన వాదన సారాంశం యిదీ.

పి.పి. జోషికి గాంధీజీ పట్ల ఎల్లప్పుడూ గొప్ప ప్రశంసా భావం వుంది. కాని, కమ్యూనిస్టులను గురించి యితర పార్టీలు లేక గాంధీజీ సహచరులు యిచ్చిన తప్పుడు సమాచారంతో ఆయన ఎంతగానో ఆందోళన చెందాడు. కమ్యూనిస్టులపైన వారి రాజకీయ వ్యూహం గురించీ, వారి రోజూవారీ జీవిత విధానం గురించీ గాంధీజీ ఆరోపణలను జోషి తను నిరంతరాయంగా రాసిన లేఖల ద్వారా ఒక్కొక్క అంశానికి వివరంగా జవాబులు రాస్తూ,

---

14. *కరస్పాండెన్స్ బిట్విన్ మహాత్మా గాంధి అండ్ పి.సి. జోషి*, బాంబే, పి.పి. హెచ్. 1945. పుట. 5,6.

ఆయనతో వాదించడం కొనసాగించాడు. అయినా, ఆయన లేఖల ధోరణి దృఢమైనది మరియు గౌరవనీయమైనది, "మీరు జాతిపిత కాబట్టి మీకు రాస్తున్నాను. మీరు మమ్మల్ని నిందించినప్పుడు, అవమానించినప్పుడు సైతం మీమీద కోసం తెచ్చుకోవడం నా విషయంలో దేశభక్తి రహితం అవుతుంది.[15] గాంధీజీని మొట్టమొదట జాతిపిత అని పిలిచింది పి.సి.జోషి.

జోషికి తిరిగి జవాబులు రాసినప్పుడు గాంధీ కూడా అదే ప్రేమను, ఆపేక్షను వ్యక్తపరిచాడు.

> నాకు నీ యొక్క అర్హత తెలుసు. నీ సహచరులైన యువతీ, యువకులు, నిస్వార్థపరులు, బాగా సమర్థులు అని నేను చెప్తున్నాను. మీరందరూ కష్టించి పనిచేసేవారు, బాగా శక్తికలవారు. మీరు మీ సహచరులపైన గట్టి క్రమశిక్షణను విధిస్తారు. దీన్నంతనీ నేను గొప్పగా భావిస్తాను, అభినందిస్తాను. నేను నా పూర్వాలోచిత భావాలతో అలాంటి శక్తిని తేలిగ్గా వదులుకోను.[16]

గాంధీ లేఖ యిలా ముగుస్తుంది.

> చివరి విషయం, నేను నా కోసం, మొత్తం దేశం కోసం రూపొందించు కున్నటువంటి పోరాట విధానాల ప్రకారంగా మీరు కూడా దేశ స్వాతంత్ర్యం కోసం మీలో ప్రతి ఒక్కరి సేవలను నేను ధ్రువీకరించాలని కోరుకుంటున్నట్లు నన్ను విశ్వసించాలని మిమల్ని కోరుతున్నాను. నేను పెడమార్గాన వెళ్తున్నానని, మీ పద్ధతే సరైనదని నాకు నమ్మకం కలిగి, మీరు మీ మార్గానికి, నన్ను మీ పక్షానికి ఆకర్షిస్తే సంతోషంగా నిజాయితీలతో నేను మీ శ్రేణుల్లోకి చేరేందుకు శిక్షణ పొందుతాను.[17]

గాంధీ స్వయంగా అండర్ గ్రౌండ్‌లోవున్న కమ్యూనిస్టు నాయకుడు ఆర్.డి.భరద్వాజ్‌ని తన కారులో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ వేదిక దగ్గర జరిగే రాంగఢ్ కాంగ్రెస్ సమావేశం దగ్గరకి, బ్రిటిష్ పోలీసులు అతన్ని అరెస్టు

15. పైదే, పుట 23.
16. పైదే, పుట 19.
17. పైదే, పుట 20,21- లెటర్ ఫ్రం సేవాగ్రాం, సి.సి జులై 30, 1944.

చెయ్యకుండా నివారించేందుకు తీసుకువెళ్లాడన్న విషయం యీ తరానికి చెందినవారిలో చాలా మందికి తెలియక పోవచ్చు. తమమధ్య రాజకీయ, సైద్ధాంతిక విభేదాలు ఉన్నప్పటికీ, జాతీయవాద, కమ్యూనిస్టు నాయకత్వాల మధ్య ఒకరిపట్ల మరొకరికి సహనభావం, పరస్పర గౌరవ వ్యక్తీకరణ ఉండేది. కాని, సి.పి.ఐ. ప్రజాయుద్ధ వ్యూహాన్ని ఆమోదించడం కాంగ్రెస్‌లోని కింది స్థాయిల్లో అధిక విముఖత, ఉద్రిక్తతలు పెరిగాయి. యిక్కడొక విషయం చెప్పాలి. సి.పి.ఐ అప్పుడే చట్టబద్ధం చెయ్యబడింది.

1942 ఆగస్టు 8వ తేదీన బొంబాయి అఖిల భారత కాంగ్రెస్ కమిటీలో చెయ్యబడిన ప్రధానమైన క్విట్ ఇండియా తీర్మానాన్ని డా.కె.ఎం.అష్రఫ్ నాయకత్వాన గల 13 మంది ఎ.ఐ.సి.సి సభ్యులు వ్యతిరేకించలేదు. కాని, దానిలోని ఆచరణాత్మక భాగానికి ఒక సవరణని ప్రతిపాదించారు. అయితే అది ఓడించబడింది.[18] కానైతే, పి.సి.జోషి పార్టీ రాజకీయ వైఖరిని తప్పుగా పరిగణించలేదు. ఒక స్వతంత్ర పార్టీగా సి.పి.ఐ. రాజకీయ ప్రసిద్ధి మొట్ట మొదటి సారిగా సుస్థాపితమైంది. దాని ఆచరణాత్మక ఫలితాలు భారీ అయినవి.[19]

నిజానికి, నాజీ జర్మనీ సోవియట్ యూనియన్‌పైన దాడి చెయ్యడంతో సామ్రాజ్యవాద యుద్ధం నుంచి ప్రజాయుద్ధంగా యుద్ధ స్వభావం మారడం, క్విట్ ఇండియా భారత జాతీయ ఉద్యమం నుండి కమ్యూనిస్టులు దూరం కావడంతో ప్రజల దృష్టిలో కమ్యూనిస్టులు "ద్రోహులు", "బ్రిటిష్ ఏజెంట్లు" అయ్యారు. ప్రపంచ పరిస్థితి, అప్పటి క్లిష్ట పరిస్థితులవల్ల కమ్యూనిస్టులు యుద్ధాన్ని తిరిగి విలువ కట్టవలసి వచ్చింది. స్వతంత్ర వ్యూహాన్ని తిరిగి రూపొందించుకోవలసి వచ్చింది. జనానికి యీ సంక్లిష్ట ప్రపంచ పరిస్థితుల్ని చెప్పడం కమ్యూనిస్టులకు కష్టతరమైంది. బొంబాయిలోని భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యాలయంపైన జనం దాడి చేశారు. గాఢమైన ఆ పోరులో

---

18. దిలీప్ బోస్, 'పి.సి.జోషి: మౌల్డర్ ఆఫ్ ఏ జనరేషన్', *మెయిన్ స్ట్రీమ్*, నవంబరు 22, 1980. పుట 23.
19. పి.సి.జోషి ఎప్రిల్ 6, 1951న పార్టీ కేంద్ర కార్యాలయంలోని ఇంటర్వ్యూ. ఫైల్. నెం.సి.పి.ఐ 1951/47, *ఆర్కైవ్స్* ....., జె.ఎన్.యు.

చాలామంది కార్మికుల్లు గాయపడ్డారు. పాట్నా, ముంగేర్, లఖిసరాయ్, బెగుసరాయ్‌లలో జరిగిన జోషి మీటింగులు అంతగా విజయవంతం కాలేదు. చాలాచోట్ల మీటింగులపైన దాడులు జరిగాయి. పార్టీ మీటింగులపై రాళ్లు విసరడం మామూలు విషయమైంది. జోషి జీవితం ప్రమాదంలో పడింది.

కాంగ్రెస్, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, ఫార్వర్డ్‌బ్లాక్‌లు 'క్విట్ ఇండియా ఉద్దయమం'లో చేరకపోయినందుకు కమ్యూనిస్టుల్ని బ్రిటిష్ ఏజెంట్లుగా పరిగణించినప్పటికీ అసలు పరస్థితి వాస్తవం భిన్నమైనది. ఈ దశలో బ్రిటిష్ ప్రభుత్వంచేత కమ్యూనిస్టులు కూడా తీవ్రంగా హింసించబడటం వ్యంగ్య విషయం. జోషి 1943 మార్చి 7న *పీపుల్స్ వార్* పత్రికలో యిలా రాశాడు:

> ప్రభుత్వం కాంగ్రెస్ ఐదవ విభాగంగా మామీద దాడి చేసింది. మా ఆందోళనకారులను అరెస్టు చేసింది. న్యాయవిచారణ లేకుండా మా ఆర్గనైజర్లను నిర్బంధించారు. మా ఆఫీసులమీద దాడి చేసి, మీటింగులు పెట్టడానికి అనుమతిని నిరాకరించారు. మా పార్టీ చట్టబద్ధమైనది అయినప్పటికీ జాతీయ ఉద్యమంతోబాటు పౌరస్వేచ్ఛలు కోల్పోయి మేము బాధపడ్డాము.

పి.సి.జోషి 'పనిచెయ్యి లేక మరణించు'(Do or Die)అనే గాంధీ వ్యూహంతో పూర్తిగా విభేదించాడు. కాని, కాంగ్రెస్ నాయకుల విడుదల కోసం ప్రచారం చేశాడు. ఈ విషయంలో ఆయన చాలా తీవ్రంగా పని చేశాడు. 1942 సెప్టెంబరు 20న జరిగిన కేంద్ర కమిటీ సమావేశంలో ఒక తీర్మానం ఆమోదించబడింది. "కాంగ్రెస్‌కీ, ప్రజలకీ వ్యతిరేకంగా సామ్రాజ్యవాద అణచివేతను అది ఖండించింది. సామ్రాజ్యవాద అధికారవర్గం జనంమీద దారుణంగా వ్యవహరిస్తున్నప్పుడు అది ప్రజలందరిలో అన్ని విభాగాలకీ దూరమైపోయి, తూగుతోంది." జాతీయ ఐక్యత కోసం జాతీయ నాయకుల విడుదల కోసం, ఝాతీయ ప్రభుత్వం కోసం అధికారవర్గపు హస్తాలను బలహీన పరచేందుకు దేశవ్యాప్త ఉద్యమం సాగించాలని నిర్ణయించబడింది. ఆ తీర్మానం యింకా యిలా పేర్కొంది:

> కమ్యూనిస్టు పార్టీ బ్రిటిష్ ప్రభుత్వాన్ని యిలా హెచ్చరించింది. అది యీ విధానాన్నే బలవంతంగా కొనసాగిస్తే, కాంగ్రెస్‌ని అణచివెయ్యాలని

మొండిపట్టు పడితే, బ్రిటిష్‌వారికీ, భారతీయ ప్రజలకు ఉమ్మడి విపత్తును సృష్టించడంలో విజయవంతం అవుతుందని హెచ్చరించింది. రోజు రోజూ క్లిష్టతరం అవుతున్న ఈ ఆపత్కర పరిస్థితి నుంచి బయటపడేందుకు ఏకైక మార్గం ప్రజలకూ, కాంగ్రెస్‌కూ వ్యతిరేకంగా సాగిస్తున్న ప్రమాదకర అణచివేతను ఆపివెయ్యడం, మహాత్మాగాంధీనీ, కాంగ్రెస్ నాయకుల్నీ విడుదల చెయ్యడం, కాంగ్రెస్‌పై ఉన్న నిషేధాన్ని తొలగించడం, కాంగ్రెస్‌తోనూ, ఇతర పార్టీలతోనూ, ప్రత్యేకించి ముస్లింలీగ్‌తోనూ తాత్కాలిక జాతీయ ప్రభుత్వ స్థాపన విషయంలోనూ, దేశ స్వాతంత్ర్యాన్ని రక్షించి దేశ స్వాతత్ర్యాన్ని కాపాడటం కోసం ప్రజల్ని ఐక్యంచేసి, సమీకరించడంలోనూ కృషి చెయ్యడమే... కమ్యూనిస్టు పార్టీ, యీ జాతీయ సంక్షోభాన్ని పరిష్కరించి జాతీయ సమైక్యతను కల్పించేందుకు నిర్ణయించుకొని, బ్రిటిష్, అమెరిక కార్మికులకు ప్రగతిశీల ప్రజలకు భారత ప్రజల న్యాయబద్ధమైన జాతీయ కోర్కెలను ఆమోదించి, తద్వారా యీ విముక్తి ఉద్యమంలో ఉమ్మడి విజయానికి మార్గాన్ని సుగమం చెయ్యమని విజ్ఞప్తి చేసింది".[20]

అదేవిధంగా, 1943, ఫిబ్రవరి 15వ తేదీన జాతీయ సంక్షోభాన్ని అంతం చేసేందుగ్గాను గాంధీజీ విముక్తి కోసం పార్టీ మరో తీర్మానాన్ని ఆమోదించింది.

జైలు కటకటాల వెనకవున్న జాతీయ నాయకులు యీ విపత్తును గమనించే నిస్సహాయ సాక్షులుగా ఉండలేరు. గాంధీజీ ఉపవాసం యావత్తు జాతిని మరీ ఆలస్యం కాకుండా జాగృతులు కమ్మనీ, దారుణమైన వినాశం నుంచి తనని తాను రక్షించుకునేందుకు ఐక్యం కమ్మని నిరాశాపూర్వక విజ్ఞప్తి.

ఆగస్టు 9న జాతి నాయకులను జైలులోనెట్టి గేట్లను మూసినవాళ్లు వాటిని తెరిచేందుకు యిప్పుడు నిరాకరించారు. జాతి అత్యున్నత

---

20. *పీపుల్స్ వార్*, సెప్టెంబరు 20, 1942

నాయకుని జీవితం ఆపదలో వుంది. ఒప్పందానికి ఆయన ఇచ్చిన పిలుపు, ఏకైక విముక్తి మార్గం, నిరాకరణతో త్రోసివేయబడింది.

అది మన యావత్తు జాతికీ "ఇప్పుడు లేక ఎన్నడూ కానిది" (Now or Never) మనం గాంధీజీని బయటకు తేనైనా తెస్తాం, సంక్షోభాన్ని పరిష్కరిస్తాం. లేక మనం దానిలో తిరుగులేకుండా మరింత లోతుగా కూరుకుంటాం. మనల్ని బానిసలను చేసే ఒకని చేతుల నుంచి మరొకని చేతుల్లోకి నెట్టబడతాం.

గాంధీజీ నిరాహార దీక్ష కాలంలో, సి.పి.ఐ. జనరల్ సెక్రటరీగా జోషి కార్మిక వర్గానికి, రైతు విద్యార్థి సంఘాలకు గాంధీజీ విడుదల కోసం జరిగే ఊరేగింపుల్లో మనమూ చేరాలి అని పిలుపు నిచ్చాడు. 'మేడే' సంఘీభావం సందర్భంగా పార్టీ విడుదల చేసిన ప్రకటన పత్రం యిలా పేర్కొంది:

> ప్రధాన సంఘాలను ఐక్యం చెయ్యడంలో మన వైఫల్యంతప్ప అధికారాన్ని, జాతీయ ప్రభుత్వాన్ని మనకి దూరం చెయ్యడానికి కారణం మరేమీ కాదు. ఈనాడు యీ వైఫల్యం జాతి నాయకుల్ని జైళ్లలో ఉంచుతోంది. హిందువుల్నీ, ముస్లింలనీ ఒకే విధంగా లక్షల మందిని పస్తులపాలు చేస్తోంది.గాంధీజీ నిరాహార దీక్షలోఉన్నప్పుడు ఆయన జీవితం మనకొక భారీ ఖరీదుగా మారింది.[21]

మౌలిక సత్యాన్ని అర్థం చేసుకునేందుకు జోషికి అరుదైన రాజకీయ నిశిత చాతుర్యం వుంది. కమ్యూనిస్టుపార్టీకి ఒంటరిగా వ్యవహరించడం సాధ్యం కాదన్న విషయం ఆయనకూ తెలుసు. అందుకే ఆయన మళ్ళీమళ్ళీ జాతీయ రక్షణ కోసం, జాతీయ ప్రభుత్వం అవసరమన్న డిమాండును వ్యాప్తిలోకి తెచ్చాడు. 1943 నాటి కరువు, దాని వెంటనే వచ్చిన ఆహార సంక్షోభం తర్వాత, ఆయన జాతీయ విముక్తి కోసం, ప్రజల ఆహారం కోసం జాతీయ ప్రభుత్వం అవసరమన్న డిమాండును ఆయన ముందుకు తీసుకు వచ్చాడు.

---

21. పీపుల్స్ వార్, ఎప్రిల్ 25, 1945

నిజానికి అదే ఉత్సుకతతో, జోషి పార్టీ మొత్తాన్ని గాంధీజీ విడుదల కోసం, అలాగే యితర కాంగ్రెస్ నాయకుల విడుదల కోసం పనిచేసేందుకు సమాయత్తం చేశాడు. ఆయన గాంధీజీకి యిలా రాశాడు.

> మీరు కాంగ్రెస్ ముస్లింలీగ్ ఐక్యత కోసం, తద్వారా మన ప్రధాన రాజకీయ సంఘాల ఐక్యత కోసం, తద్వారా అధికారపు బదిలీ, ప్రజల హస్తాల్లోకి దాన్ని బదలాయించడం కోసం చేసే పనిలో నాయకత్వం వహిస్తారని మేము ఎదురుచూశాం. నిజానికి, మీరు బయటలేనప్పుడు మా అత్యంత నిరంతర నినాదం, మీ విడుదల మాత్రమే. అలాగే జాతీయ ప్రభుత్వపు ఏర్పాటు వల్ల దేశరక్షణ మరియు ప్రజలకు ఆహారం ఖచ్చితంగా లభిస్తాయి.[22]

కాంగ్రెస్ కార్యవర్గం ఎ.ఐ.సి.సి. కమ్యూనిస్టు సభ్యులపైన ఒక సాధారణ ఆరోపణ పత్రాన్ని అందజేసింది. జోషి దానికి *వర్కింగ్ కమిటీకి కమ్యూనిస్టు సమాధానం* పేరుతో సమాధానాన్ని రాశారు. సుదీర్ఘమైన ఆ సమాధానం రెండు భాగాలుగా వెలువడింది. ఈ సమాధానం కాంగ్రెస్ దాడికి, రాష్ట్ర అసెంబ్లీ కోసం 1946లో జరిగిన ఎన్నికల ప్రచారంలో దేశమంతటా జరిగిన ఆరోపణలకీ వ్యతిరేకంగా నిలబడేందుకు కమ్యూనిస్టులకు రాజకీయంగా తోడ్పడింది. ఆ అసెంబ్లీలు తిరిగి కాన్స్టిట్యుయెంట్ అసెంబ్లీని ఎన్నుకోవలసి ఉండేది. ఆ కీలక సమయంలో యీ జవాబు పార్టీని బలపరచిందని జోషి విశ్వసించాడు. ఆయన చాలా రోజుల తర్వాత తిరిగి ఇలా రాశాడు. "మనతో భిన్నాభిప్రాయం కలిగిన కాంగ్రెస్‌వాళ్ళు సైతం మన విశ్వసనీయతను ఆమోదించనారంభించారు, మనకు సూత్ర ప్రాయమైన విధానం వుందనీ, వాదించేందుకు ఉచితమైన కేసు వుందనీ ఒప్పుకోవడం మొదలు పెట్టారు."[23] పి.సి.జోషికి జాతీయంగా అనామోద రాజకీయ విధానాన్ని సైతం జాతీయ

---

22. పి.సి.జోషి, '*కమ్యూనిస్టు రిప్లై టూ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీస్ చార్జెస్*', పార్ట్ 1, బాంబే, పి.పి.హెచ్, డిసెంబరు 1945, పుట. 210.
23. పి.సి.జోషి, 'సుశోభన్ సర్కార్, ఎ డెడికెటెడ్ టీచర్: సమ్ మెమొరిస్', *న్యూ థింకింగ్ కమ్యూనిస్టు*, జులై 15,2001.

నుడికారంలో విశదీకరించే నేర్పు వుంది.[24] సన్నిహితులయ్యేందుకు పూర్తిగా నిరాకరించినవారితో సైతం సన్నిహితమయ్యేందుకు అది ఎంతో తోడ్పడింది. వ్యతిరేకులు జోషీ చిత్తశుద్ధిని, మేధాశక్తిని ప్రశ్నించలేకపోయారు.

జాతీయ, అంతర్జాతీయ సంఘటనలకు పట్ల పి.సి. జోషి ప్రతిస్పందన యధేచ్ఛమైనది, తక్షణమైనది, దూరదృష్టి కలది. రెండవ ప్రపంచ యుద్ధం బెర్లిన్ పతనంతో 1945, మే 9వ తేదీన అంతమైంది. ఫాసిజం మీది విజయం భారతదేశ విజయం కాదని పరిగణించినవారిని జోషి విమర్శించాడు. యుద్ధం అంతమయ్యాక ఆయన పాఠకుల మనస్సులను స్పందింపజేసే "యూరప్‌లో విజయం, భారతదేశానికి దాని అర్థం" అనే శీర్షికతో పి.సి. జోషి ఒక వ్యాసం రాశాడు. అందులో ఆయన యిలా తర్కించాడు:

> మరే యితర మిత్రరాజ్యపు సైన్యంకంటె, రెడార్మీ చాలా మంది జర్మన్లతో పోరాడటమే కాక, అత్యంత నిర్ణయాత్మక యుద్ధాలు చేసింది. సోవియట్ యూనియన్‌పైన హిట్లర్ దాడి చేసినప్పుడు, యావత్తు యూరప్పు అతని పాదాల మీద వాలింది. సోవియట్ యూనియన్‌లో దాడి సాగించడం, జపానీయులతో కలిసి ఆసియాపై యుద్ధం జరపడం, ఆ రెండు ఖండాలపైనా అధిపతి అయి, అమెరికాలను అణచివెయ్యడం హిట్లర్ పథకం. రెడార్మీ ప్రతిఘటన అతని ప్రపంచ పథకాలను ఛిద్రం చేసింది, ప్రపంచాన్ని కాపాడింది..... బ్రిటిష్ ప్రతిస్పందన జనరల్ ఎన్నికల్లో తన ప్రజలనే ఎదుర్కొంటుంది. యుద్ధపూర్వ బ్రిటన్‌కి తిరిగి రావడం ఎంత మాత్రం అనివార్యం కాదు.
>
> ఆవిధంగా బ్రిటిష్ ప్రజలు తమ తిండికోసం పోరాడితే, వాళ్లు మన స్వాతంత్ర్యాన్ని కూడా ఆమోదించాలి.
>
> మనం కూడా స్వాతంత్ర్యంకోసం నిలబడుతున్నామని చెప్పడం సరిపోదు. స్వాతంత్ర్యాన్ని ప్రేమించే మానవలోకంతోబాటు కలిసి మనం కూడా ముందుకు సాగాలి.
>
> మనం కూడా స్వాతంత్ర్యాన్ని కోరుతున్నామని చెప్పడం సరిపోదు,

---

24 మొహిత్ సేన్ రచన, పుట 26.

మనం మన సోదర దేశభక్తులతో మన స్వదేశంలో ఐక్యం కావాలి..

తన సొంత తాత్కాలిక జాతీయ ప్రభుత్వం కింద ఒక సమైక్య జాతీయ ఉద్యమం మన స్వదేశంలోని కుళ్లుని ఆపేస్తుంది. సహాయ రాహిత్య, నైరాశ్యాల శకం ముగుస్తుంది. నిర్మాణాత్మక ప్రయత్నాల శకం ప్రారంభమవుతుంది. దొంగ నిల్వదారులు, లాభతృష్ణకలవాళ్లు, లంచ గొండి అధికారుల రోజులు ముగుస్తాయి. ప్రజల తక్షణ అవసరాలను స్పృశించి, యుద్ధానంతర సంపన్న భవిష్యత్తు కోసం మనం ప్రణాళికను వెయ్యడం ప్రారంభిస్తాం.[25]

సామ్రాజ్యవాదులు ఈ యుద్ధంలో గెలవడం ద్వారా మరింత బలపడ్డారని ప్రజల జాతీయ అవగాహనను జోషీ ఖండించాడు.

యుద్ధం తర్వాత అధికార బదిలీ జరుగుతున్నదన్న ఊహలు గాలిలో కలిసి పోయాయి. కాని, అట్లీ-వేవెల్ ప్రకటన దారుణమైన ఆఘాతంగా వచ్చింది. జోషి 1945 సెప్టెంబరు 20 న యిలా ప్రకటన చేశాడు.

ఈ ప్రకటన భారత ప్రజలకు అవమానం, కాంగ్రెస్, లీగ్‌లు రెండింటికీ ఒక దెబ్బ, అది మన అనైక్యత యొక్క చేదుఫలం. ఇది కాంగ్రెస్, లీగ్‌లకు వాటి వేరువేరు గమ్యాలకు ఉమ్మడి సవాలు... కాంగ్రెస్, లీగ్‌లు యీ సవాలును ఎదుర్కోగలవు. ఉమ్మడి బ్రిటిష్ ప్రభుత్వాన్ని రాజ్యాంగ పరిషత్తులను ప్రస్తుత బ్రిటిష్ ఇండియాలో ప్రజల ఓట్ల ద్వారా ఆమోదిత ఎల్లలేర్పరచిన మండలాల్లో ఎన్నుకోబడటంద్వారా, ప్రస్తుత భారతీయ రాష్ట్రాల్లో కూడా, తద్వారా స్వతంత్ర, ప్రజాస్వామ్య భారత దేశం ఒక యూనియన్‌గా లేక స్వతంత్ర రాష్ట్రాల సమాశ్రయంగా ఏర్పడటంద్వారా నిరోధించగలవు.[26]

కాని, యీ ప్రకటనకి ముందు, జోషి కాంగ్రెస్, ముస్లింలీగ్‌ల జాతీయ నాయకులకు తమ మధ్యవున్న విభేదాలను తొలగించమని, తద్వారా జాతీయ

---

25. *పీపుల్స్‌వార్,* మే 20, 1945.
26. *పీపుల్స్‌వార్,* సెప్టెంబర్ 23, 1945.

ప్రభుత్వాన్ని సాధించవచ్చని విజ్ఞప్తి చేశాడు. దాని గురించి యిలా రాశాడు.

భారతదేశపు జాతీయ చరిత్రలో గాంధీ-జిన్నా సమావేశం ఓ గొప్ప సంఘటన. యుద్ధం ప్రారంభమైనప్పటి నుంచి, కాంగ్రెస్, లీగ్ తమ డిమాండ్లను బ్రిటిష్ ప్రభుత్వానికి చెప్తూ వచ్చాయి. కాని, బ్రిటిష్ ప్రభుత్వం వాటిని వెనక్కి పంపుతూ వచ్చింది. ఈ రెండు సంఘాల ఉన్నత నాయకులు, తాము ఐక్యం కాగలమేమోనని కలుస్తూ వచ్చారు. ఐక్య సంఘటనను ఏర్పరచగలిగితే బ్రిటిష్ ప్రభుత్వ అహంకారాన్ని తుదముట్టించ గలమని భావించారు. వాళ్లు సామ్రాజ్యవాద పాలకుల వైపు తమ దృష్టిని వెనక్కి తిప్పారు. వాళ్లు స్వంత సోదరుల్లాగా ఒకరి చేయిచేయి కలుపుతున్నారు. అది ఎంతో చారిత్రక ప్రాముఖ్యం కలిగిన మలుపు.

గత రెండేళ్లుగా, ముస్లింలీగ్‌వాళ్ళు తమ స్థానాన్ని కాంగ్రెస్ అర్థం చేసుకోవాలని అనుకోవడం లేదని భావించారు. అదే సమయంలో లీగ్ వాళ్లు తమతో ఐక్యతను కోరుకోవడం లేదనుకున్నారు. కాంగ్రెస్, లీగ్‌ల అంగీకారం ద్వారా తప్ప దేశానికి మార్గంలేదని మనం మాత్రమే చెప్పాం. మనం ఏ మాత్రం అలసటచెందకుండా కాంగ్రెస్, లీగ్‌ల ఐక్యత కోసం ప్రచారం చేశాం. ఒక దేశభక్తి పూరిత అభిప్రాయాన్ని రూపొందించుకునేందుకు మనం చేయగలిగింది కాస్తా చేశాం.[27]

గాంధీ, జిన్నా సమావేశ వైఫల్యం పట్ల జోషి చాలా నిరాశపడ్డాడు. ఆయన వాళ్లకి తిరిగి కలుసుకోమని పిలుపిచ్చాడు. *"వాళ్లిద్దరూ కలుసుకోవాలి"* అన్న జోషి కరపత్రం, అటు తర్వాత రాసిన *"వాళ్లిద్దరూ తిరిగి మళ్ళీ కలుసుకోవాలి"* అన్న మరో కరపత్రం కామ్రేడ్లచేత వీధుల్లో అమ్మబడ్డాయి. ఆ దశలో జోషి కలం నుంచి లెక్కలేనన్ని వ్యాసాలు వెలువడ్డాయి. 1945 అక్టోబరు 7వ తేదీన కాంగ్రెస్, ముస్లింలీగ్, కమ్యూనిస్టు జాతీయ సమైక్య సంఘటన కోసం పిలుపు నిచ్చాడు. 1946, అక్టోబరు 27 న *పీపుల్స్ ఏజ్‌*లో నెహ్రూ-

27. *పీపుల్స్‌వార్,* అగస్టు 20 1944.

జిన్నా సంభాషణల వైఫల్యం గురించి పేర్కొని, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు కాంగ్రెస్ ముస్లింలీగ్ నాయకత్వాల సంభాషణలను ఎలా విఫలం చేశారో జోషి పేర్కొన్నాడు. రాజీ విధానాల అనివార్య ఫలితం అది.

జాతుల సమస్య, విడిపోయే హక్కుతోబాటు సోవియట్ అనుభవం ఆధారంగా జాతీయ స్వయం నిర్ణయాధికారపు డిమాండు కమ్యూనిస్టు పార్టీ మానసిక ప్రతిబింబాన్ని మలినపరిచింది. ఇది పాకిస్తాన్, సిఖ్ఖు స్వదేశాలకు పరోక్ష ఆమోదం. జాతీయ స్వయం నిర్ణయ డిమాండును ముందుకు తేవడం అదో పెద్ద పొరపాటు. ఇది తిరిగి కమ్యూనిస్టుల్ని జాతీయ ప్రధాన స్రవంతి నుంచి వేరుపరిచింది. 1946 లో రాబోయే ఎన్నికల్లో వాళ్లు అందుకు ఫలితం చెల్లించాల్సి వచ్చింది. కమ్యూనిస్టులందర్నీ కాంగ్రెస్ సభ్యత్వాన్ని రాజీనామా చెయ్యమని చెప్పారు. ఉమ్మడి స్వాతంత్ర్యం కోసం, స్వయం నిర్ణయాధికారం కోసం కాంగ్రెస్, లీగ్, కమ్యూనిస్టు జాతీయ సమైక్య సంఘటన కోసం జోషి విజ్ఞప్తి చేశాడు. పి.సి.జోషి *పీపుల్స్ ఏజ్*లో వ్రాశాడు. దాని పేరు *"బ్రిటిష్ పథకాన్ని నిరాకరించండి ఎ.ఐ.సి.సి.కి కమ్యూనిస్టు విజ్ఞప్తి".*

> భూస్వామ్య విధానాన్ని రద్దుపరచడం, అక్రమ లాభార్జనని అంతం చెయ్యడంకోసం కాంగ్రెస్ ప్రభుత్వం సత్వర చర్యలతోబాటు స్వయం నిర్ణయాధికారాన్ని ఆమోదించడంలో ఏకం కాగలిగినట్టయితే, సామాన్య ముసల్మాన్‌ని ప్రేరేపించడమే కాక, కాంగ్రెస్‌లోని హిందూ పెట్టుబడిదారీ విధానం గురించి వారిలో అనుమానాలను తొలగించడమే కాక, లీగ్‌లోని భూస్వామ్య నాయకత్వానికి ఐక్యత నుండి వైదొలగడాన్ని కష్టసాధ్యం చేస్తుంది.[28]

కాంగ్రెస్ నాయకత్వం సామ్రాజ్యవాద బోనులోకి చేరుతోందని జోషి భావించాడు. ఆయన యింకా యిలా అన్నాడు.

> మన జాతీయోద్యమానికి ఎదురవుతున్న అత్యంత ముఖ్యమైన సమస్య, మన దేశంలో మనల్ని దోపిడీ చెయ్యగలిగేందుకు బ్రిటిష్ వాళ్ళు మన దేశంలో మరింత కాలం ఉండేందుకు ప్రయత్నించడం.అది

28. *పీపుల్స్ ఏజ్*, జులై 7, 1946.

'సమైక్యానికీ' 'విడిపోవడానికీ' మధ్య వివాదం. కాంగ్రెస్ యీ సమస్యని ప్రజాస్వామ్య పద్ధతిలో పరిష్కరిస్తుందా, లేక, బ్రిటిష్‌వాళ్ళు విధ్వంసక ప్రయోజనాల కోసం దోపిడి చేస్తారా.

ఆయన అదే వ్యాసంలో అప్పటి పరిస్థితిలో వామపక్ష పాత్ర గురించి యిలా కొనసాగించాడు.

> కాంగ్రెస్‌తో బ్రిటిష్ పథకానికి వ్యతిరేకంగా పోరాడే ప్రధాన బాధ్యత, ప్రజా పోరాటాలను ప్రోత్సాహపరిచే విధానం వామపక్ష శక్తులమీద వుంది. వామపక్ష శక్తులు ఎలాంటి రాజీ కోసం నిలవరు. బ్రిటిష్‌వాళ్ల రాక్షస పథకాన్ని వాళ్ళు నిశితంగా చూశారు. వాళ్ళు మన ప్రజల ప్రభావం ఎలా పైకి లేస్తోందో గమనిస్తారు. వాళ్ళు తగినంత స్పష్టంగా మానసికతను, జాతీయ గౌరవాన్ని గురించి మాట్లాడి, దాన్ని కాపాడే ధైర్యాన్ని సంతరించుకుంటారా? అది న్యాయబద్ధమైన, ప్రజాస్వామ్య సూత్రాలపైన ఆధారపడుతుంది. మన తదుపరి జాతీయోద్యమ దశకు అది ఆచరాణాత్మక వేదిక అవుతుంది.
>
> ఆ పథకాన్ని ధైర్యంగా నిరాకరించాలని సూచించడం, పెరుగుతున్న పోరాటాలకి నాయకత్వాన్ని చేపట్టడం, స్వయంనిర్ణయాధికారాన్ని నిస్సందేహంగా ఆమోదించడం, వామపక్ష శక్తులు రాజకీయ రాజీకి, విచ్ఛిన్నానికి వ్యతిరేకంగా పోరాడి, దేశ గౌరవాన్ని కాపాడ గలవు.[29]

బిటిష్ పథకాన్ని ఎ.ఐ.సి.సి (అఖిల భారత కాంగ్రెస్ కమిటి) ఆమోదం తెలిపిందని గమనించిన జోషి నిరాశ చెందాడు. అది పూర్తిగా రాజీదారుల విజయమని ఆయన భావించాడు. బ్రిటిష్ పథకానికి వ్యతిరేకంగా దేశవ్యాప్త ఉద్యమానికి, రాజ్యాంగ నిర్మాణ సంస్థ కోసం ప్రజా పోరాటాల కొనసాగింపు కోసం ఆయన పిలుపు నిచ్చాడు.[30]

ముస్లింలీగ్ తన కౌన్సిల్ సమావేశంలో, దాని వేర్పాటువాద వైఖరిని వెల్లడించే వాదనని ముందుకు తెచ్చింది. కాంగ్రెస్ కనుక పాకిస్తాన్ ఏర్పాటును

---

29. పైదే.
30. *పీపుల్స్ ఏజ్,* అగస్టు 14, 1946.

ఆమోదిస్తే, దానితో ముస్లింలీగ్ బ్రిటిషర్లకి వ్యతిరేకంగా ఐక్య సంఘటనను ఏర్పాటు చేసి వుండేదని పేర్కొంది. కాని, అందుకు భిన్నంగా కాంగ్రెస్ ముస్లీం లీగ్‌ని పక్కనపెట్టి బ్రిటిష్‌తో షరతుకు వద్దామని కోరుకుంది. అందుకని, ముస్లింలీగ్ ఏకపక్ష ప్రాతిపదక మీద ముందుకు వెళ్లాల్సి వచ్చింది.

ఈ ముస్లింలీగ్ వైఖరి కమ్యూనిస్టుపార్టీ పత్రికలో పూర్తిగా ప్రజాస్వామ్య విరుద్ధమైనదని విమర్శించబడింది.

> కాంగ్రెస్ వ్యతిరేక, హిందూ వ్యతిరేక తీవ్రప్రచారం సాగిస్తూ, దేశంలోని ప్రధాన రాజకీయ సంఘాన్ని శక్తివంతమైన మిత్ర పార్టీగా కాక, దాన్ని బహిరంగంగా తన శత్రువుగా ప్రకటిస్తూ, దాని ఎన్నుకోబడిన అధ్యక్షుణ్ణి ప్రతిరోజూ నిందిస్తూ ముస్లీంలీగ్ ముస్లిమేతర గౌరవనీయ దేశభక్తుల్ని హీనమైన భాషలో నిందిస్తూ లీగ్ నాయకత్వం కాంగ్రెస్‌తో ఒప్పందానికి మంచి వాతావరణాన్ని సృష్టిస్తున్నామని భావిస్తోందా?[31]

ఆ రిపోర్టు తన నిశిత విమర్శను యిలా కొనసాగించింది.

> ముస్లీంలీగ్ నాయకత్వం ముందుకు తెచ్చిన పాకిస్తాన్ డిమాండ్‌ను ఏ ప్రజాస్వామ్య వాదీ ఆమోదించలేదు.

బ్రిటిష్ ప్రతిపాదనలకు ముస్లిం లీగ్ నిరాకరణను దురించి పి.సి.జోషి 1946, జూలై 30 న *"ముస్లిం లీగ్ తీర్మానం కాంగ్రెస్ నాయకత్వానికి కళ్ళు తెరిపించాలి"* అనే పేరుతో ఒక నివేదికను జారీ చేశాడు. ఆయన కాంగ్రెస్ నాయకత్వాన్ని ఆ పథకాన్ని నిరాకరించి, వయోజనుల ఓట్లద్వారా రాజ్యాంగ సభ (కాన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ) నినాదాన్ని లేవదియ్యమని, స్వయం నిర్ణయాధికారంపై ఆధారపడాలనీ, ముస్లీంలీగ్‌తో కలిసి సంయుక్తంగా క్విట్ ఇండియాకి బ్రిటిష్ నిరాకరణకి వ్యతిరేకంగా పోరాటం సాగించాలని విజ్ఞప్తి చేశాడు.[32]

---

31. న్యూఢిల్లీలో 1946 జూన్ 5, 6 తేదీల్లో జరిగిన ముస్లింలీగ్ కౌన్సిల్ సమావేశంపై, 1946, జులై 7 న *పీపుల్స్ ఏజ్‌*లో సజ్జాద్ జహీర్ రిపోర్టు.
32. *పీపుల్స్ ఏజ్,* అగస్టు 4, 1946.

డాక్టర్ జి.అధికారి రూపొందించిన స్వయం నిర్ణయాధికార ప్రతిపాదన విషయంలో కమ్యూనిస్టులు నిశితంగా విమర్శించబడ్డారు. ఆ సిద్ధాంతాన్ని జోషి పూర్తిగా విశ్వసించలేదన్న విషయాన్ని అధికారికి వివరించాడు. కాని, పార్టీ నాయకత్వం ఆ విషయాన్ని నిర్ణయించాక, పార్టీ పత్రిక కీలకమైన స్వయంనిర్ణయాధికార ప్రాముఖ్యం గురించి వరుసగా వ్యాసాల్ని ప్రచురించింది. వాటిలో యిలా రాయబడింది:

> జాతుల స్వయం నిర్ణయాధికారం వలన ఒక జాతీయ యూనిట్ విడిపోతుందా, విడిపోదా అన్న ప్రశ్న మాత్రమే కాదు. మరో విషయం, అదో గొప్ప విప్లవాత్మక సమైక్యీకరణ సూత్రం. ఆ సూత్రం స్వతంత్ర భారత దేశంలోని ప్రతి ఒక్క జాతి ప్రజలకూ స్వాతంత్ర్యాన్నీ ప్రజాస్వామ్యాన్నీ హామీ యిస్తుంది.
>
> జాతుల స్వయం నిర్ణయాధికారానికి అర్థం అదే జాతికి చెందిన సామాన్య ప్రజలను సమైక్యం చెయ్యడం, హిందువులూ, ముస్లింలూ సామ్రాజ్యవాద భూస్వామ్యపాలనకు, రాజరిక నిరంకుశ పాలనకీ, భూ స్వామ్యాధికారానికీ వ్యతిరేకంగా పోరాడటం.[33]

1946-47లో రజనీ పామీదత్తు సి.పి.ఐ.యొక్క పాకిస్తాన్ జాతుల స్వయం నిర్ణయాధికార సిద్ధాంతాన్ని విచ్ఛిన్నం చేశాడు. చాలా కాలం తర్వాత 1951లో, జోషి ఒక ఇంటర్వ్యూలో యీ సమాచారాన్ని వెల్లడించాడు. ఈ సిద్ధాంతకర్త అయిన డా.అధికారికి రజనీ ఫామీదత్తు అభ్యంతరాన్ని అర్థం చేసుకునేందుకు ఆరు నెలలు పట్టింది. జోషి అభిప్రాయం ప్రకారం, కాంగ్రెస్, ముస్లీంలీగ్ ఐక్యత మీద ఆధారపడిన జాతీయ ప్రభుత్వం యుద్ధపు రోజుల చివరిదాకా సరిగావుంది. కాని, పాకిస్తాన్ ప్రాతిపదిక మీద కాంగ్రెస్, లీగ్ ఐక్యత తప్పు. దానిని గురించి ఆయన యిలాఅన్నాడు.

> పాకిస్తాన్‌పట్ల సాంఘిక దురభిమానం కాంగ్రెస్ ప్రదర్శించడంపట్ల మేము విమర్శనాత్మకంగా దూషించాము. కాని, మేము జిన్నాపట్ల విమర్శనాత్మక దృష్టి చూపలేదు. రెండో విషయం, మేము పాకిస్తాన్‌ని

33. *పీపుల్స్ ఏజ్*, అగస్టు 18, 1946.

జాతీయ స్వయం నిర్ధారణతో సమానం చేశాం. ఎత్తుగడ విధానం ముందు ముందు దీన్ని ఆచరణాత్మకం చేస్తుంది.[34]

ముస్లింలీగ్ ముస్లిం ప్రజానీకంలో సామ్రాజ్యవాద వ్యతిరేక భావాన్ని పెంపొందిస్తూ, వాళ్లని వేర్పాటువాద సంఘటనలో తప్పుదారి పట్టించిందని కమ్యూనిస్టు పార్టీ అభిప్రాయపడింది. వాయవ్య, ఈశాన్య ప్రాంతాల్లో ఒక వేరు ముస్లిం రాజ్యాన్ని అందులో నలబై శాతం ముస్లిమేతరులతో బాటు ఆ ప్రాంతాల్లోని ప్రజాస్వామ్య బద్ధమైన ప్రజల ఓట్లను నిరాకరించి, అక్కడ వున్న జాతుల స్వయం నిర్ణయాధికారాన్ని నిరాకరించడం, ప్రజాస్వామ్య విరుద్ధం.[35]

కాంగ్రెస్, ముస్లింలీగ్‌లకు కమ్యూనిస్టు పార్టీ చేసిన విజ్ఞప్తి వ్యర్థం అయినట్లు రుజువైంది. అఖిల భారత ముస్లింలీగ్ బొంబాయిలో 1946, జులై 29న జరిగిన కౌన్సిల్ సమావేశంలో తను కోరినదాన్ని సాధించేందుకు ప్రత్యక్ష కార్యాచరణ కార్యక్రమాన్ని కొనసాగించాలని, అంటే, పాకిస్తాన్ అనే వేరు రాజ్యాన్ని స్థాపించాలని నిర్ణయించింది. అందుకు 1946 ఆగస్టు 16వ తేదీన ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చేందుకుగాను ప్రత్యక్షాచరణ దినంగా నిర్దేశించింది, కాని, అటు తర్వాత జరిగిన భయంకరమైన జాతిని ముంచిన కలహాల్లో చాలా ఎక్కువగా దెబ్బతిన్నది కలకత్తా. ఆ భయంకర కలకత్తా మారణ హోమం చరిత్రలో రికార్డు చెయ్యబడింది. ఆ కొట్లాటలు బొంబాయికి, పంజాబుకి, ఉత్తరప్రదేశ్‌కి వ్యాపించాయి. హిందూ, ముస్లింల దారుణ మారణ కాండల నివేదికన్నాయి. కమ్యూనిస్టులు సహాయక, రక్షణ కార్యక్రమంలో మునిగారు.

జోషి పార్టీ సభ్యులందరికీ సహాయక కమిటీలను ప్రారంభించమనీ, శరణార్థుల బాధలను నివారించేందుకు కృషి చెయ్యమనీ, ముందు ముందు జరగబోయే కొట్లాటలను ఎలా నివారించాలో చూడమనీ విజ్ఞప్తి చేశాడు.

---

34. పి.సి.జోషి, పార్టీ కేంద్రకార్యాలయంలో, ప్రశ్నలు సమాధానాల సమావేశం ఏప్రిల్ 6, 1951, ఫైల్ నో. సి.పి.ఐ.1951/47, *ఆర్కైవ్స్ ఆఫ్ కాంటెంపరరీ ఇండియా*, జె.ఎన్.యు.
35. *పీపుల్స్ ఏజ్*, అగస్టు 18, 1946.

అదే సమయంలో, బ్రిటిష్ పాలన నుంచి స్వాతంత్ర్యాన్ని సాధించేందుకు హిందూ ముస్లిం ఐక్యత అవసరాన్ని ఆయన వివరించాడు.[36] ఆ సమయంలో జోషి జనం మధ్య పనిచెయ్యడం, వారికి సహాయం చెయ్యడం, వాళ్లను ఐక్యం చెయ్యడం అతి ముఖ్యమైన కర్తవ్యంగా భావించాడు. ఆయనే స్వయంగా ఆ కోట్లాటల సమయంలో పిచ్చెత్తినట్లు దేశమంతా పర్యటించాడు. ముస్లింలీగ్ పోరాటం అంతర్యుద్ధానికి దారితీసిందనీ, అది సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం కాదనీ జోషి అభిప్రాయపడ్డాడు. దానిని గూర్చి ఆయన యిలా రాశాడు. "అవి పాత తరహా మత కల్లోలాలు కావు. అవి పూర్తిగా రాజకీయ కల్లోలాలు. కాంగ్రెస్, ముస్లింలీగ్ సంఘర్షణల యొక్క ప్రత్యక్ష పర్యవసానం. వాళ్లు ఎంత దూరం పోయారంటే, సాముదాయిక జీవితం, సాముదాయిక పోరాటం, సాముదాయిక స్వాతంత్ర్యం ప్రతి ఒక్కటీ అపాయంలో ఉంది. కేవలం బ్రిటిష్ రాజ్యం మాత్రమే మిక్కిలి సురక్షితంగా వుంది." [37]

భయంకరమైన మతపరమైన మారణహోమం మధ్యలో, హిందూ, ముస్లిం, సిఖ్ఖు ప్రజానీకానికి విజ్ఞప్తి చేసేవిధంగా గాంధీ, నెహ్రూలకు ఉన్నంత హోదా జోషికి కూడా జాతీయస్థాయిలో వుంది. ఆయన విజ్ఞప్తులను ఆయన కామ్రేడ్లు కింది స్థాయి దాకా తీసుకెళ్లేవారు. అవి ఎన్నెన్నో అభిప్రాయాలున్న ఆలోచనాపరులైన భారతీయుల మనసుల్ని తాకేవి. గోవింద్ వల్లభ్‌పంత్ ఆర్.ఎస్.ఎస్.పట్ల సౌమ్యంగా వ్యవహరిస్తున్నాడని నెహ్రూ గమనించినప్పుడు, ఆయన జోషిని పంత్ దగ్గరికి వెళ్లమన్నాడు. పంత్ జోషికి, అతని తల్లి వైపు నుంచి సన్నిహిత బంధువు. జోషి ఆ తరుణంలో సత్యాల, సంఖ్యల ఆధారంగా తన సముచిత వాదనల ద్వారా పంత్‌ని ఒప్పించ గలిగిగాడు. జోషి వాదన ఆ తరుణంలో పంత్‌పైన ప్రభావం చూపింది. పంత్ అప్పటి నుంచి ఆరెస్సెస్‌కి వ్యతిరేకంగా ప్రచారం చేశాడు. ఈ ఘటన, అంతకుముందు జరిగిన గాంధీ-జోషీ లేఖలు, భారత కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శిగాఉన్న కొద్ది సంవత్సరాల్లో జోషి జాతీయ స్థాయిని

---

36. *పీపుల్స్ ఏజ్,* అగస్టు 25, 1946.
37. *పీపుల్స్ ఏజ్,* అక్టోబరు 17, 1946.

సంపాదించగలడన్న విషయాన్ని వెల్లడించాయి. అప్పట్లో ఆయనకువున్న అంతటి ప్రత్యేకత ఏమిటి? జోషిని గురించి ఎవరైనా విశ్లేషిస్తే, కాంగ్రెస్ భారత కమ్యూనిస్టు పార్టీ మీద చేసిన విమర్శను ఆయన ఎన్నడూ లెక్కచెయ్యకుండా ఉండిపోలేదు. గాంధీజీతో సహా కాంగ్రెస్ నాయకులకు అవిరళంగా సమాధానాలు యిచ్చాడు. ఆయన పార్టీ రాజకీయ స్థానం విషయంలో ఎన్నడూ రాజీపడలేదు. రాసినప్పుడుగానీ, మాట్లాడినప్పుడుగానీ ఆయన తరచు చాలా సునిశితంగా వ్యవహరించాడు. కానైతే, తన ప్రత్యర్థితో మాట్లాడుతున్న అభిప్రాయం కలిగించే భాషను ఆయన ఎన్నడూ వాడలేదు. ఆయన మాటలవాడకం, వాళ్లు ఆయనతో ఏకీభవించక పోయినా, కాంగ్రెస్ వారు కమ్యూనిస్టుల స్థానాలను అర్థం చేసుకోవడానికీ, ప్రశంసించడానికీ ఎంతో సహాయం చేశాయి. అందుకే, ప్రజల్లో అధిక సంఖ్యాకులు జోషిని ఆమోదయోగ్యంగా, ప్రశంసనీయంగా పరిగణించారు.

స్వాతంత్ర్యం సమీపిస్తోంది. కలహాలు, స్త్రీల మానభంగాలు, వాళ్లని ఎత్తుకు పోవడం 1946 అక్టోబరులో నవఖాలీ, తిప్పెరా వంటి ప్రాంతాలను కూడా ఆవరించాయి. దీనికి ముందు 1946, ఆగస్టు 16-19 తేదీల్లో కలకత్తాలో భారీ హత్యలు జరిగాయి. గాంధీజీ నవఖాలీ వెళ్లి, అక్కడ హిందూ, ముస్లింలనీ ఐక్యం చేసేందుకు ప్రయత్నించారు. దానితో దేశం చీలిపోదని భావించారు. ప్రతీకార భావాలు ప్రతికూల ప్రతీకారంతో తొలగించడం సాధ్యం కాదని జోషికి తెలుసు. నవఖాలీలో బాధితులపట్ల సానుభూతితో పి.సి.జోషి 1946, అక్టోబరు 20వ తేదీన ఒక ప్రకటనను జారీ చేశాడు.

> న్యాయసమ్మతంగా దిగ్భ్రాంతి చెందిన హిందూ సోదరులు రెచ్చిపోవద్దని నేను చిత్తశుద్ధితో విజ్ఞప్తిచేస్తున్నాను. పగ తీర్చుకోవాలన్న భావం పరస్పర మారణహోమాన్ని తీవ్రతరం చేసి, బ్రిటిష్ సామ్రాజ్య వాదులకి మాత్రం అధిక సంతోషాన్ని కలుగజేస్తుంది. తూర్పు బెంగాల్లోని హిందువులకు సహాయంచేసే అత్యుత్తమ మార్గం, అక్కడి మైనారిటీ ముస్లింలను పొడవటంకాదు, వారికి పూర్తి భద్రత హామీ యివ్వడం.[38]

38. *పీపుల్స్ ఏజ్,* అక్టోబరు 27, 1946.

ఈ కీలకదశ అంతటా, జోషి జరిపిన పోరాటం మతాల మధ్య శాంతిని పునరుద్ధరించటంపైనే కేంద్రీకరింప బడింది. ఎవరి స్థానంలో వారిని కలహాల పరిస్థితిలో పనిచెయ్యమనీ, విస్తృతమైన సమైక్యశాంతి ఉద్యమాన్ని ప్రారంభించమనీ ఆయన పార్టీ కామ్రేడ్లకు, సానుభూతి పరులకు చెప్పాడు. ప్రమాదకర ప్రాంతాలు అన్నింటిలో శాంతి సాధన కోసం ప్రాణహానిని సైతం లెక్కచెయ్యవద్దని చెప్పాడు. ఆయన మైనారిటీ మతస్థుల్ని కాపాడటం కోసం తన ప్రాణాన్ని సమర్పించిన కామ్రేడ్ లాల్‌మోహన్ సేన్ అమరత్యాగాన్ని ఉదాహరణగా సూచించాడు. కలహాలు అంతమయ్యేదాకా రక్షణ కోసం నిలబడమని ఆయన ప్రజానాయకులకు, కార్మికులకు రైతు కామ్రేడ్లకు విజ్ఞప్తి చేశాడు.[39]

జోషి ముస్లింలీగ్ యొక్క ద్వేషపూరిత ఉద్యమాన్ని ఖండించడంతోబాటు, సామాన్య ప్రజల ఐక్యపోరాటం మాత్రమే ముందుకెళ్లేందుకు మార్గమని పిలుపిచ్చాడు.[40] బ్రిటిష్ పథకాన్ని నిరాకరించమని కాంగ్రెస్ నాయకత్వానికి జోషి మరల మరల విజ్ఞప్తి చేశాడు. ఎ.ఐ.సి.సి. మీరట్ సమావేశానికి 1946 ముందు తన వాదనను చెప్తూ, ఆయన తన వాదనలను గట్టి విశ్వాసంతో కాగితాలమీద పెట్టాడు.

> బ్రిటిష్ పథకంలో అధికార బదలాయింపు లేదని మన పార్టీ మాత్రమే హెచ్చరించింది. భారతీయుల విభేదాలను దోచుకోవడం, భారతీయ విప్లవాన్ని భంగపరచడం, పోరాడుకుంటున్న హిందూ, ముస్లిం ప్రాంతాలుగా భారతదేశాన్ని విభజించడం, వాళ్ల పంచమాంగగళమైన భారతీయ రాజుల ద్వారా తమ ఆధిపత్యంలో ఉంచుకోవడమే బ్రిటిష్ వారి లక్ష్యం.

కాంగ్రెస్ నాయకత్వం యిందుకు భిన్నంగా ఆలోచించింది. అది బ్రిటిష్ పథకాన్ని 'భారతదేశ స్వాతంత్ర్యానికి ఒక అభివృద్ధి సాధనం'గా

---

39. పి.సి.జోషి, 'టు ఆల్ పార్టీ మెంబర్స్, సింపతైజర్స్', పీపుల్స్ ఏజ్, సెప్టెంబరు 14, 1947.
40. పీపుల్స్ ఏజ్, నవంబరు 3, 1946.

చూసింది. కాంగ్రెస్ జనం నిజంగానే నిలబడి వున్నారనీ, కాంగ్రెస్ బలంగా ఉందనీ, అది కూడా నిజమనీ, అందుకని బ్రిటిష్‌వాళ్లు భారత దేశం నుంచి వెళ్ళిపోయేందుకు సిద్ధంగా వున్నారన్న వాదనలతో సమస్త విమర్శనీ అణచివేసింది. కాని యిదంతా నిజం కాదు.

మీరట్ మహాసభ (కాంగ్రెస్)బ్రిటిష్ పథకాన్ని పూర్తిగా నిరాకరించి, కాంగ్రెస్ భారత స్వాతంత్ర్యం జాతీయ స్వయం నిర్ణయం, సిసలైన ప్రజాస్వామ్యాల ప్రాతిపదికపైన మాత్రమే రాజ్యాంగ చట్టాన్ని రచిస్తుందని ప్రకటించాలి.[41]

మౌంట్ బాటెన్ తన పథకంతో 1947, మార్చి నెలలో భారతదేశానికి వచ్చాడు. నాయకులతో అధికార బదిలీ విషయంలో అనేక సమావేశాలు జరిగాయి. కాని, గాంధీజీ ఎన్నడూ విభజనను కోరుకోలేదు గనుక, యీ చర్చలనుంచి దూరంగా ఉండిపోయాడు.

1946 లో రజనీ పామీదత్తు కాబినెట్ మిషన్ కార్యకలాపాలను గుర్తించేందుకుగాను *డెయిలీ వర్కర్* ప్రతినిధిగా భారతదేశం వచ్చాడు. జోషి దృష్టిలో అది మిక్కిలి గణనీయమైన ఘటన. రజనీ పామీదత్తు కాంగ్రెస్ నాయకులను, నెహ్రూను ఒక్కసారి కంటె ఎక్కువసార్లు కలిశాడు. జోషి పార్టీ నాయకత్వం రజనీ పామీదత్తుతో కలిసిన విషయాన్ని బాగా తర్వాత గుర్తు చేసుకుని యిలా రాశాడు.

... ఆయన (రజనీ పామీదత్తు) మరింత జాగరూకత, ఘటనాక్రమం అంతలోనూ స్థిరమైన ఆలోచనావిధానాన్ని నిలుపుకోవలసిన అవసరాన్ని గురించి నొక్కి వక్కాణించాడు. ప్రస్తుతం ఒక నూతన చారిత్రక దశ తెరుచుకుంటోంది. భారతదేశ స్వాతంత్ర్యం చర్చనీయాంశ పట్టికలో వుంది. తన తెంపరితనంలో ఉన్న బ్రిటిష్ సామ్రాజ్యవాదం ప్రస్తుతం తన అత్యంత వినాశకర జిత్తులమారితనాన్ని వినియోగించుకునేందుకు ప్రయత్నిస్తుంది. భారతీయ కమ్యూనిస్టు పార్టీ ఈ పరిస్థితిలో జరిగే మలుపులు, మెలికలకు సిద్ధంగా వుండాలి.

---

41. *పీపుల్స్ ఏజ్*, నవంబరు 17, 1946.

నెహ్రూ బాగానే వున్నాడు, కానీ బలహీనంగా వున్నాడని రజనీ పామీదత్తు అన్నాడు. నెహ్రూ తన స్వంత పార్టీలోని మితవాదులచేత నిరుత్తరుడు చెయ్యబడే ప్రమాదంలో వున్నాడు.

రజనీ పామీదత్తు సలహా యిలా వుంది:

కాంగ్రెస్‌తో చెడిపోయిన సంబంధాలను తిరిగి నిర్మించండి. యుద్ధ స్వభావం విషయంలో సి.పి.ఐ, కాంగ్రెస్‌ల మధ్య వున్న విభేదాలు గతాంశం అవుతుంది. కాని, పాకిస్తాన్ కావాలన్న ముస్లింలీగ్ డిమాండుకు తోడ్పాటు సిసలైన అవరోధం అవుతుంది. రజనీ పామీదత్తు పాకిస్తాన్‌కి మనతోడ్పాటుతో ఎన్నడూ ఏకీభవించలేదు. జాతుల సమస్య విషయంలో లెనినిస్టు బోధనని యీ సమస్యకు అన్వయించడం పొరపాటు.[42]

ఈ పునరాలోచన పార్టీలో అప్పటికే ప్రారంభమైంది. పైగా స్వయం నిర్ణయాధికారం సమస్య అంతటి మీదా రెండవ అభిప్రాయాల నిచ్చాయి. పాకిస్తాన్‌కి, సహాయంగా లెనిన్ అభిప్రాయాలను దుర్వినియోగ పరచుకోవడం విరమించబడింది. కమ్యూనిస్టు నాయకత్వం కాంగ్రెస్‌తో హిందూ ముస్లింల ఐక్యత అత్యంత ఆవశ్యకమని నొక్కి చెప్పింది. భారతదేశ స్వాతంత్ర్య ఆధార ప్రాతిపదిక మీద ముస్లింలీగ్ పరస్పర సంతృప్తికర ఒప్పందానికి రావడం అవసరమని చెప్పింది.

1947లో భారతదేశ స్వాతంత్ర్యం కమ్యూనిస్టు ఉద్యమానికి ఒక మలుపు. జోషి దేశ స్వాతంత్ర్యాన్ని స్వాగతించాడు. జాతీయ పునరావిర్భావ పోరాట విషయంలో దాన్ని తొలి సానుకూల ముందడుగుగా పరిగణించాడు. ఆయన దృష్టిలో, కొద్దిమంది అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా, సమస్త ప్రగతిశీల భారతీయ జనానీకపు ఉద్యమానికి అది నూతన శకం. ఆయన దృష్టిలో భూస్వామ్య దేశంలో మితవాద అవరోధాలకు, యీ శక్తులు ప్రాతినిధ్యం వహించిన నయా వలసవాద ప్రమాదానికి వ్యతిరేకంగా ఒక నూతన జాతిని నిర్మించడం.

---

42. *పీపుల్స్ ఏజ్,* నవంబరు 17, 1946.

కానైతే, తన స్వంత పార్టీలో జోషి మూలకు నెట్టబడ్డాడు. కమ్యూనిస్టు నాయకత్వంలోని అధిక సంఖ్యాకులు భారత స్వాతంత్ర్యాన్ని నకిలీదిగా చిత్రీకరించారు. జాతీయ బూర్జువా నాయకత్వం స్వతంత్ర పాలనను ఎలా ప్రవేశపెట్టగలదు? అటు తర్వాత త్వరలోనే జోషి ప్రధాన కార్యదర్శి పదవి నుంచి తొలగించబడ్డాడు. ప్రధాన కార్యదర్శిగా పి.సి.జోషి తెలుసుకోకుండా ఉండిపోయినట్లు, అలాంటి ప్రబలమైన మార్పు రాజకీయ అవగాహనలో ఎలా సంభవించగలదు? ఈ ప్రశ్నలకి సరాసరి జవాబులు లేవు. అది ఒక శకానికి అంతం.

జోషి దశ (1936-48) భారత కమ్యూనిస్టు ఉద్యమపు అత్యంత తెలివైన సూక్ష్మబుద్ధిగల ప్రకరణం. ఆయన నాయకత్వంలో జాతీయ రాజకీయ కార్యాచరణ మార్గంలో కమ్యూనిస్టులు తీవ్రమైన మలుపు తెచ్చిన కాలం.అది. ఆయన పార్టీని జాతీయ స్థాయికి పెంచాడు. ఆయన స్వయంగా అన్ని రకాల జాతీయ నాయకులతో మహాత్మాగాంధీ, నెహ్రూ, సర్దార్ పటేల్, మౌలానా అబుల్‌కలాం అజాద్, రఫీఅహ్మద్ కిద్వాయ్ మొదలగు వారితో సంబంధాలు నెరిపాడు. ఆయన కాంగ్రెస్ సోషలిస్టు నాయకులైన జయప్రకాశ్ నారాయణ్, ఆచార్య నరేంద్రదేవ్, ఎం.ఆర్.మసానీ, అశోక్ మెహతా, తదితరులతో సైతం సన్నిహిత సంబంధాలు కలిగివున్నాడు. పి.సి.జోషి కేవలం భారత కమ్యూనిస్టు పార్టీ నాయకుడు మాత్రమే కాదు, జాతీయ స్థాయి వ్యక్తి. మేధావులమధ్య, రాజకీయంగా వర్గ చైతన్యం కలిగిన కార్యకర్తల మధ్య, ఆయన జవహర్ లాల్ నెహ్రూ తర్వాత అంతటి నాయకుడుగా పరిగణించబడ్డాడు. ఆయన నాయకత్వ దశలో భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ పార్టీ అవడం మాత్రమే కాదు, పెద్ద సంఖ్యలో ఆత్మత్యాగం చేసే పార్టీ సభ్యులతో అత్యంత శ్రేష్ఠులైన కమ్యూనిస్టు దేశభక్తులుగా అది ప్రధాన జాతీయోద్యమంలో ముఖ్య పాత్ర వహించింది.

పి.సి.జోషి తన కామ్రేడ్లు అత్యుత్తమ స్వాతంత్ర్యయోధులు అవాలనీ, సంకుచిత దృక్పథం కలిగి వుండరాదనీ, వాళ్లకి వ్యతిరేకులైన వారితో సైతం, ప్రతి ఒక్కరితో కలవాలనీ కోరాడు.

# 5

# స్వాతంత్ర్యానంతరం

## అంతర్గత పోరాటం

విచ్ఛిన్నమైన జాతికి స్వాతంత్ర్యం వచ్చింది. దేశం సోదర మతస్థుల కలహాల్లో మునిగిపోయింది. దేశవిభజనానంతరం, రెండు వైపుల నుంచీ కాందిశీకులు తూర్పు, పశ్చిమదిక్కుల సరిహద్దులను బారులుగా దాటి వెళ్లడం మొదలైంది. మహాత్మాగాంధీ మాదిరిగా, పి.సి.జోషి సైతం భారతదేశాన్ని విభజించే మౌంట్ బాటెన్ పథకాన్ని వ్యతిరేకించాడు. కాంగ్రెస్, ముస్లింలీగుల సమస్యను యీ విభజన పరిష్కరించదన్న విషయం ఆయనకి బాగా తెలుసు. కాని, వాస్తవానికి అంతర్గత కలహాలన్నింటినీ అది ముమ్మరం చేస్తుంది. అంతిమ అధికార బదలాయింపుకి కొద్దివారాలకు ముందు, ఆయన *పీపుల్స్ఏజ్* లో యిలా రాశాడు:

> దేశ విభజన రెండు భాగాలనూ ఆర్థికంగా, సైనికంగా బలహీన పరుస్తుందని మొత్తంగా అందరూ గ్రహించారు. అది బ్రిటిష్ పథకపు అసలు సారాంశం. మొదట విభజన ద్వారా మనల్ని బలహీనపరచడం, ఆతర్వాత మన బలహీనతని ఆసరాచేసుకుని, రెండు రాజ్యాల మీద ఆర్థిక సైనిక అదుపును 'ఆర్థిక సహాయం', 'ఉమ్మడి రక్షణ'ల పేర బ్రిటిష్ సామ్రాజ్యంలో సభ్యత్వం కొనసాగింపని యింకా గ్రహింపబడలేదు.[1]

చివరికి ఇండియా బ్రిటిష్ పాలననుంచి స్వాతంత్ర్యం సాధించాక, జోషి

---

1. *పీపుల్స్ ఏజ్,* జులై 20, 1947.

స్వాతంత్ర్యాన్ని స్వాగతించాడు. దానిని జాతీయ పునరుజ్జీవన యాత్రలో తొట్టతొలి మైలురాయిగా పరిగణించాడు. ఆయన దృష్టిలో దేశం ముందున్న ఊహాతీతమైన సమస్యల మధ్య జాతి పునర్నిర్మాణం కాందిశీకుల పునరావాస సాధన సమస్యలను ఎదుర్కోవడం, మతపర మారణహోమం జ్వాలలను చల్లార్చడం, స్వతంత్ర భారతదేశాన్ని దాని శైశవస్థితిలో అస్థిరపరచేందుకు అర్.ఎస్.ఎస్ పథకాన్నీ ప్రభుత్వంలో దానికి సహాయంచేస్తున్న శక్తుల్ని భగ్నపరచాలి. 1947 అక్టోబరు 8న, పార్టీ బెంగాల్ కమిటీ బెంగాల్లో ఏర్పాటు చేసిన 25,000 మందితో కూడిన యాత్రలో జోషి యిలా ప్రసంగించాడు. "రాజీనామా చెయ్యవలసింది పండిత్ నెహ్రూ కాదు, ప్రభుత్వంలో ఆయన్ని వ్యతిరేకిస్తున్నవాళ్లు రాజీనామా చెయ్యాలి." జాతి ఎదుర్కొంటున్న సంక్షోభాలను అధిగమించేందుకు ప్రభుత్వం వెనుక మనం నిలవాల్సిన తక్షణ ఆవశ్యకత ఉందని ఆయన భావించాడు. అటు తర్వాత అప్పుడున్న పరిస్థితుల్లో పార్టీ కర్తవ్యాలను గురించి ఆయన యిలా చెప్పాడు:

> కమ్యూనిస్టు పార్టీ వామపక్ష పార్టీలకు విజ్ఞప్తి చేస్తుంది, చేస్తూ వుంటుంది. ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా సమైక్యమై దేశాన్ని రక్షించడం మన ప్రత్యేక బాధ్యత. చర్యకు సమయం ముగిసిపోయింది. జనం యాత్రల ఆజ్ఞల కోసం డిమాండు చేస్తున్నారు, తామేమి చెయ్యాలో చెప్పమని సహనం లేకుండా అడుగుతున్నారు.... కార్యాచరణకు సమయం వచ్చింది. నాకు ఏ ఒక్కర్ని చూసేందుకైనా సంకోచం లేదు. ఫార్వర్డ్‌బ్లాక్, సోషలిస్టు పార్టీ, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ మొదలగు పార్టీల నాయకులను కలిసేందుకు నేను సిద్ధంగా వున్నాను. ఉమ్మడి ప్రమాదానికి వ్యతిరేకంగా, మన స్వాతంత్ర్యాన్ని యీనాడు మిక్కిలి భయపెట్టుతున్న పరిస్థితిలో మనం సన్నిహితం కావాలి..... మనం మొదట యీ సంక్షోభ గాంభీర్యాన్ని గ్రహించాలి.[2]

జోషి మత కలహాల స్వభావాన్ని విశ్లేషించాడు. ఆయన అభిప్రాయం

---

2. *పీపుల్స్ ఏజ్,* అక్టోబర్ 19, 1947.

ప్రకారం అది కేవలం మతపరమైన ఉద్రేకారంభం కాదు. ఆయన గాంధీజీ, నెహ్రూలతో ఒకవైపున, సోషలిస్టు, కమ్యూనిస్టు, తదితర వామపక్ష బృందాలతో మరొకవైపున ఓ కొత్త ఐక్య సంఘటన కోసం పిలుపిచ్చాడు. మతశక్తుల ప్రభుత్వాధికారంతో ప్రణాళికాబద్ధమైన దాడి చెయ్యాలన్న దీర్ఘకాల రాజకీయ కార్యక్రమాన్ని ఆయన బహిర్గతం చేశాడు.

నిజానికి, యీ సంక్షోభ సమయంలో కాంగ్రెస్, కమ్యూనిస్టులు ఇతర వామపక్ష పార్టీలూ ఢిల్లీలో పరస్పరం సన్నిహితమయ్యాయి. విద్యార్థి కాంగ్రెస్, విద్యార్థి సమాఖ్యల ప్రతినిధులు వీధుల్లో శాంతియాత్ర జరిపారు. ఆనాటి ప్రధాన సమస్య జనాభాని బదిలీచెయ్యడం కాదనీ, మైనారిటీలకు రక్షణ కల్పించడమనీ పి.సి.జోషి నొక్కిచెప్పాడు. ఆ ప్రత్యేక సమయంలో, కాంగ్రెస్ నాయకులందరిలోనూ గాంధీజీయే ఆయనను ఎక్కువగా ప్రభావితం చేశాడు. గాంధీజీ సరైన మాటలను సరైన స్ఫూర్తితో చెప్పాడు. 1947, సెప్టెంబర్ 15వ తేదీన తన ప్రార్థన సమావేశంలో గాంధీజీ యిలా చెప్పాడు, "హిందువులూ, సిఖ్ఖులూ సరైన అడుగువేసి, తమ ఇళ్ళనుంచి తరిమి వేసిన ముస్లింలను తిరిగి వెనక్కిరమ్మని ఆహ్వానించాలి. అన్ని విధాలా యీ ధైర్యవంతమైన చర్య వాళ్ళు తీసుకుంటే, వాళ్లు వెంటనే కాందిశీకుల సమస్యను అతి సరళమైన దశకి తీసుకొస్తారు ..." గాంధీజీ యిలా చెప్పినప్పుడు జోషి ఆయనతో పూర్తిగా ఏకీభవించాడు. "లక్షలాది మంది హిందువులను, సిఖ్ఖులను, ముస్లింలను బదలాయించటం ఊహాతీతమైనది. అది తప్పు. పాకిస్తాన్ చేస్తున్న తప్పు జనాభాను బదలాయించ కూడదనే నిర్ణయంతో సరిదిద్దబడుతుంది. దానికి అనుకూలంగా నా వాణి ఒంటరి అయినప్పటికీ, నేను దానికి అనుకూలంగా నిలిచేందుకు నాకు ధైర్యం వుంది." ప్రార్థన సమావేశంలో గాంధీజీ చేసిన యీ ఉపన్యాసానికి జోషి గాఢంగా ప్రభావితమయ్యాడు. ఆయన దీనిని 1947, సెప్టెంబరు 21వ తేదీన *పీపుల్స్ ఏజ్* లో ప్రచురించబడిన తన వ్యాసంలో ఉదహరించాడు.

స్వాతంత్ర్యోదయం కమ్యూనిస్టు పార్టీకి కొత్త ప్రకరణాన్ని వెలువరించింది. పార్టీ నాయకత్వంలో ఒక విభాగం స్వాతంత్ర్యాన్ని నకిలీదిగా పరిగణించింది. వాళ్ళు దానిని అసత్య స్వాతంత్ర్యం అనుకున్నారు. వాళ్ల దృష్టిలో బ్రిటిష్

సామ్రాజ్యవాదానికి పనిముట్టు అయిన కాంగ్రెస్ ప్రధాన శత్రువు. నెహ్రూని చాంగ్-కై-షేక్‌తో జమకట్టారు. తెలంగాణాను యేనాన్‌తో పోల్చారు. పెట్టుబడిదారీ దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీలకు సోవియట్ నాయకుడు ఝ్దానోవ్ కార్మికవర్గ నాయకత్వంలో తీవ్రవాద ఉద్యమాలను సంఘటిత పరచమని యిచ్చిన పిలుపు యీ విభాగపు ధైర్యాన్ని పెంపొందించింది. ఈ విభాగంలోని అత్యంత ప్రముఖులు బి.టి.రణదివే, పి.సి.జోషి ఎక్కువగా మెచ్చుకునే డాక్టర్ జి.అధికారి.

సుమారు 1947 చివర్లో వచ్చిన స్వాతంత్ర్యానంతరం, ఎస్.ఎ.డాంగే బెల్‌గ్రేడ్‌కి వెళ్లి, ఎడ్వర్డ్ కార్డెల్జ్‌ని కలిశాడు. ఆయన కోమిన్‌ఫర్మ్ (కామింటర్న్‌కి యిది కొత్తపేరు) ముఖ్య ప్రతినిధి. ఆయన డాంగేకి భారత కమ్యూనిస్టులు సామ్రాజ్యవాదానికి ఉపగ్రహంలాంటిదైన కాంగ్రెస్‌కి వ్యతిరేకంగా దాడి మార్గాన్ని తీసుకోవాలని కార్డెల్జ్ చెప్పాడు. ఆయన పి.సి.జోషికి వ్యతిరేకంగా డాంగేని హెచ్చరించాడు. గాంధీ, నెహ్రూ, కాంగ్రెస్‌లకు జోషి సాన్నిహిత్యం కారణంగా జోషీ విశ్వసనీయతను కార్డెల్జ్ ప్రశ్నించాడు. డాంగే తిరిగి వచ్చాక, యీ అంశాన్ని పి.సి.జోషి, జి.అధికారి, బి.టి.రణదివే, అజయ్ ఘోష్, అర్.డి.భరద్వాజ్‌లతో కూడిన పార్టీ పోలిట్‌బ్యూరోకి చెప్పాడు. వీరిలో చివరి యిద్దరూ అనారోగ్యంగా ఉండటంవల్ల ఆ పోలిట్‌బ్యూరో సమావేశానికి హాజరు కాలేదు. జోషి పట్ల ఈ అంతర్జాతీయ హెచ్చరికతో జోషి ఐక్యసంఘటన రాజకీయ విధానంపట్ల పార్టీ నాయకత్వంలో అప్పటికే ఉన్న సంశయం మరింత బలపడింది. జోషి సంస్కరణవాద నాయకత్వం రానున్న భారత విప్లవానికి ఒక ఆటంకమన్న విషయంపట్ల అప్పటికే గుసగుస మొదలైంది. తీవ్రవాద విప్లవ సంఘాన్ని ఏర్పాటుచెయ్యడంపట్ల జోషి శ్రద్ధ చూపడంలేదని జోషిపై ఆరోపణ చెయ్యబడింది. తనే కులపతి అన్నట్లు, జోషి భారతీయ సంయుక్త కుటుంబాన్ని పెంపొందిస్తున్నందుకు ఆరోపించ బడ్డాడు. పార్టీ నాయకత్వం లోపల జోషిపట్ల వ్యతిరేకత పెంపొందుతున్న విషయాన్ని రజనీ పామీదత్తు గ్రహించాడు. 1946లో కాబినెట్ మిషన్‌తో బాటు ఇండియాకి వచ్చినప్పుడు, రాబోతున్న ప్రమాదం గురించి జోషిని రజనీ పామీదత్తు హెచ్చరించాడు. ఆయన హెచ్చరికలు అటుతరువాత భవిష్య సూచకాలుగా రుజువయ్యాయి.

జాతీయ పరిస్థితి పట్ల తన నిర్ధారణతో పార్టీ కేంద్రకమిటీ సభ్యుల్లో అధిక సంఖ్యాకులు విభేదించారన్న విషయాన్ని జోషి గమనించాడు. పార్టీ కేంద్ర కార్యదర్శి పదవికి జోషి రాజీనామా చేశాడు. కాని, ఆయన రాజీనామా సాధారణ సభ్యుల నుండి, ప్రజాసామాన్యం నుండి రహస్యంగా ఉంచబడింది. 1947 డిసెంబరులో బి.టి.రణదివే పార్టీ నిర్ణయాలకు విరుద్ధంగా కేంద్ర కార్యదర్శిగా చేయబడ్డాడు.

జోషి రాజకీయంగా ఒంటరి చేయబడటమే కాక, ఆయన దారుణమైన అవమానాన్ని కూడా ఎదుర్కోవలసి వచ్చింది. పి.సి.జోషి భారత విప్లవాన్ని నిలవరించినందుకు, ఆత్మ విమర్శ చేసుకునేందుకు ఒత్తిడి చెయ్యబడ్డాడు. చాలా రోజుల తర్వాత ఆయన యిలా రాశాడు. "నేను ఐచ్ఛికంగా ముతక బట్టల్లో బూడిదలో ప్రధానమైన, నిజమైన దోషిగా కనిపించాను. మరింత బాగా తెలుసుకోవలసిన సమయంలో నేను స్వయంగా ఒక మందబుద్ధిని"[3]

నెమ్మదిగా పూర్వం జోషిని భయంగా, మెచ్చుకోలుగా, గౌరవంగా, చూసిన దాదాపు మొత్తం కామ్రేడ్లందరూ నాయకత్వం ఆయన్ని వదిలేసిన కారణంగా, ఆయనకి వ్యతిరేకులయ్యారు. మేధావి, కేంబ్రిడ్జి ఆక్స్‌ఫర్డ్‌లకు చెందిన తెలివైన కామ్రేడ్లు మోహన కుమార్ మగళం, అరుణ్ బోస్, ఎన్.కె.కృష్ణన్ అందరూ ఆయనకు వ్యతిరేకులై ఒకరి తర్వాత మరొకరు జోషిని వదిలి, ఇక విప్లవం అనివార్యమన్న దృఢ విశ్వాసంతో కొత్త నాయకత్వంలో ఒక భాగమయ్యారు. జోషి, జాతీయ లేక ప్రజాసామాన్య తోడ్పాటు లేకుండా యీ మేధావులకు అత్యంత ప్రాధాన్యం యివ్వడం మూలంగా, వాళ్లని పార్టీ అగ్రస్థాయికి తీసుకు రావడం మూలంగా ఇది జరిగి ఉంటుంది. సిసలైన కార్మిక సంఘాల, రైతు సంఘాల నాయకులమీద కాక, అలాంటి బృందాలమీద ఆధారపడి నందుకు పి.సి.జోషి భారీనష్టాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఆంధ్ర రైతుల ప్రముఖ నాయకుడైన పి.సుందరయ్య ఆదిలో జోషి సరసన నిలబడ్డాడు. అప్పుడు ఆయనకు పార్టీలో ఒంటరితనం ప్రారంభమైంది. నూతన పార్టీ విధానం మూలంగా, కొద్దిమంది దాన్ని ప్రశ్నించిన వాళ్ళు వున్నారు. కాని పార్టీ

---

3. పి.సి.జోషి, *రజనీ పామీదత్ అండ్ ఇండియన్ కమ్యూనిస్ట్స్*, నుండి.

కామ్రేడ్లలో అధిక సంఖ్యాకులు భారతదేశానికి వచ్చిన స్వాతంత్ర్యం నకిలీదని భావించారు.

కమ్యూనిస్టుపార్టీ రెండవ మహాసభ కలకత్తాలోని మహమ్మదాలీ పార్కులో 1948 ఫిబ్రవరిలో జరిగింది. పార్టీ నూతన నాయకత్వం సాయుధ పోరాటానికి పిలుపిచ్చింది. నినాదాలు యివీ, *"తెలంగాణా మార్గమే మన మార్గం", 'ఈ స్వాతంత్ర్యం నకిలీది"* (Yeh azadi jhooti hai). కొమింటర్న్ ఏడవ మహాసభలో ఆమోదించబడిన జాతీయ సంఘటన విధానం యిప్పుడు, యుద్ధానంతరం, ఫాసిజం పరాజయం అనంతరం పనికిరానిదని రణదివే భావించాడు. కానైతే, జాతీయ స్వాతంత్ర్యం కోసం పోరాటం, కాంగ్రెస్ జాతీయ బూర్జువా నాయకత్వం జనాన్ని మోసగించి, బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో రాజీపడదంతో కొనసాగింది. అందుకని, ఆయన, కొమింటర్న్ ఆరవ మహాసభలో ఆమోదించిన విప్లవ పోరాట విధానానికి తిరిగి మారాలని అంటే, జాతీయ బూర్జువా వర్గంతో పోరాడాలి గాని, దానితో ఐక్యం కాకూడదని వాదించాడు.

కానైతే, పై విధానానికి తోడ్పాటును సంపాదించేందుకు కుట్రదారీ, ముఠాదారీ పద్ధతులను అనుసరించడం జోషిని అత్యధికంగా బాధించింది. ఆయన సహచరులు కూడా చాలామంది అదే విధంగా భావించారు. వారు తర్వాత తమ స్మృతుల్లో తదనుగుణంగా రచించారు.

పి.సి.జోషి జాతీయ బూర్జువా వర్గపు పాత్రపట్ల పార్టీ నూతన నాయకత్వ అంచనాతో ఏకీభవించలేక పోయాడు. బూర్జువావర్గం మొత్తంగా సామ్రాజ్య వాదానికి అనుకూలంగా మారిందన్న విషయాన్ని జోషి ఆమోదించలేదు. ఆయన యిలా అన్నాడు.

> ఈ పొరపాటు భావం మన సైద్ధాంతిక వెనుకబాటు తనానికి, వ్యక్తిగత తత్వానికీ సాక్ష్యం. పెట్టుబడిదారీ విధానపు సాధారణ సంక్షోభశకంలో ఒక వర్గంగా బూర్జువా వర్గపు ప్రగతిశీల విప్లవాత్మక పాత్రని గురించి కమ్యూనిస్టు ఎలాంటి భ్రమా కలిగి వుండకూడదనడం తప్పనిసరి... వలసవాద దేశాల్లో, అన్నింటికంటె ముఖ్యంగా, ఎంత అజ్ఞాని అయినప్పటికీ ప్రధానంగా ఏ కమ్యూనిస్టు బూర్జువావర్గాన్ని దాని నాయకత్వ విభాగం రాజీకివెళ్ళే తరుణంలో శ్రామికవర్గం, ఆ రాజీని

నివారించలేనంతగా బలహీనంగా యింకా ఉన్నప్పుడు ఒక్క ముఠాగా పరిగణించకూడదు. [4]

జోషి 1949, జనవరి 27న పార్టీ నుండి బర్తరఫ్ చెయ్యబడ్డాడు. పార్టీ భద్రతకు ఆయన ప్రమాదకారిగా పరిగణించబడ్డాడు. 'ఆయన తన రాజకీయ సంస్కరణవాదంపట్ల కపటంగా పట్టువిడవడం లేదనీ, కార్మికవర్గాన్ని బూర్జువా వర్గం చేతుల్లోకి పోయేందుకు అదే విధంగా కపటంగా ప్రయత్నిస్తున్నాడనీ, ఆయనపైన ఆరోపణ చెయ్యబడింది. ఆయన పార్టీ మహాసభ(1948) నాటి నుంచి, దాన్నుంచి బయటపడాలని చిత్తశుద్ధితో ప్రయత్నిస్తున్నట్లు రుజువు చేసేందుకు ఏమీ చెయ్యలేదు. ఇతరులనుంచి నేర్చుకునేందుకు ఆయన నమ్రతనూ చూపలేదు...' పార్టీ పొలిట్ బ్యూరో తన తీర్మానంలో దేశం అంతటా పార్టీ సభ్యుల్ని, పి.సి.జోషి క్షీణత నుంచి పాఠాలను అధ్యయనం చెయ్యమనీ, పార్టీ జెండా చుట్టూ సమీకృతులు కమ్మనీ పేర్కొంది. తద్వారా అన్ని రంగాల్లోనూ అది మార్క్సిజం లెనినిజం సూత్రాలను నిలబెడుతుందని చెప్పింది. లొంగుబాటు దారులను, అస్థిరులు లేక అపవాదులు వేసేవాళ్లను శాంతపరచేందుకు అది నిరాకరిస్తుంది. విప్లవానికి ముందుకుపోయే తన మార్గంలో తనకి ఎదురయ్యే ప్రతి ఒక్క అడ్డంకినీ అది పక్కకి నెట్టేస్తుంది. [5]

ఆయన మీద అలాంటి నిందారోపణలు చెయ్యబడినప్పటికీ, ఆ దశ అంతట్లోనూ, జోషి ఎన్నడూ తన స్వంత ముఠాను గానీ, ప్రత్యర్థి పార్టీని గానీ ఏర్పాటుచేసే ప్రయత్నం చెయ్యలేదు. 1949 ఆగస్టు 4 న పశ్చిమ బెంగాల్ పార్టీ కార్యదర్శి వర్గానికి తను ప్రతికూల పార్టీని ప్రారంభిస్తున్నానంటూ వచ్చిన ఆరోపణను ఖండిస్తూ యిలా రాశాడు:

ప్రతి ఒక్క నిజాయితీగల కమ్యూనిస్టు జీవితం కంటె పార్టీని ఎక్కువ

---

4. పి.సి.జోషి, *వ్యూస్ నెం. 1: టు కామ్రేడ్స్ ఎబ్రాడ్ అండ్ బి.టి. రణదివే-అండర్ ది రెడ్ బేనర్*, శివ్‌పూర్, హౌరా, మే 1950, పుట. 39-40.
5. పి.సి.జోషి తొలగింపుపై పొలిట్‌బ్యూరో తీర్మానపు సంగ్రహం, 1949, జనవరి 27, ఫైల్ నెం. సి.పి.ఐ.1951/49, *ఆర్కైవ్స్ ఆఫ్ కాంటెంపరరీ ఇండియా*, జె.ఎన్.యు..

ప్రియమైనదని భావిస్తాడని క్షుద్రారోపకులకి కూడా తెలుసు. మన పార్టీ శత్రువులు వాళ్ళు చెయ్యగలిగినదేదీ మన పార్టీ ఐక్యతను ఎన్నడూ భగ్నం చెయ్యలేదన్న విషయాన్ని యింకా నేర్చుకోవాలి. పార్టీ చివరకు అందరు ఆరోపకులనూ, అణచివేతదారులనూ, సిసలైన స్వాతంత్ర్యం కోసమూ, ప్రజల ప్రజాస్వామ్యం కోసం పనిచేసే మన ప్రజలను సంఘటితంచేసి జయప్రదంగా చెల్లాచెదరగొట్టేస్తుందనీ ఆ సంఘటనే స్పష్టమైన, ఆరోగ్యకరమైన, సంతోషకరమైన, సఫలమైన జాతీయ జీవనాన్ని నిర్మిస్తుందనీ వాళ్లింకా తెలుసుకోవాలి.[6]

1949 డిసెంబరులో పి.సి.జోషి కమ్యూనిస్టు పార్టీ నుంచి చివరకు బహిష్కరింప బడ్డాక, తన బహిష్కరణపట్ల ఆయన మానసికంగా బాగా దెబ్బతిన్నాడు. ఆయన యీ విషయాన్ని పత్రికల వార్త ద్వారా తెలుసుకోవడం సైతం ఆయన్ని మరింతగా బాధించింది. తన పత్రికా ప్రకటనలో ఆయన యిలా అన్నాడు: "తప్పుడు విధానం మూలంగా మరింత ఎక్కువ ఆచరణాత్మక అపజయాలు, మరింత ప్రబలమూ, సూత్రరహితమూ అయిన విధానం విశ్వాస పూరితులూ, చిత్తశుద్ధి కలిగిన పార్టీ సభ్యులను తొలగిస్తుంది. అలాంటి వారిలో నేనొకడినని చెప్తున్నాను". 1950 ఫిబ్రవరి 18న తన బహిష్కరణకు వ్యతిరేకంగా కేంద్ర కార్యదర్శి వర్గానికి విజ్ఞప్తి చేశాడు:

> నాలాగే మీరూ తెలుసుకోవాలి, కేంద్ర కమిటీకి వ్యతిరేకంగా కంట్రోల్ కమిషన్‌కు అప్పీల్‌చేసే (విజ్ఞప్తి చేసే) అధికారాన్ని పార్టీ ప్రణాళిక నాకు యిచ్చిందన్న విషయం మీరు తెలుసుకోవాలి. జిత్తులమారి పద్ధతిలో, మీరు మీ పెద్దదేకాని, అపవిత్రమైన కోర్కెను తెలుసుకునేందుకు పూర్తిగా ఒక ఏడాది పట్టింది.
>
> మీరెంత ప్రయత్నించినా, మీ యువబృందం చేస్తున్న నేరాన్ని నేను తిరిగి చేసేలా నన్ను రెచ్చగొట్టలేరు. వాళ్ల నేరం పార్టీని చీల్చటం, ప్రతికూల కుతంత్రాన్ని ప్రారంభించడం. నేను నా పార్టీ పాఠాన్ని చాలా

---

6. పి.సి.జోషి, *వ్యూస్ నెం. 1:* పుట. 48.

బాగా నేర్చుకున్నాను. పార్టీకి నా విధేయత చాలా అధికం, మీ పట్ల మీరు పార్టీకి ఏమి చేశారన్న విషయంపట్ల నా పవిత్ర పార్టీ కోపం చాలా ఎక్కువ.

మీ యితర నేరాలతో బాటు, పార్టీ సంఘపు ప్రతి ఒక్క సూత్రాన్నీ మీరెలా, ఎందుకు అధిగమించారో, నా పార్టీ సహజసిద్ధ హక్కులను సూత్రవిరుద్ధ కుతంత్ర, కపట నిరంకుశోద్యోగిగా వ్యవహరించి, పార్టీ అధికారాన్ని దుర్వినియోగం చేసి, పార్టీ ప్రణాళికను లెక్కచెయ్యక, నా వంటి ఒక పాత పార్టీ సభ్యునికి స్వతస్సిద్ధంగావున్న హక్కులను నిరాకరిస్తూ, పార్టీ యావజ్జీవితంలో ఎన్నడూ చెయ్యబడని విధంగా మీరు చేసిన నేరాలకు మొత్తం పార్టీ ముందు తప్పక సమాధానం చెప్పుకోవలసి వస్తుంది. అలాంటి రోజు వస్తుంది. నాకు ఎలాంటి సందేహము లేదు. నేనీ విషయాన్ని పూర్తి బాధ్యతతో, నా గుండెమీద నా చేతిని పెట్టుకొని సుదీర్ఘంగా, నెమ్మదిగా ఆలోచించిన మీదట చెప్తున్నాను.[7]

ఈ ఉత్తరం పార్టీపట్ల పి.సి.జోషికి వున్న ప్రేమకి నిదర్శం. పార్టీ ఆయన జీవితం, ఆయన మనఃపూర్వకంగా పార్టీని ప్రేమించాడు. అది పెంపొందాలనీ, నూతన భారతదేశ నిర్మాణం కోసం జాతీయ రాజకీయాల్లో స్థానాన్ని సృష్టించాలనీ కోరుకున్నాడు. తన జీవితం చివరి దశలో సైతం ఆయన యువకామ్రేడ్లకి యిలా చెప్తూ ఉండేవాడు, "తల్లి పొరపాటు చేసినా ఆమెని వదిలిపోనట్లే మీరు కూడా పార్టీని వదల్లేరు." బహిష్కరణ ద్వారా భగ్నం చేయబడినా, ఆయన పార్టీకి విధేయంగా వున్నాడు, ప్రతికూల గ్రూపుని ఏర్పాటు చెయ్యడాన్ని లేక పార్టీని విభజించడాన్ని ఆయన వ్యతిరేకించాడు. తన జీవితకాలమంతటా ఆయన ఒంటరివాడు, తనలో తను సంఘర్షణ పడుతూ, తనవిధానం గురించి వ్యూహం గురించీ చర్చిస్తూ వుండేవాడు. తనే నిర్మించిన అది వికసించేలా పోషించిన పార్టీ నుంచి ఆయన ఎన్నడూ దూరం కాలేదు.

---

7. పి.సి.జోషి, *వ్యూస్ నెం. 1:* పుట. 48.

1948 దశ ఆయన్ని పూర్తిగా నాశనం చేసింది. ఆ బాధ చాలా గాఢమైనది. చాలా కాలం తర్వాత 1968లో ఆ సంవత్సరాలను గురించి ఆయన రాశాడు.

> 1948-50 సంవత్సరాలు నా జీవితంలో చాలా ఉపయోగకరమైనవి. 1936-48 సంవత్సరాల అనుభవం సానుకూల మైనది కాగా, 1948-50 సంవత్సరాల అనుభవం ప్రతికూలమైనది. యావత్తు పార్టీ సుదీర్ఘంగా సాహసం కలిగించగా, అదే ఐక్యతతో నేను తన్నులు, తిట్లు తినవలసి వచ్చింది. పార్టీ సైద్ధాంతిక పరిపక్వత, అలాగే నాది కూడా. 'నేర్చుకునేందుకు', పార్టీ పురోగమిస్తున్న దేశభక్తియుత, ప్రజాస్వామిక శక్తుల మైత్రితో, పార్టీని నిర్మించే సమస్యలను పరిష్కరించి, అగ్రశ్రేణి పద్ధతిలో పనిచేసేలా చేసేందుకు మరో మార్గంలేకపోయింది.

చాలాకాలం తర్వాత పునరాలోచించే క్రమం పార్టీ సాధారణ సభ్యుల్లో ప్రారంభమైంది. బి.టి.రణదివే వైపు మారిన చాలామంది కామ్రేడ్లు పొరపాటు పథంలో ఉండిపోయారు. వారిలో కొంతమంది తమ సంశయాన్ని వెల్లడించి యిలా అన్నారు. "ఇప్పుడే స్వాతంత్ర్యాన్ని సాధించిన దేశానికి యీ నూతన విధానం తగినదా అన్న విషయాన్ని గురించి తీవ్రంగా పరిగణించి వుండాల్సింది".[8] 1948లో నూతన నాయకత్వంతో పూర్తిగా కలిసిఉన్న సత్యపాల్ డాంగ్ చాలాకాలం తర్వాత గతం గురించి యిలా అన్నాడు. "చారిత్రక దినమైన (ఆగస్టు15,1 947)ను గురించి జోషీ అంచనా సత్యానికి చాలా సన్నిహితమైనది. అది నిలిచివుంటే, జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వాన వున్న తొలి స్వతంత్ర భారతప్రభుత్వ పట్ల సి.పి.ఐ. వైఖరి పూర్తిగా వ్యతిరేకంగా ఉండేది కాదు. బహుశా అది విమర్శనాత్మకంగా సానుకూలంగా ఉండేది."[9]

కామ్రేడ్లలో అత్యధిక సంఖ్యాకులు విధానం మారిన తర్వాత పార్టీతో వున్నారు, జోషీకి తోడ్పాటు యివ్వలేదు, కాని పార్టీలోపల సంచలనం ఉంది.

---

8. మణికుంతలా సేన్, రచన పుట 184.
9. సత్యపాల్ డాంగ్, పి.సి.జోషిని గురించి ప్రకటించబడని వ్యాసం ఏప్రిల్, 2001న రచింపబడింది.

వారిలో దాదాపు అందరూ కమ్యూనిస్టు ఉద్యమంలోకి "పి.సి.జోషి అద్భుత మానవీయ వ్యక్తిత్వపు ఆకర్షణీయ పరిణతి కారణంగా" తీసుకురాబడ్డారు. అందుచేత "డాంగేతో రణదివే సంపూర్ణ అవకాశవాద కలయిక మూలంగా జోషీని తొలిగించేందుకు కఠోర చర్య మూలంగా వాళ్లు సహజంగా కలవర పడ్డాడు..."[10]

జోషి తీసివేత పార్టీకి ఏ విధంగా సహాయం చేస్తుందని నిఖిల్ చక్రవర్తి భూపేష్‌గుప్తాని అడిగినప్పుడు, భూపేష్ సమాధానం తనవంటి, నిఖిల్‌వంటి పలువురు కామ్రేడ్ల సందిగ్ధ భావాన్ని వెల్లడించింది. భూపేష్ యిలా అన్నాడు.

> జోషి తీసివేత మనలో చాలా మందికి వ్యక్తిగతంగా నిజంగా చాలా పెద్ద దెబ్బ. కాని పార్టీలో అధిక సంఖ్యాకులు జోషీ విధానం తప్పుని ఆలోచిస్తే జోషికి అనుకూలంగా నిలబడటం అతని విధానానికి తోడ్పాటని తప్పుగా అర్థం చేసుకోబడేది. నా స్వీయానుభవం నుంచి రాజకీయ నాయకులు ఎంత నిర్దయగా ఉండగలరో నాకు తెలుసు. కాని, నువ్వూ, నేనూ శ్రామికవర్గానికి చెందని వర్గాల వాళ్ళం. జోషి పట్ల మన అనుబంధం మన వ్యక్తిగత వర్గసిద్ధాంతానికి సాఫల్యం కాదు.[11]

కమ్యూనిస్టు పార్టీ నిషేధింపబడింది. ఎంతో మంది కామ్రేడ్లు జైళ్లలో పెట్టబడ్డారు. చాలామంది కామ్రేడ్లు అండర్‌గ్రౌండ్(రహస్యజీవితం)లోకి వెళ్లారు. రెండేళ్ళ వామపక్ష సాహస విధానం ఆచరణలో పార్టీని నాశనం చేసింది. బెంగాల్ పార్టీ ప్రఖ్యాత మహిళా నాయకురాలు మణికుంతల సేన్ తన స్మృతుల్లో యిలా రాసింది.

> సమ్మె కార్మికుల చేతుల్లోని శక్తివంతమైన సాధనమన్న విషయాన్ని 1946, జులై 29నాటి విజయవంతమైన సమ్మె నిరూపించింది. అనవసరమైన సమ్మె పిలుపులు యివ్వబడినప్పుడు, ఆ ఆయుధం ఎలా మొద్దు బారుతుందో, 1949 మార్చిలో దేశవ్యాప్త రైల్వేసమ్మెకు పిలుపు ఇచ్చినప్పుడు రుజువైంది. ఆ పిలుపునిచ్చిన ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్

---

10. నిఖిల్ చక్రవర్తి సంకలనం, మెయిన్‌స్ట్రీమ్, ఆగస్టు 6, 1981.
11. పైదే.

ప్రతిస్పందన ఏమీ పొందలేకపోయింది.[12]

జోషి కాలంలోని కమ్యూనిస్టులు కలకత్తాలోని ట్రామ్, బస్సు కార్మికుల్లో ఒక ప్రబలశక్తి. సమ్మె పిలుపు ఎప్పుడు యివ్వబడినా, వాళ్ల ప్రతిస్పందన వెంటనే జరిగేది. కాని, యీ దశలో కార్మికులు సమ్మెలో చేరేందుకు సంశయిస్తున్నారు. ఆ రోజుల్లో యివ్వబడిన నినాదాల మూలంగా రైతులు తప్పుదారి పట్టించబడ్డారని చాలామంది భావించారు. రైతు ఉద్యమం ఒక్క తెలంగాణాలో తప్ప అంతటా దివాళా తీసిందని భావించారు. బొంబాయిలోని కామగార్ మైదానంలో విద్యార్థులు తమ అఖిల భారత మహాసభగా గుమిగూడారు. వాళ్లని పోలీసు రక్షణ వలయాన్ని ఛేదించమని చెప్పారు. పోలీసులు కాల్పులు జరిపారు, చాలామంది గాయపడ్డారు. అదేవిధంగా, కలకత్తాలో, మహిళా ఊరేగింపు పైన పోలీసులు 1949 ఏప్రిల్ 27న కాల్పులు జరిపారు. నలుగురు మహిళా కామ్రేడ్లు లతిక, ప్రతిభ, గీత, అమీయ ఈ కాల్పుల్లో మరణించారు. ఏప్రిల్ 28 నుంచి కలకత్తా జైళ్లలోని రాజకీయ ఖైదీలు యీ మారణకాండకి వ్యతిరేకంగా నిరాహార దీక్ష చేశారు.

ఆ రెండేళ్లూ అండర్‌గ్రౌండులో వున్న కామ్రేడ్లు ప్రత్యేకించి ఉక్కిరిబిక్కిరి అయ్యారు. దాని అర్థం వంట చెయ్యడం, భోజనం చెయ్యడం, నిద్రించడం, కొరియర్లు చెయ్యడం, మాట్లాడుకోవడం, కామ్రేడ్ల బహిష్కరణ గురించి తీర్మానాలు చెయ్యడంతప్ప మరేమీ లేదు. పి.సి.జోషికి ఎవరు సన్నిహితులుగా వున్నారని తెలుసుకునేందుకుగాను వెతుకులాట సైతం వాతావరణాన్ని కలుషితం చేసింది. 1950 ఆరంభంలో పార్టీ కామ్రేడ్లు వామపక్ష వేర్పాటువాద విధానపు వైఫల్యాన్ని గ్రహించనారంభించారు. వామపక్ష సాహసికత్వపు రెండేళ్ల తర్వాత, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం పార్టీ రక్షణకు పూనుకొని, అది ఊబి నుంచి బయట పడేందుకు తోడ్పడింది. ఈ విషయంలో పి.సి.జోషి కీలక పాత్ర వహించాడు. 1949 డిసెంబరులో ఇండియన్ సైన్స్ కాంగ్రెస్‌కి హాజరయ్యేందుకు కలకత్తాకు వచ్చిన ప్రొఫెసర్ జె.డి.బెర్నాల్ ద్వారా రజనీ పామీదత్తుకి బి.టి.రణదివే విపత్కర విధానం గురించి, తన

---

12. మణికుంతలా సేన్, రచన పుట 186.

అభిప్రాయాలను గురించి తను రాసిన లేఖను పంపాడు. 1950 జనవరి 13న విదేశీ కామ్రేడ్లకు తన లేఖలో జోషి ఒక చోట యిలా రాశాడు. "దయచేసి మా కేంద్ర నాయకత్వం 'విప్లవం' గురించి ఎంతగా మాట్లాడిందో, కాని, భారీ సమ్మె కార్యక్రమం గురించి ఒక్క ఆత్మ విమర్శనాత్మక సమీక్షను చేయలేదో, కనీసం తగిన వర్ణనాత్మక వివరణను సైతం ఎలా యివ్వలేదో గమనించండి."

కొమింటర్న్ స్థానంలో వచ్చిన కొమిన్‌ఫర్మ్ 1950లో తన పత్రికలో శాశ్వత శాంతి కోసం, ప్రజల ప్రజాస్వామ్యం కోసం అనే సంపాదకీయాన్ని అందులో ప్రస్తుత పరిస్థితిలో సి.పి.ఐ. రాజకీయ పంథా పొరపాటుదని సూచించింది. భారతదేశంలోని ప్రజాస్వామ్య శక్తులు జాతీయ బూర్జువా వర్గం, కార్మిక వర్గం, ధనిక, బీద రైతుల ఐక్య సంఘటనను, ప్రజాస్వామిక విప్లవాన్ని పూర్తి చేసేందుకై ఏర్పాటు చెయ్యాలని పేర్కొంది. సంపాదకీయం ప్రధానంగా జోషి దృక్పథాన్ని ప్రతిబింబించింది. 1950లో జరిగిన ప్రత్యేక ప్లీనరీ సమావేశంలో ముందుగా రణదివే నాయకత్వం నుంచి తొలగించ బడ్డాడు. తెలంగాణ పోరాట కీర్తి కలిగిన చంద్ర రాజేశ్వరరావు నూతన పార్టీ ప్రధాన కార్యదర్శి అయ్యాడు. 1949 అక్టోబరు విప్లవం అనంతరం చైనాకు పెరుగుతున్న ప్రశస్తి ఫలితంగా 'చైనా విధానమే మన విధానం' అనే నినాదం ముందుకు వచ్చింది. కానైతే, జరిగిన నష్టం చక్కబెట్టరానిదిగా కనిపించింది. ఆ రెండు సంవత్సరాల్లో పార్టీ సభ్యత్వం 90,000 నుంచి సుమారు 9,000 కు పడిపోయింది. ఇప్టా(అఖిల భారత ప్రజా నాట్యమండలి), ప్రగతిశీల రచయితల సంఘాల ద్వారా పార్టీకి ఆకర్షింపబడిన కళాకారులు, మేధావులు రచయితలు, నెమ్మదిగా పార్టీకి దూరమైపోయారు.

పార్టీ నాయకత్వంలో మార్పు వచ్చినప్పటికీ, పార్టీ రాజకీయ విధానంలో చెప్పుకోదగిన మార్పు రాలేదు. ఇండియా చైనాలోని ఒకవ్యాపార ప్రతినిధిగా, అర్ధవలసవాద రాజ్యంగా, 'నెహ్రూ సామ్రాజ్యవాదపు పెంపుడు కుక్క'గా పరిగణించడం కొనసాగింది. ఈ కథనం అప్పట్లో బీజింగ్‌లో జరిగిన ఆసియా కార్మికవర్గ మహాసభ పత్రాల్లో పునర్వ్యచింపబడింది. తెలంగాణా పోరాట నాయకత్వం కేంద్రపార్టీ నాయకత్వంలోకి రావడం వినాశకర, వేర్పాటువాద విధానం ఓ కొత్త రూపంలోకి రావడాన్ని కొనసాగించింది. 'చైనా నమూనా'

రష్యన్ మార్గాన్ని మార్చింది. రణదివే కాలంలో కార్మిక వర్గానికి కాక రైతాంగానికి ప్రత్యేక స్థానం యివ్వబడింది. పాలక బూర్జువా వర్గం, గతంలో మాదిరిగా, సామ్రాజ్యవాదపు ప్రయోజనాలను ప్రత్యేకించి బ్రిటిష్ సామ్రాజ్య వాదులను సేవిస్తున్నట్లు పరిగణింపబడింది.

జోషి ఎల్లప్పుడూ సర్దార్‌పటేల్, నెహ్రూల మధ్య తేడాలను దృష్టిలో పెట్టుకునేవాడు. ఆయన బూర్జువా వర్గాన్ని ఏకశిలగా పరిగణించలేదు. ఆయన నెహ్రూ అంటే మంత్రముగ్ధుడైనట్లు, పెట్టీ బూర్జువా వ్యక్తి అన్నట్లు చాలామంది దురన్వయం చేసుకున్నారు. కానైతే, పి.సి.జోషి జవహర్‌లాల్ నెహ్రూ పట్ల విమర్శనారహిత, ప్రస్తుతికి ఎన్నడూ అనుకూలుడుకాడు. నిజానికి, 1949 అక్టోబరులో అమెరికాకి నెహ్రూ యాత్ర హేతువును బహిర్గతంచేసే జాతివ్యాప్త ప్రచారం ఎందుకు జరగలేదని జోషి రణదివే నాయకత్వాన్ని ప్రశ్నించాడు. అదే సమయంలో, వారి వితండ వైఖరి భారత కమ్యూనిస్టుల్ని 'జాతీయ రాజ్యాన్ని నిర్మించడంలో సానుకూల, నిర్మాణాత్మక పాత్రని పాటించడంలో'[13] నివారించిందని ఆయన భావించాడు. ఇది కాంగ్రెస్‌లో కమ్యూనిజం వ్యతిరేకతని సజీవంగా ఉంచింది. కమ్యూనిస్టులు అప్రయోజక శక్తికారు. అందుచేత, వారి ప్రాతికూల్యం 'నెహ్రూనీ, కాంగ్రెస్‌లోని యితర మధ్యేవాదుల్నీ కాంగ్రెస్ మితవాదుల ఎత్తుగడలను పట్టించుకోక, పాలకపార్టీగా కాంగ్రెస్‌లోని సాంప్రదాయిక కాంగ్రెస్ వ్యతిరేక ప్రతికూల భూస్వామ్యశక్తుల్ని క్రొత్తగా ఏర్పడిన స్వతంత్ర రాజ్యానికి స్థిరత్వం యిచ్చేందుకు నడిపింది.[14]

ఆయన యీ విషయం కూడా గుర్తుచేశాడు. "కొత్తగా ఏర్పాటు చెయ్యబడిన స్వతంత్రరాజ్యం అన్ని క్రియాశీల జాతీయ శక్తుల సహకారంపైన, ప్రత్యేకించి సాంప్రదాయిక వామపక్షం మీద కూడా ఆధారపడలేదు. కాని, నూతన రాజ్యపు నాయకుల్లో నిరంకుశ శక్తి కోసం సూత్ర విరుద్ధ దురాశని పెంచలేక పోయిన తామే లంచగొండులుగా తయారై, యితరులను లంచగొండులుగా

---

13. పి.సి.జోషి, 'ఎ సెల్ఫ్-క్రిటికల్ కమ్యూనిస్ట్ ఎవల్యూషన్', మెయిన్‌స్ట్రీమ్, మే 29, 1965.
14. పైదే.

చేసే అవధి లేని అవకాశాలు కల్పించే, భూస్వామ్య, తదితర అభివృద్ధి నిరోధక ప్రయోజనాలతో సంయోగమయ్యారు.[15] నిజానికి, 1949 అక్టోబరు 1 నాటి ప్రజావిప్లవం తర్వాత మావో సేటుంగ్ ప్రభుత్వాన్ని గుర్తించాలన్న డిమాండును ముందుకు తేనందుకు జోషి రణదివే దశలోని నాయకత్వాన్ని ఆక్షేపించాడు. నెహ్రూని సామ్రాజ్యవాదపు ఆజ్ఞను ఉల్లంఘించి చైనాను ఒక మిత్రరాజ్యంగా పరిగణించాడని ఆ నాయకత్వం నెహ్రూని 'సామ్రాజ్యవాద తొత్తు'గా చాటింది.

అజయ్ ఘోష్, ఎస్.ఎ.డాంగే, ఎస్.వి.ఘాటేల నాయకత్వాన అధిక సంఖ్యలోగల నాయకత్వ విభాగం తెలంగాణా విధానాన్ని సవాలు చేసింది. వాళ్ళు తమ సంయుక్త స్థానాన్ని 3 పి-డాక్యుమెంట్ పేర(ముగ్గురు నాయకుల అండర్ గ్రౌండ్ పేర్లు 'పి' అనే మాటతో ప్రారంభమైంది) ఒక పత్రం పంచారు. ఆ పత్రం కూడా భారతదేశ స్వాతంత్ర్యం అసత్యమైనదిగా, నెహ్రూ ప్రభుత్వం వాళ్ళు తమ సంయుక్త సామ్రాజ్యవాదంతో సహకరించే బూర్జువా వర్గపు, భూస్వాముల ప్రయోజనాలను స్థిరపరుస్తోందనీ ఆరోపించింది. ఆ పత్రం సాయుధపోరాట పంథాను కూడా బలపరచింది. అయితే, ఇక్కడ ఒక తేడా ఏమిటంటే, భారతదేశం రష్యన్ పంథాని, చైనా పంథాని కాక భారతీయ పంథానే అనుసరించాలన్నది.

పి.సి.జోషి రెండు పంథాలనీ వ్యతిరేకించాడు. భారత స్వాతంత్ర్యం బూటకమైనది కాదనీ, అది సజీవ వాస్తవికత అన్నదీ ఆయన వైఖరి. జాతీయ స్వాతంత్ర్యాన్ని రక్షించేందుకూ, దేశపు సమగ్రతను పరిరక్షించేందుకై పరిశ్రమచేసే జనానీకపు ప్రయోజనాల్ని కాపాడి ముందుకు తీసుకెళ్ళేందుకూ కాంగ్రెస్, కమ్యూనిస్టులు, యితర ప్రజాస్వామిక శక్తులతో జాతీయ సంఘటన ఏర్పాటును బలపరించే తన వాదనని ఆయన ముందుకు తెచ్చాడు. ఆ జోషి విధానం 1951లో కలకత్తాలో జరిగిన ప్రత్యేక పార్టీ మహాసభలో ఆమోదించ బడలేదు. అక్కడ ముగ్గురు రహస్యనాయకుల పత్రం ఆధారంగా పార్టీ విధానం ఆమోదింపబడింది. చంద్ర రాజేశ్వరరావు పార్టీ ఉన్నత స్థానం నుంచి తొలగించబడ్డాడు. అజయ్ ఘోష్ పార్టీ నూతన ప్రధాన కార్యదర్శిగా

---

15. పైదే,

ఎన్నుకోబడ్డాడు. పార్టీ నుంచి కామ్రేడ్ పి.సి.జోషి బహిష్కరణ పొరపాటనీ, న్యాయవిరుద్ధమనే ప్రకటనతో 1951, జూన్ 1న ఆయన పార్టీలోకి తిరిగి చేర్చుకోబడ్డాడు. రణదివే అనంతర నాయకత్వంలో భాగస్వామి అయ్యేందుకు పి.సి.జోషి నిరాకరించాడు. ఎందుకంటే "అజయ్ ఘోష్, ఎస్.ఎ.డాంగేలు రణదివేకి, ఆయన విధేయులకీ, ఆయన నాకు, ఇతరులకు చేసిన దానినే చేయ ప్రయత్నించారు". బి.టి.రణదివే తనకి చేసిన అవమానం, అమర్యాద, అపనిందలు జోషి మనస్సులో తీవ్రమైన మచ్చను నిలిపినా, బి.టి.రణదివేకీ, అతని సహచరులకీ పార్టీ ఒకప్పుడు చేసిన దుర్వ్యవహారాన్నీ పార్టీ నాయకత్వం నుంచి తొలగించడాన్నీ తలచుకుని జోషి బాధపడ్డాడు. అప్పట్లో జరుగుతున్న ముఠా తగువులను 'పార్టీ ఐక్యత' పేరుతో సైద్ధాంతిక సమస్యలను తిరిగి కూడగట్టుకోవడాన్ని ఆయన ఆమోదించలేదు.

నాయకత్వంలో అధికారపు పోరునుంచి జోషి తప్పుకున్నాడు, కాని తన సొంత పద్ధతిలో సైద్ధాంతిక పోరు కొనసాగించాడు. ఆయన 1951 చివర్లో తన తొలిదశను గడిపిన అలహాబాద్‌కి తిరిగి వెళ్లాడు. అక్కడ ఒ.పి.సంగల్ సంపాదకత్వంలో 'ఇండియా టుడే' మాస పత్రికను ప్రారంభించాడు. ఈ పత్రికను ప్రారంభించడానికిగల కారణాన్ని ఆయన వివరించాడు. పార్టీ నాయకత్వం తన పత్రాలను పంచిపెట్టలేదని ఆరోపించాడు.

1951 లో పార్టీ కేంద్ర కార్యాలయంలో జరిగిన ఇంటర్వ్యూలో ఆయన యిలా చెప్పాడు. "ప్రజానీకపు సమస్యల మీద నా అభిప్రాయాలను తెలియ పరచాలని నేను కోరుకుంటున్నాను. వాళ్ల క్రమశిక్షణ గురించి మాట్లాడితే నా రక్తం జ్వలిస్తుంది. చట్టబద్ధమైన పార్టీ పత్రిక లేనంతవరకూ నేనాపని చేస్తూనే వుంటాను. కేంద్రం తను చట్టబద్ధమైన పత్రికను వెలువరించలేనని చెప్తే, వారు కోరితే, అన్ని ముఖ్యభాషల్లోనూ నేను నా పత్రికను ప్రకటిస్తాను. అంతే కాదు, నేను నా జీవన వ్యయాన్ని సంపాదించుకునేందుకు, నేనొక జర్నలిస్టునైనా అవుతాను, లేకపోతే యూనివర్సిటీకి వెళ్తాను. నేను మొదటిదాన్నే కోరుకుంటున్నాను"[16]. పార్టీ అధికారిక విధానాన్ని నేరుగా ఖండించకుండా

16. సి.పి.ఐ ఫైల్ నెం.1951/47, ఆర్కైవ్స్..., జె.ఎన్.యు..

ఆయన సాధారణ పార్టీ సభ్యులు, సానుభూతి పరులకోసం తన భావాలను చాలా స్పష్టంగా వివరించాడు, దానితో వాళ్లకి విలువైన ఆలోచనా పద్ధతులను సూచించాడు. 1951 నవంబరు సంచికలో ఇండియా-చైనా-సోవియట్ సంబంధాల ప్రాముఖ్యం గురించి ఒక వ్యాసం రాశాడు. దానిలో యిలా వాదించాడు:

> ఇండియా-చైనా-సోవియట్ ఆర్థిక సహకారం పరస్పరం మిక్కిలి లాభదాయకమైంది, అది మన ఆహార సంక్షోభాన్ని పరిష్కరించగలదు, మన దేశాన్ని పారిశ్రామికం చేసేందుకు సాధనాలను పొందేందుకు అవకాశం కల్పిస్తుంది. భారతదేశ సమృద్ధికి, ఆసియా స్వాతంత్ర్యం, ప్రపంచ శాంతికి మార్గం ఇండియా-చైనా-సోవియట్ సంబంధంలోనే వుంది. రష్యన్ విప్లవపు 34 వ వార్షికోత్సవంలో, చైనా విముక్తి రెండవ వార్షికోత్సవానికి ఒక నెల తర్వాత, మన నాలుగేళ్ల మౌంట్ బాటెన్ పథకపు అనుభవానంతరం, చిరకాల సామ్రాజ్యవాద సాలెగూడు నుంచి బయటపడే ప్రత్యామ్నాయ ఈగ లాగా ఈ మార్గం నిలుస్తుంది.

అఖిల భారత స్థాయిలో ఎన్నికల్లో కాంగ్రెస్ విజయం అనంతరం, జోషి కాంగ్రెస్ పాలన ప్రభావాలను గురించిన విమర్శనాత్మక నిశిత మదింపుచేసి, కాంగ్రెస్ విజయం ప్రాధమ్యం గురించి వామపక్ష శక్తులను తక్కువ అంచనా వెయ్యవద్దని చెప్పాడు. ఆయన 1952 ఫిబ్రవరి-మార్చి *ఇండియాటుడే* సంచికలో యిలా రాశాడు:

> ప్రత్యర్థిని నిర్ధారిత సత్యాలద్వారా, తెలిపిన పరిస్థితుల ద్వారా మనం కోరిన దానికంటె అధికతర బలహీనుడని ఊహించుకోవడం సరైన నినాదాలను, పోరాట పద్ధతులను ఎంపిక చేసుకునేందుకు ఎన్నడూ దారి చూపవు. కాంగ్రెస్ జనంలో అధిక సంఖ్యాబలాన్ని యింకా కలిగి వుందని గుర్తించడం అవసరం. అప్పుడు మాత్రమే వామపక్షం కాంగ్రెస్ చేత తప్పుదారి పట్టించబడిన జనాన్ని సన్నిహితుల్ని చేసుకునే చర్యలను తీసుకోగలుగుతుంది. పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద ప్రభుత్వాల మధ్య బ్రిటిష్ పాలకవర్గం, సుదీర్ఘ అనుభవం ద్వారా, అత్యంత అనుభవశాలి,

పరిణత, కపట నాయకత్వం అయింది. అదేవిధంగా, కాంగ్రెస్ నాయకత్వం అత్యంత అనుభవం కలిగిన రాజకీయ నాయకత్వం. వలసవాద బూర్జువా తూర్పు రాజ్యాల్లో పైకి నెట్టివేయ బడింది. ఈ ఎన్నికల సమయంలో, తను యింకా బూర్జువా జాతీయవాద భావజాలాన్ని ఉపయోగించగలనని, విజయవంతంగా, తన సామ్రాజ్యవాద సంబంధాలను, విదేశీ పెట్టుబడికి తన అమ్మకాలను తన ప్రజావ్యతిరేక విధానాల్ని కప్పిపుచ్చుకోగలనని అది వెల్లడించింది. మన దేశంలో కాంగ్రెస్ సంఘం యింకా అత్యంత విస్తృతంగా సంఘటితం చెయ్యబడిన రాజకీయ యంత్రమని, అది యింకా జాతీయ సంప్రదాయాలను వాడుకొని ప్రజలను ఓటింగు బూతులకు రప్పించ గలదనీ మనం గుర్తించడం అవసరం. ఈ నిజమైన, కాని పాలకవర్గపు బలంతో కూడిన అనాహ్లాదకర అంశాలను గుర్తించడం అవసరం. దాన్ని విజయవంతంగా ఓడించే శక్తికి యిది అవసరం.

అదే వ్యాసంలో ఆయన యిలా కొనసాగించాడు: "ఒక విస్తృతమైన ఐక్య సంఘటన నిర్మించబడినప్పుడే, ప్రగతిశీల పార్టీ రహిత ప్రముఖ వ్యక్తుల్ని దానిలోకి కలుపుకోవడం, దానికి గౌరవాన్ని తీసుకురావడం సాధ్యమవుతుంది. ఆ విధంగా మాత్రమే ప్రగతి నిరోధక జీవనోపాధి మార్గస్తుల్ని వేరు చెయ్యడం సాధ్యమవుతుంది. ప్రజానీకంలోని కాంగ్రెస్ వ్యతిరేక అంసతృప్తిని వాళ్లు సొమ్ము చేసుకోవడాన్ని నివారించగలుగుతుంది." ఇదే విషయాన్ని ఎన్నికల అనుభవం రుజువుచేసింది.

ప్రజాస్వామిక శక్తుల ఐక్యసంఘటన అవసరాన్ని గుర్తించే రాజకీయ అవగాహన జోషీకి వుంది. ఆ సందర్భంగా ఆయన పార్టీ యేతర వామపక్ష శక్తుల ప్రాముఖ్యానికి సదా విలువనిచ్చేవాడు. అదే వ్యాసంలో ఆయన యిలా అన్నాడు: "పార్టీ యేతర వామపక్ష శక్తులు మన జాతీయ జీవనంలో చాలా ముఖ్యమైన భాగం, వారి ఉత్సాహపూరిత సామీప్యం ప్రజాస్వామిక సంఘటన అభివృద్ధిని అధికంగా బలపరుస్తుంది."

జోషీ యీ పత్రికని వామపక్ష ప్రజాతంత్ర ఐక్యతను బలపరచేందుకు ప్రారంభించాడు. పార్టీ క్రమశిక్షణను ఉల్లంఘించకుండా తను యీ పని

చేస్తున్నట్లు ఆయన భావించాడు. కాని 11 నెలల తర్వాత పార్టీ నాయకత్వం ఆయన్ని ఆ పత్రికను మూసెయ్యమని చెప్పింది. అప్పుడాయన కాన్పూర్‌కు మారాడు, అక్కడ చాలా తీవ్రమైన శ్రద్ధతో కార్మికవర్గ కృషిని చేపట్టాడు. అక్కడ త్వరలోనే జిల్లాపార్టీ యూనిట్ కార్యదర్శి అయి, పార్టీ చేపట్టే వివిధ కార్యకలాపాల్ని సంఘటితం చెయ్యడంలో మునిగాడు. ఆయన కమ్యూనిస్టులు, సోషలిస్టులు, పెద్ద సంఖ్యలో అర్జున్ అరోరా నాయకత్వంలోని కమ్యూనిస్టేతరుల్తో కూడిన సమైక్య కార్మిక సంఘాన్ని ఏర్పాటు చేశాడు. తరవాత ఆయన జౌళి కార్మికుల 84 రోజుల సమ్మె కమిటల్ని ఏర్పాటు చేసేందుకు అండర్ గ్రౌండ్‌లోకి వెళ్లాడు. అప్పుడు అర్జున్ అరోరా, ఎస్.ఎం.బెనర్జీ తదితరులు ఆ ఉద్యమ అగ్రస్థానంలో వున్నారు. అండర్ గ్రౌండ్‌లోనూ, బయటా రెండు బృందాలూ సమ్మె కార్యక్రమాన్ని విజయవంతమయ్యేందుకు

పి.సి.జోషి 1952 డిసెంబరులో, వియన్నాలో జరిగిన ప్రపంచ శాంతి మహాసభకు భారత ప్రతినిధివర్గ సభ్యుడుగా మొట్టమొదటిసారి విదేశానికి వెళ్లాడు. ఆయన తిరుగు ప్రయాణంలో, బ్రాడ్లీ మొదలగువారిని, ప్రత్యేకించి రజనీ పామీదత్తునీ కలిసేందుకు లండన్ వెళ్లాడు. రజనీ పామీదత్తు పి.సి.జోషి చెప్పిన విషయాలను శ్రద్ధగా విని, ఆయనకి యిలా చెప్పాడు:

> భారత కమ్యూనిస్టు పార్టీ(సి.పి.ఐ)లో సైద్ధాంతిక బలహీనత ఒక సంయుక్త సమస్య. అజయ్ అపజయాలు పొందివుండవచ్చు.... కాని అతను యథార్థవాది, అతను మారుతాడు, యింకా చాలా మంది మారుతారు. నువ్వు యిప్పటిదాకా నీ మస్తకాన్ని నిలుపుకున్నావు. నీ తలని నువ్వు మరింత బాగా వినియోగించేందుకు మరింత ఓర్పుగా నేర్చుకో. లెనిన్ రచన (రాజీ గురించి) చదువు. నీ సాయుధ కామ్రేడ్లతో వ్యవహరించే విషయంలో లెనిన్ వివేకాన్ని నేర్చుకో.[17]

1955లో ఆంధ్రలో కమ్యూనిస్టుల ఓటమి, కాంగ్రెస్ ఆవడి సమావేశంలో 'సోషలిస్టు తరహా సమాజం'ను ఎంపిక చేసుకోవడం, ఒక దాని తర్వాత మరొకటి వచ్చింది. కృశ్చేవ్ శకం కూడా ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో

---

17. పి.సి.జోషి, *'రజనీ పామీదత్ అండ్ ఇండియన్ కమ్యూనిస్ట్స్'*, చూడండి.

మార్పు తెచ్చింది. ఇదంతా కమ్యూనిస్టుల్లో పునరాలోచనా క్రమానికి తోడ్పడింది. సిసలైన కమ్యూనిస్టుగా జోషి నిశ్శబ్ద వీక్షకుడుగా ఉండిపోలేదు. భారత కమ్యూనిస్టులకు వ్యూహం, ఎత్తుగడలను గురించి చర్చించేందుకు ఒక సభాస్థలాన్ని ప్రారంభించేందుకు చొరవ తీసుకున్నాడు. అజయ్ డాంగే రాజకీయ విధానం విషయంలో జోషి సంతోషంగాలేదు. అది కూడా రణదివే విధానం లాంటిదే అని భావించాడు, కాని, అది హింసాత్మక సాహసికతను వదిలేసింది. అదే రకం కాంగ్రెస్ వామపక్ష విధానం పాత పార్లమెంటరీ విధానానికి రూపాంతరం. రెండవ పంచవర్ష ప్రణాళిక, బాండుంగ్ మహాసభ, చైనా, సోవియట్ యూనియన్లతో మైత్రిని బలీయం చేసుకోవాలన్న నెహ్రూ మొగ్గుచూపడం ఆ దేశాల కమ్యూనిస్టు నాయకత్వం నెహ్రూ నాయకత్వంలో భారతదేశంపట్ల వహించిన వైఖరి యీ పరిస్థితిలో ప్రత్యేకించి వాస్తవికతను అర్థం చేసుకోవడంలో అసంబద్ధత, అవగాహనా లోపం వుందని జోషి భావించాడు.

జాతీయ పరిస్థితులు జోషి విధానాన్ని ప్రమాణీకరించింది, కాని, పార్టీ ఎన్నడూ లాంఛనప్రాయంగా దాన్ని ఆమోదించలేదు. కొరియన్, ఇండో–చైనా ఒప్పందాల విషయంలో ఇండియా సానుకూల వైఖరిని అవలంబించింది. పంచశీల పత్రం మీద సంతకం చెయ్యడం, అలీకోద్యమం, నెహ్రూ సోవియట్ యూనియన్ యాత్ర 1955లో బుల్గానిన్, కృశ్చేవ్‌ల భారత యాత్ర మొదలైనవి శాంతి, ప్రగతుల ఒక నూతన శకాన్ని ప్రవేశపెట్టాయి.

1956లో పాల్‌ఘాట్ పార్టీ మహాసభ సి.పి.ఐ.చరిత్రలో ఒక ప్రముఖ ఘట్టం. అది భారత స్వాతంత్ర్య ప్రాముఖ్యాన్ని అర్థంచేసుకుంది. అలాగే నెహ్రూ ప్రభుత్వపు ప్రగతిశీల విదేశాంగ విధానాన్ని, పి.సి.మహలానొబిస్ భారతీయ ప్రణాళికలో సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక చొరవని సి.పి.ఐ. అర్థం చేసుకుంది. భారత స్వాతంత్ర్యాన్ని గుర్తించడం, సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ బూర్జువా వర్గంతో ఐక్యతా, పోరాటాల విధానం దృష్ట్యా పి.సి.జోషి ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాడు. పార్టీలో రాజకీయ కలయికల్లో ఒక ప్రధాన మార్పును సూచించింది. ఆయన ఆ రోజులనుగురించి వ్యంగ్యంగా జ్ఞాపకం చేసుకున్నాడు. "ప్రధాన కార్యదర్శి అజయ్ ఘోష్, బి.టి.రణదివేతో

కలిసి, తనొక స్తంభాన్ని, నేనొక స్తంభాన్ని పట్టుకోగా, కదలటానికి వీల్లేని తాడుపై నడిచాడు." పి.సి.జోషి దృష్టిలో పాల్ఘాట్ మహాసభ నియమప్రకారం పార్టీని సరైన మార్గంలో పెట్టింది, కాని, దాని పాదాలు వామపక్ష ప్రత్యేక శిఖా శృంఖలాల్లో యిరుక్కున్నాయి.

కమ్యూనిస్టుల్లోని పిడివాదంతో జోషి రాజీపడలేక పోయాడు. జాతీయ రాజ్యాన్ని నిర్మించడంలో సానుకూల నిర్మాణాత్మకపాత్ర వహించకుండా వారిని ఆ పిడివాదం అడ్డుకుందని ఆయన భావించాడు. ప్రభుత్వపు బలహీనతలపై కేవలం విమర్శకుల పాత్ర నిష్క్రియాత్మక పాత్ర. నిర్మాణాత్మక పాత్ర కాదు. ఈ వైఖరి కమ్యూనిజం వ్యతిరేకతను కాంగ్రెస్‌లో సజీవంగా వుంచిందని సైతం ఆయన భావించాడు.

పాల్ఘాట్ మహాసభ అనంతరం వచ్చిన మిక్కిలి పెద్ద ఒంటరి ఘటన 1957లో వచ్చిన సాధారణ ఎన్నికలు, కేరళలో తొలి కమ్యూనిస్టు ప్రభుత్వ స్థాపన. ఆ ఘటనని స్వాగతిస్తూ, పి.సి.జోషి విశదమవుతున్న రాజకీయ పరిణామాలపట్ల స్వయం విమర్శనాత్మక వాస్తవిక అంచనా జరుగుతుందని భావించాడు. కాని అది జరగలేదు. ఆ ప్రభుత్వం పడగొట్టబడ్డాక, 1968లో ఆయన ఆ గత అంశాన్ని గురించి యిలా రాశాడు. "మనలోని శాఖాతత్వం మితవాద దాడి నుంచి కేరళ ప్రభుత్వాన్ని కాపాడుకునేందుకు తోడ్పడలేదు."

జాతి నిర్మాణం గురించి కమ్యూనిస్టుల ప్రతికూల వైఖరి ఫలితానికి పరోక్ష కారణం మితవాద శక్తుల పెరుగుదల. 1950ల తొలి సంవత్సరాల్లోనే మితవాద వైఖరి ప్రమాదాన్ని గమనించగలిగిన కొద్ది మంది కమ్యూనిస్టుల్లో ఆయన ఒకడు. నెహ్రూ మరణానంతరం జోషి యిలా రాశాడు:

> గతాన్ని చూసినప్పుడు, మనది స్వయం న్యాయబద్ధ తెగింపు దృక్కోణం అని నాకు యిప్పుడనిపిస్తోంది. ఇదొక రాజకీయ పొరపాటు, యిది మితవాదుల దృష్టిలో విధిరాత. స్వాతంత్ర్యానంతర భారతదేశంలో జాతీయ ప్రజాతంత్ర శక్తుల విభజనకిది మార్గాన్ని సులభంచేసింది.[18]

---

18. పి.సి.జోషి, ది నెహ్రూ లెజసి: ల సెల్ఫ్ క్రిటికల్ కమ్యూనిస్ట్ ఎవల్యూషన్' *మెయిన్ స్ట్రీమ్*, 29 మే, 1965.

జోషి పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. 1958లో కేంద్ర పార్టీ కార్యాలయంలో పనిచేసేందుకు ఢిల్లీకి తిరిగి వచ్చాడు. తన వ్యక్తిగత నోట్సులో ఆయన తర్వాత యిలా రాశాడు. "నేను నా జీవితంలో చేసిన మిక్కిలి పెద్ద పొరపాటు, పార్టీ కేంద్రకమిటీకి నేను ఎన్నుకోబడ్డ తర్వాత, ఉత్తరప్రదేశ్‌లో ప్రజాఉద్యమంలో పనిచేసేందుకు, జిల్లా, స్థానిక నాయకులను విద్యావంతుల్ని చేసేందుకు బదులు నేను పార్టీ కేంద్ర కార్యాలయంలో పనిచేసేందుకు ఆమోదించటం". ఆయన పార్టీ పత్రిక న్యూఏజ్ సంపాదకత్వం వహించనారంభించాడు, దాన్ని ఆయన 1962 దాకా కొనసాగించాడు. ఆయన ఢిల్లీలో సంతోషంగా లేడు. రాజకీయ ఖైదీలా భావించాడు. తరచు తను విశ్వసించని విషయాలను రాయవలసి వచ్చింది. పార్టీలోని ముఠా తత్వాన్నీ, పెత్తందారీ తనాన్నీ ఆయన విమర్శనాత్మకంగా చూసేవాడు.

పి.సి.జోషి బాగా ప్రాశస్త్యం కలిగిన జర్నలిస్టు. ఆయన తన రాజకీయ జీవితాన్ని అంతర్జాతీయ, జాతీయ, స్థానిక సమస్యలపై నిరంతరం రచనలు చేస్తూ, పార్టీ రహస్య కాలంలో సైతం పలు పత్రికలను ప్రచురించాడు. వాటిద్వారా ఆయన ప్రజానీకాన్ని చేరుకున్నాడు. న్యూ ఏజ్‌సంపాదక దశలో, వాస్తవాలను స్వయంగా చూసేందుకూ, దేశంలో జరుగుతున్న సంఘటనలను కళ్లారా చూసేందుకూ దేశవ్యాప్తంగా ఆయన యాత్రలు చాలా చేశాడు. జబల్‌పూర్ కలహాలను గమనించిన ఆయన రిపోర్టు 1961, మార్చి 12న న్యూ ఏజ్‌లో ప్రధాన వ్యాసంగా ప్రచురించబడింది. అది జన సంఘశక్తుల వల్ల కలిగే ప్రమాదాలను గురించి భవిష్యసూచకంగా ఉంది. కాంగ్రెస్ వ్యతిరేక రాజకీయ దశలో ఆ శక్తులకు వామపక్ష శక్తులు ఎలాంటి ప్రాధాన్యం యివ్వలేదు. పరిస్థితిని పరిశీలించేందుకు ఆయన స్వయంగా అక్కడికి వెళ్లాడు. అక్కడ ఆయన విభిన్న జీవిత పద్ధతులు కలిగిన, వివిధ రకాల రాజకీయ అభిప్రాయాలు కలిగిన జనాన్ని కలిశాడు. ఆ కలహాల ప్రధాన కుట్రదారులు, ఏర్పాటుదారులూ మతవాద శక్తులనీ, ప్రత్యేకించి జనసంఘ్ అనీ ఆయన గమనించాడు. పోలీసులు కేవలం చూస్తూ ఊరుకున్న స్థితిలో ముస్లింలను జనసంఘ్ నిరాధర హింసితులను చేసింది. ఆయన జనసంఘ్ వారి హిందీ దినపత్రికను చూశాడు. వదంతులు కల్పించిన వాళ్లు పి.టి.ఐ.(ప్రెస్ ట్రస్ట్

ఆఫ్ ఇండియా)ని ప్రభావితం చేశారు. ఆ కలహాలను గురించి పి.టి.ఐ. పూర్తిగా కల్పిత చిత్రాన్ని యిచ్చింది. అలాంటి కలహాల నుంచి మతేతర శక్తులు పాఠం నేర్చుకోవాలని జోషీ కోరాడు. దానిని గురించి ఆయన యిలా రాశాడు.

> మన జాతీయ జీవితంలో దేశభక్తి పూర్వక, మత వ్యతిరేక లౌకికశక్తులు, యీ మధ్యప్రదేశ్ కలహాలు, రాబోయే దేశ వ్యాపిత ఎన్నికల కోసం జనసంఘ్ ఒక రాజకీయ రిహార్సల్‌గా సాగించిందన్న విషయాన్ని తెలుసుకుంటే యిదంతా వృథా అయ్యేది కాదు. జనసంఘీయులు ప్రజానుకూలతను సంపాదించేందుకు తాము హిందూ అధిక సంఖ్యాకుల రక్షణ శక్తి అనీ, ముస్లిం మైనారిటీని పాకిస్తాన్ పంచమాంగ దళమనీ, వగైరా వగైరాలు ప్రచారం చేశారు.[19]

చైనా భారతదేశం మీద దాడి చేసినప్పుడు, చైనా సైన్యం బొమ్డిలా దాకా కిందకి వచ్చినప్పుడు పార్టీ తీవ్రమైన సవాలును ఎదుర్కొంది. చైనాను సదా అతి గొప్ప మిత్రదేశంగా భావించిన నెహ్రూ ప్రభుత్వానికి అది పెద్ద దెబ్బ. అప్పటి రక్షణశాఖ మంత్రి అయిన కృష్ణమీనన్ రాజీనామా చేసేందుకు బలవంతం చెయ్యబడ్డాడు. పార్టీలో ఒక విభాగం చైనా చర్యను దాడిగా పరిగణించనందున పార్టీలో విభేదాలు ముమ్మరమయ్యాయి. ఆ దాడి జరిగిన అనంతరం చైనా సోవియట్ భేదాలు పార్టీలో ముందుకు వచ్చాయి. చైనాకు అనుకూలురుగా ఆరోపించబడిన కామ్రేడ్లు అధిక సంఖ్యలో అరెస్టు చెయ్య బడ్డారు. సైద్ధాంతిక విభేదాలు పార్టీలో ఎల్లప్పుడూ వున్నాయి. కాని, చైనా దాడి పార్టీ అంతర్గత పరిస్థితిని మరింత చెడగొట్టింది, ఒక సంక్షోభాన్ని సృష్టించింది. ఆ పరిణామాలతో కంగారు పడిన జోషి యిలా పేర్కొన్నాడు.

> ఆ దాడి చైనావాద పిడివాదులకు విశ్వాసపాత్ర విభాగం సైద్ధాంతిక రాజకీయ శిష్యప్రాయమైనదని వెల్లడించింది.తమ స్వంత పార్టీలో సాముదాయక అధికసంఖ్యాకుల విధానం భిన్నమైనదైనప్పటికీ,

---

19. న్యూ ఏజ్, మార్చి 12, 1961, జె.ఎన్.యు.

స్వదేశంలో అత్యధిక సంఖ్యాకుల అభిప్రాయం భిన్నమైనప్పటికీ, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వానగల ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం యొక్క సంయుక్త అభిప్రాయం భిన్నమైనప్పటికీ అలాంటి వామపక్ష విభాగం పార్టీని అంతర్గతంగా విచ్ఛిన్నం చెయ్యలేదు.

కానైతే, ఆయన యిలా భావించాడు. చైనా దాడి పార్టీలో వామపక్ష విరుద్ధ మెజారిటీ నిశ్చిత నాయకత్వం కార్యసాధకమైనదనీ, క్రమరహితమైనదనీ, నిష్ప్రయోజకమైనదనీ చైనాదాడి నిరూపించింది.[20]

పార్టీలో అతివాద వామపక్షం, వేర్పాటును సంకోచిస్తూ, ఎస్.ఎ.డాంగే బ్రిటిష్ ఏజెంటన్న ఆరోపణలు పార్టీ నాయకత్వాన్ని బలహీనపరుస్తాయన్న ఆశతో 'డాంగే లేఖలు'ను ప్రచురించింది. పార్టీలో తమ పలుకుబడి పెంచుకో గలుగుతామన్న ఆశతో ఆ పని చేసింది. చైర్మన్ పదవి నుంచి డాంగే ఐచ్ఛికంగా తప్పుకోవాలనీ, అది వామపక్షీయుల్ని నిరాయుధుల్ని చేస్తుందనీ, ఆ విధంగా సిసలైన సైద్ధాంతిక పోరాటానికి మార్గాన్ని సరిచేస్తుందన్నది జోషి వైఖరి. కానైతే, జోషి సలహా నిర్లక్ష్యం చెయ్యబడింది. నాయకుల్లో అత్యధిక సంఖ్యాకుల వేర్పాటు వాద, ఫెత్తందారీ వైఖరే యిందుకు కారణం, పార్టీలో చీలిక, సంస్థలోని అవాంఛిత వేర్పాటువాద శక్తులను తొలగిస్తుంది అన్నది వాళ్ల భావన. నైతిక ఆధారాల వల్లనే కాక, రాజకీయ కారణాల వల్ల కూడా యీ కార్యాచరణక్రమాన్ని పి.సి.జోషి తీవ్రంగా, గట్టిగా వ్యతిరేకించాడు. పార్టీ నాయకత్వం మెజారిటీ కలిగి వుండవచ్చునని ఆయనకి తెలుసు, కాని, కిందిస్థాయి పార్టీ సభ్యులు 1950 నుంచి రాజకీయంగా అవిద్యావంతులుగా ఉండిపోయారు. కాంగ్రెస్ వ్యతిరేక పిడివాదం మూలంగా వాళ్లు సహజ సిద్ధంగా కాంగ్రెస్ వ్యతిరేకులు. అన్ని సమస్యలకూ కాంగ్రెస్‌కు సంబంధించిన భావన మూలస్థానంలో ఉన్నందున, పార్టీ పతాకం చుట్టూ జనాన్ని సమీకరించడం అత్యంత సులభమార్గం. కానైతే, చివరికి పైకి వెళ్ళిపోయిన చాలామంది నాయకులు రాజకీయంగా వామపక్ష వేర్పాటు వాదులు కారు.

---

20. పి.సి.జోషి, 'ప్లీ ఫర్ ఎ పార్టీ కాంగ్రెస్ విత్ ప్రాపర్ ప్రిపరేషన్', సి.పి.ఐ జాతీయ కార్యవర్గ సమావేశం, జూన్ 26-జులై 2, 1963.

వాళ్లు ప్రధానంగా డాంగే వ్యతిరేకులు.

న్యూఢిల్లీలో 1964 ఏప్రిల్లో సి.పి.ఐ. జాతీయ కౌన్సిల్ సమావేశం నుంచి అల్పసంఖ్యాక విభాగం బయటకు వెళ్ళిపోవడంతో పార్టీ చీలింది. అదే సంవత్సరం ఆ గ్రూపు కలకత్తాలో సమాంతర పార్టీ మహాసభను ఏర్పాటు చెయ్యడంతో ఆ చీలిక నియమబద్ధం అయింది. నేషనల్ కౌన్సిల్ అధ్యక్షుడుగా డాంగే వుండటానికి జోషి తన అభ్యంతరాన్ని రిజిస్టరు చేశాడు. కాని, యీ సమస్య మీద 1964 డిసెంబరులో బొంబాయిలో జరిగిన సి.పి.ఐ.మహాసభలో యీ అంశం మీద తటస్థంగా ఉండిపోయాడు. కానైతే, ఆ మహాసభలో డాంగే తిరిగి ఆ పదవికి ఎన్నుకోబడటంతో, జోషి తన పేరును కేంద్ర కార్యదర్శి వర్గం నుంచీ, పార్టీ కార్యవర్గం నుంచీ ఉపసంహరించుకున్నాడు.

పార్టీ చీలిక ఆయనకి విపరీతమైన బాధ కలిగించింది. ఆయన తన డైరీలో యిలా రాసుకున్నాడు "ఆ అనుభవం హృదయ విదారకమైంది. ఎందుకంటే, మేము చేసిన నలభైఏళ్ళ సమిష్టికృషిని, మా జీవితకాలంలో నిర్మించిన దాన్నంతనీ మేమే స్మృతి హీనంగా నాశనం చేసుకుంటున్నాం. నా హృదయం ముందెన్నడూ లేనంత క్షీణించింది."

బొంబాయి మహాసభ అనంతరం, సి.పి.ఐ. నాయకత్వం ఎంతగా నచ్చచెప్పినా, ఒత్తిడి చేసినా, జోషి పార్టీ కేంద్రకార్యాలయంలో ఉండేందుకూ, ఎంత మాత్రం అక్కడ పనిచేసేందుకూ నిరాకరించాడు. ఆయన తన సభ్యత్వాన్ని ఉత్తరప్రదేశ్‌కి మార్పించుకున్నాడు. తనెక్కడ పార్టీపని చెయ్యాలో ఎంచుకునేందుకు తనకు హక్కు ఉందని ఆయన గట్టిగా భావించాడు. కాని, ఆయన ఉత్తరప్రదేశ్ పార్టీకి దాదాపు ఏ మాత్రం పనిచెయ్యలేక పోయాడు; ఆయన ఇంటి దగ్గర మంచంపట్టో లేదా శానిటోరియంలోనో ఉన్నాడు. అదే కాలంలో ఆయన చాలా చదివాడు, చాలా కాలంగా నిలిచిపోయిన ఆలోచన చేశాడు. అప్పుడే ఆయన కమ్యూనిస్టుపార్టీ చరిత్రను పరిశోధించే పనిని చేపట్టాలని నిర్ణయించుకున్నాడు.

జోషి తన పార్టీ జీవిత ఆరంభం నుంచీ శైశవ వామపక్ష తత్వంపైన పోరాడాడు. కానైతే, చైనాదాడి తర్వాత డి.ఐ.ఆర్ పేరిట వామపక్ష కమ్యూనిస్టు కామ్రేడ్ల డిటెన్షన్‌ని ఆయన గట్టిగా ఖండించాడు, వారి విడుదల

కోసం కృషి చేశాడు. చైనాదాడి అనంతరం, దేశంలో అలాంటి వేలాది కమ్యూనిస్టు నాయకుల్నీ, పార్టీ సభ్యుల్నీ అరెస్టు చేసినందుకు యూనియన్ హోమ్ మినిస్టరు గుల్జరీలాల్ నందా అరెస్టు చెయ్యబడ్డాడు. వాళ్ళ డిటెన్షన్ పార్లమెంటరీ ప్రజాస్వామ్య సూత్రంబట్టి విరుద్ధమైనదనీ, అది భారత రాజ్యాంగాన్ని ఉల్లంఘించడమనీ జోషి పరిగణించాడు. ఆ విషయంలో ఆయన యిలా వాదించాడు.

> హోం మినిష్టరు చట్టవిరుద్ధులనీ, ద్రోహులనీ ప్రకటించబడని ఒక రాజకీయ పార్టీ అభ్యర్థులను అరెస్టు చేయడం రాజకీయ ఔచిత్యమా, నైతిక ప్రవర్తనా? మరో సంగతి, ఉద్రిక్త పరిస్థితిలో సూత్ర బద్ధ రాజకీయ నాయకుడైన ఆయన అలా చెయ్యడంలో ఆయన తన దృక్పథానికి అనుకూలంగా వ్యవహరించి ఉండాల్సింది. ఎన్నికల తీర్పు ఆయన ఆరోపణను నిరాకరించింది. వామపక్ష కమ్యూనిస్టుల రాజకీయ విశ్వసనీయతను రుజువు చేసింది. కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థులు విజయవంతంగా ఎన్నుకోబడ్డారు. అంతేకాదు, కేరళ రాజ్యసభలో కాంగ్రెస్ కంటె మిక్కిలి పెద్ద పార్టీ అయ్యారు.[21]

జోషి రాజకీయాలు పార్టీ హద్దులను దాటి ముందుకు వెళ్ళాయి. ఆయన విస్పష్ట వాస్తవికతపై ఆధారపడిన, విశాల దృక్పథం కలిగిన అపూర్వ తరహా దేశభక్తుడు. ప్రధాన శత్రువును గుర్తించడంలో ఆయనకి స్పష్టమైన గ్రాహ్యశక్తి వుంది. ఆయన మాటల్లోనే, జాతి శాపం ఆ శత్రువు. ఆయన దృష్టిలో మితవాద నిర్మాణం ప్రధాన శత్రువు, ఆ సందర్భంలో యీ ప్రమాదాన్ని గుర్తించనందుకు సి.పి.ఐ.ఎంను నిస్సందేహంగా విమర్శించాడు. ఆయన యిలా సూచించాడు.

> సి.పి.ఐ.ఎం. నాయకులు, వారి అవగాహన దృష్ట్యా నన్ను అత్యంత మితవాదిగా, వాళ్లు పిలిచే మితవాద కమ్యూనిస్టు పార్టీ భాగస్వామిగా పేర్కొన్నారు. అయితే, నన్ను అత్యంత నిజాయితీ పరమైన, స్థిరమైన

---

21. పి.సి.జోషి, 'డేంజర్ సిగ్నల్ ఫర్ డెమక్రసి', *మెయిన్‌స్ట్రీమ్, ఆగస్ట్ 15, 1965.*

వ్యక్తిగా వర్ణించారు. నిజంగా భారతదేశంలో విప్లవాత్మక పరిస్థితిఉండి, సి.పి.ఎం. విప్లవాత్మక వాహినికి నాయకత్వం వహించివుంటే, నేను పశ్చాత్తప్తుడిని అయ్యేవాడిని. వాళ్ల శిబిరాన్ని పట్టుదలగా అనుసరించి వుండేవాడిని. నేను ఏ రోజున అయినా, ఎర్రజెండాని చేతపట్టుకొని, భారత విప్లవం కోసం పోరాడుతూ ప్రాణం అర్పించేందుకు ఇష్టపడతాను, మన సమైక్య పార్టీ జీవితంలో ఎగుడుదిగుళ్ల మూలంగా నా హృదయం దెబ్బతిని నెమ్మదిగా మరణించకుండా ఈ విషయాన్ని అర్థం చేసుకునే వివేకం నాకు లేకపోయింది. నాకాలాన్ని వినియోగించి ప్రస్తుతం నేను మూలకెక్కిపోయిన జాతీయ పురాతన పత్రాలను చదవడం సంతోషకరమైన పనికాదు. పాత పార్టీ పత్రాలను చదివి మనం ఎక్కడ పొరపాటు చేశామో, మనం మన పార్టీని ఎందుకు చీల్చామో, మన మందరం కలిసి మన శరీర రక్తంతో నిర్మించామో, మనం చెయ్యగలిగిన త్యాగాలన్నీ ఎలా చెయ్యగలిగామో తెలుసుకోవడం నాకిప్పుడు సంతోషం కలిగించే విషయం కాదు. మిక్కిలి నిస్వార్థ కృషి మరింత గర్వపూరితమైన కృషి చేసిన మరే యితర పార్టీ లేదు. [22]

తనని తను వ్యక్తీకరించడం ప్రారంభించిన రాజకీయ ధ్రువీకరణను ఆయన విశదపరచడం కొనసాగించాడు.

వివిధ రాజకీయ శక్తులు తమ మధ్య విభేదాలు వున్నప్పటికీ జీవితమే వాటిని రెండు ఖండాలుగా ఏర్పడేలా చేసింది. భారతదేశ భావి అభివృద్ధి కోసం వాంఛనీయ, అవాంఛనీయ మార్గం విషయంలో ప్రధానంగా ఆ ముఠాలు విడివడ్డాయి. అది ముందుకు పోయే మార్గానికి సంబంధించిన సమస్య, ఆనాటి సమస్య యధాపూర్వస్థితి, లేక సామాజిక మార్పు. [23]

ఇండియన్ కమ్యూనిస్టులు మితవాదశక్తుల ప్రధాన ఆరోపణను అర్థం చేసుకోవడంలో విఫలమైనారు. "ఇందిరా గాంధీ అన్ని రకాల కమ్యూనిస్టుల

22. పి.సి.జోషి, ఇండియన్ కాన్స్టిట్యూషన్ అండ్ సోషల్ ఛేంజ్', *న్యూ థింకింగ్ కమ్యూనిస్ట్*, ఫిబ్రవరి 15, 2001.
23. పైదే.

పైనా చాలా ఎక్కువగా ఆధారపడుతోంది. వాళ్లపట్ల సౌమ్యంగా వుంటోంది, ఆ విధంగా భారతదేశాన్ని సోవియట్ యూనియన్‌కి ఉపగ్రహంలా చేస్తోంది". రాజకీయ యుద్ధరంగంలో ప్రధాన శత్రువుల్లా గుర్తించడం, అటు తర్వాత సంభావ్య మిత్ర మండలిని సన్నిహితుల్ని చేసుకోవడానికి ఎంతో రాజకీయ చాతుర్యం అవసరం. ఇందిరాగాంధీ ప్రభుత్వపు స్వభావ నిరూపణవల్ల వామపక్షీయుల మధ్య భేదాల విస్తృతి ఏర్పడింది. ఆయనిలా వాదించాడు:

> ఇందిరా గాంధీ ప్రభుత్వం యొక్క భారత విదేశాంగ విధానం యీ క్రింది విషయాలకు తగిన రుజువు. జాతీయ బూర్జువా విభాగపు సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్రకి ఆమె క్రియాశీలంగా ప్రాతినిధ్యం వహిస్తుంది. మన దేశం మితవాద నాయకత్వం కింద ఉండేందుకు అనుమతిస్తే, అన్నింటి కంటె ముఖ్యంగా నయా వలసవాద ప్రమాదాన్ని చూసి అనుమతిస్తే దానివల్ల ఎంత ప్రమాదమో ఆమె ఆమోదించింది.[24]

సి.పి.ఐ, కాంగ్రెస్‌కి ప్రచ్ఛన్న ఏజెంటుగా పరిగణించబడింది. బొంబాయి పార్టీ మహాసభ నిర్ణయం ప్రకారం సి.పి.ఐ. ముస్లింలీగ్‌తో మైత్రిని వ్యతిరేకించింది. అదే సమయంలో మిగతా పార్టీలు, ముఖ్యంగా సి.పి.ఎం, కాంగ్రెస్ వ్యతిరేక సంఘటనను నిర్మించేందుకు దానిని బలపరిచాయి. 1965లో కేరళ అసెంబ్లీ ఎన్నికల్లో సి.పి.ఎం. భారీ విజయం సాధించింది. అదే ఎన్నికల్లో సి.పి.ఐ.స్వల్ప శక్తిగా మిగిలిపోయింది. ఆ ఫలితం సి.పి.ఐ. నాయకత్వాన్ని కుదిపివేసి, దాన్ని స్పష్టంగా కాంగ్రెస్ వ్యతిరేక స్థానానికి నెట్టింది. అందుకే అది సంయుక్త విధాయక్ దళ్ ప్రభుత్వాలతో కలిసేందుకు తన కాంగ్రెస్ వ్యతిరేక ప్రామాణికతను నిరూపించుకునేందుకు, జనసంఘ్‌కు తోడై నిలిచింది.

స్వల్పకాలిక రాజకీయ లాభాల కోసం లౌకిక వ్యతిరేక శక్తులతో మైత్రికి పూనుకోవడాన్ని జోషి వ్యతిరేకించాడు. 1967లో రాష్ట్రపతి ఎన్నికలో గాంధేయ లౌకికవాది అయిన జాకీర్‌హుస్సేన్ కంటె, జనసంఘ్ సానుభూతి పరుడైన కాకా సుబ్బారావుకు సి.పి.ఐ. ఎక్కువ ప్రాధాన్యమివ్వడాన్ని పి.సి.జోషి

---

24. పైదే.

ఆమోదించలేక పోయాడు. పలు రాష్ట్రాల్లో సాధారణ ఎన్నికల తర్వాత వాటిలో సంయుక్త విధాయక దళ్ మంత్రివర్గాలను ఏర్పాటు చేసేందుకు జనసంఘ్‌తో బాటు, ఇతర కాంగ్రెస్ వ్యతిరేక శక్తులతో చేతులు కలపడాన్ని ఆయన తీవ్రంగా విమర్శించాడు.

జోషి జాతీయ ప్రజాస్వామిక సంఘటన విషయంలో పార్టీ రాజకీయ విధానపు మలుపును గురించి కంగారు పడ్డాడు. స్వల్పకాలిక ఎన్నికల ప్రయోజనాలను సాధించేందుకుగాను సి.పి.ఎం, సి.పి.ఐ పార్టీలు తీసుకున్న వామపక్ష వైఖరిని ఆయన గమనించాడు. జోషికి మరో వైపున, దీర్ఘకాలిక దృక్కోణం వుంది. ఆయన దృష్టిలో మితవాద ప్రతిస్పందన అసలైన ప్రమాదం, దాన్ని ఆయన తొలి తీవ్ర శత్రువుగా పరిగణించాడు. దానితో ఎలాంటి రాజీ అయినా రాజకీయ అవకాశవాదంగా పరిగణించాడు.

కానైతే, ఆయన పార్టీలో ఒంటరివాడుగా చెయ్యబడ్డాడు. 1968లో జరిగిన పాట్నా పార్టీ మహాసభలో ఆయన ఒంటరితనాన్ని అనుభూతి చెందాడు. అనారోగ్యంగాఉన్నా, ఉత్తరప్రదేశ్‌నుంచి తాను ప్రతినిధిగా ఎన్నుకోబడినందున ఆయన పార్టీ మహాసభకి హాజరయ్యాడు. ఆయన మితవాద వ్యతిరేక సంఘటనను గురించి చేసిన పదిహేను నిముషాల ఉపన్యాసం చాలామంది ప్రతినిధులను ప్రభావితం చేసింది. జాతీయ పరిస్థితిని గురించి ఆయన విమర్శనాత్మక అంచనా మతవాద శక్తులమీద సర్వతోముఖమైన సత్వరదాడిని చెయ్యవలసిన సూచనను ముందుకు తెచ్చింది. దానితోబాటు సంకీర్ణ ప్రభుత్వ మంత్రివర్గాల్లో జనసంఘ్‌తో సంబంధాన్ని విచ్ఛిన్నం చేసుకోవాలని పిలుపు నిచ్చాడు. ఆయన సవరణకి 33 శాతం పైగా వోట్లు వచ్చాయి. ఆయన తన ప్రతికూల పత్రంతో నాయకత్వం నుంచి వేరుపడ్డాడు. ఆయన పార్టీ నేషనల్ కౌన్సిల్ నుంచి తొలగించబడ్డాడు.

పాట్నా మహాసభానంతరం కొద్దికాలానికి చెకోస్లోవేకియాలో వచ్చిన సంక్షోభం పి.సి.జోషిని సంక్షుభితం చేసింది. చెకొస్లోవాక్ కమ్యూనిస్టు పార్టీ నాయకుడైన డూబ్‌చెక్ ఒక కార్యాచరణ కార్యక్రమాన్ని రూపొందించాడు. స్టాలినిస్టు వారసత్వానికి స్వస్తిచెప్పి, చెకోస్లోవాక్ ప్రజానీకం జీవితంలో మార్క్స్, లెనిన్‌ల మానవీయ ప్రతిబింబాన్ని పునరుద్ధరించి, సోషలిస్టు వ్యవస్థ

ప్రజాస్వామిక పునాదిని బలపరిచేందుకన్నట్లు డూబ్‌చెక్ ఒక కార్యాచరణ పంథాను రూపొందించాడు. డూబ్‌చెక్‌ను విప్లవ వ్యతిరేకిగా అప్రతిష్ఠ పాల్జేసి, విప్లవ వ్యతిరేకిగా ఆయనను అరెస్టుచేశారు. సోవియట్ సైనిక దళాలు ఆ దేశానికి పంపించబడ్డప్పుడు. చెకోస్లోవేకియాపై సోవియట్ ప్రమేయాన్ని జోషి ఆమోదించలేదు. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 20వ మహాసభ అనంతరం "అది అతిపెద్ద పొరపాటు" అని వర్ణించాడు. ఆయన యిలా భావించాడు.

> ఇంతవరకు సోవియట్ యూనియన్‌లో సంశయ రహితంగా, ప్రదర్శ నాత్మకంగా రూపొందిన కమ్యూనిజం విశిష్టత, ఘనత యిప్పుడు ప్రమాదంలో వుంది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చైనీయులు తొలి తీవ్ర విభజనను కల్పించారు. అది కమ్యూనిజం మంచి పేరును, మానవాళి భవిష్యత్తును బాగా దెబ్బతీసి, సామ్రాజ్యవాదానికి నూతన జీవిత దశను సమకూర్చింది.

అదే వ్యాసంలో ఆయన యిలా అన్నాడు:

> సోవియట్ కమ్యూనిస్టు పార్టీని, ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలని సోవియట్ వైఖరిని, చెకోస్లోవేకియాలో దాని చర్యను చర్చించేందుకు సంప్రదింపుల అత్యవసర మహాసభను జరపమని డిమాండుచేసే నైతిక బాధ్యతను మన పార్టీ నాయకత్వం తప్పించుకోగలదా? అది కమ్యూనిజపు అత్యవసర లక్ష్యం.[25]

కానైతే, జోషి, సోవియట్ తన పొరపాటును సరిదిద్దుకున్న మార్గాన్ని ప్రశంసించాడు. ఆయన యిలా స్పష్టంచేశాడు. "లెనిన్ స్ఫూర్తి, బోధనలు నశించిపోలేదు, సరికదా అవి సజీవంగా, అదే సోవియట్ సంయుక్త పార్టీ నాయకత్వంలో అత్యంత క్రియాశీలంగా వున్నాయి." కాని, యీ పొరపాటు చైనీయులను మాదిరిగానే సోవియట్ యూనియన్‌ని అదే కుంచెతో మలిన పరుస్తాయి. అలాగే, అన్ని పెద్ద రాజ్యాలనూ, అది అమెరికా కావచ్చు లేక

---

25. పి.సి.జోషి, 'లెసన్స్ ఆఫ్ ద ఛెజ్ క్రైసిస్', నేషనల్ హెరాల్డ్, సెప్టెంబర్ 4, 1968.

సోషలిస్టు సోవియట్ యూనియన్ కావచ్చు, ప్రజా చైనా కావచ్చు, లేక ఇతర అలాంటి రాజ్యాలు కావచ్చు వాటిని అలాగే మలినం చేస్తాయి"[26] సరిగ్గా అదే జోషి పెద్ద విచారం.

పి.సి.జోషి బాగా అనారోగ్యంగావున్నా, ఆయన ఉత్తరప్రదేశ్ పార్టీ రాష్ట్ర సమితిలో వున్నాడు, రాబోయే రోజుల్లో ఆయన నాయకత్వంతో సంబంధంతో ఉండేందుకు ఆ సమితి సభ్యత్వం తోడ్పడింది. ఆ మీదట, అల్మోరా నైనిటాల్ ప్రాంతంలో పార్టీని సంఘటితం చేసేందుకు నిర్ణయించుకుని, అక్కడి కొండలకు వెళ్లడం ప్రారంభించాడు. ఆయనకి అది అత్యంత నూతనోత్సాహం కలిగించే ప్రాంతం, ఆయన దాన్ని యిలా జ్ఞాపకం చేసుకున్నాడు: "ఆ జిల్లాలకి నా వారం వారి ప్రయాణాలు, నన్ను తాజాగా, సజీవంగా ఉంచుతాయి." ఆ కొండ ప్రాంతాల దుర్దశని గురించీ, వెనుకబాటుతనం గురించి చెప్పాడు. ఉత్తరప్రదేశ్‌లోని స్వయం ప్రతిపత్తిగల అధికారాత్మక ప్రాంతాలుగా యీ కొండప్రాంతాన్ని మార్చి, ఆ స్థానిక ప్రజల చేతుల్లోకి అధికారం వచ్చేలా హామీ కల్పించాలి. ఆ కొండ ప్రాంతాల సమస్యలను వ్యక్తం చేసేందుకు ఒక ఉద్యమాన్ని కూడా ఏర్పాటు చేశాడు. 1970 లో ముందు చూపుతో యిలా పేర్కొన్నాడు:

> క్రియాశీల రాజకీయ వ్యక్తులేకాక, ఓ పెద్ద సంఖ్యలో ప్రాథమిక, మాధ్యమిక, కళాశాల ఉపాధ్యాయులు, వారేకాక మాజీ సైనికులు, మాజీ సైనిక అధికారులు, యీ కొత్త డిమాండును బలపరిచిన అసహాయ శూరులు యీ ఉద్యమపు కొత్త దశ ఉత్తరప్రదేశ్‌లోని ఎనిమిది కొండల జిల్లాల్లో అపూర్వమైన ప్రజా కదలిక అవుతుంది.[27]

ఈ కొండ ప్రాంతమంటే ఆయనకు గాఢమైన అనుబంధం, ప్రత్యేకమైన ప్రేమా వున్నాయి. ఆయన తన బాల్యంలో అక్కడ తిరిగాడు, ఎత్తు పల్లాలతో కూడిన ఆ ప్రాంతంలో తను పెద్దవాడయ్యేదాకా పర్యటించాడు.

---

26. పైదే.
27. పి.సి.జోషి, 'జస్ట్ డిమాండ్ ఆఫ్ గర్వాల్ అండ్ కుమన్', మెయిన్‌స్ట్రీమ్, డిసెంబర్ 12, 1970.

ఆయన బాల్య మిత్రుల్లో ఒకాయన ఒక ఆయుర్వేద వైద్యుడు. అల్మోరాకు కొన్ని మైళ్లదూరంలో ఓ పెద్ద స్థలాన్ని ఆయనకి యిచ్చాడు. ఆయన ఇష్టాలో చేర్చిన బలరాజ్ సహానీ బలరాజ్ దమయంతి ట్రస్టు స్థాపించాడు. అది జోషి చివరి శిశువైన హిమాలయన్ సోషలిస్టు ఆశ్రమానికి నిధి ఇచ్చింది. అది బిన్సార్ అడవి ప్రాంతానికి చేరువనవున్న సిర్కోట్ గ్రామంలో ఏర్పాటు చెయ్యబడింది. ఉత్తరప్రదేశ్ పూర్వ ముఖ్యమంత్రి హెచ్.ఎన్.బహుగుణ కూడా పి.సి.జోషికి యీ ప్రయత్నంలో ఎంతగానో తోడ్పడ్డాడు. అక్కడొక కుటీరం నిర్మింపబడింది. అది ఆయన జీవితంలో చివరి పథకం, తన స్వంత పట్టణంలో ఒక సోషలిస్టు ఆశ్రమాన్ని నిర్మించడం, ఆ కొండల ప్రాంతాన్ని రాజకీయంగా పునరుజ్జీవింప చెయ్యడం ఆయన తిరిగి తన మూలాలకి తిరిగి రావడం. హిమాలయాలతో ఆయన బంధం ఎన్నడూ ఛిద్రం కాలేదు.

ఆయన జీవితపు చివరి రోజులు ఉత్తరఖండంలో గడిచాయి. వామపక్ష ఉద్యమ చరిత్రకు సంబంధించిన ఒక పథకం మీద జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో ఆయన పని చేశాడు. భారతదేశంలో వామపక్ష ఉద్యమం గురించి పరిశోధించి సమాచార పత్రాలను కూడ గట్టేందుకు ఆయన కె.దామోదరన్ తో కలిసి పనిచేశాడు. పి.సి.జోషి జాతీయ ప్రాచీన పత్రాల పరిశోధనలో చాలాకాలం గడిపాడు. భారతదేశంలో కమ్యూనిజం 1917 –1947 గురించి తన కాలాన్ని దశాబ్దాలపాటు సాగదీశాడు. ఆయన సమాచారం సేకరించేందుకు బెర్లిన్, మాస్కోలకి యాత్రలు చేశాడు. దేశం లోపల పాత కామ్రేడ్లను కలుసుకుని పాత ఫైళ్లను, కరపత్రాలను, మేగజైన్లను పోగుచేశాడు. జోషీకి చరిత్రపట్ల గాఢమైన ఆసక్తి వుంది, అలాంటి ఆసక్తి కొద్దిమంది కామ్రేడ్లకి మాత్రమే వుంది. అందుకే ఆయన బహుళ సంఖ్యలో సమాచార పత్రాలు పాత సమాచారం. అతిపాత రోజుల నుంచి 1950 దాకా కొమింటర్న్, సి.పి.ఐ, వామపక్ష పార్టీల సమాచారం, సాహిత్యం సేకరించే ప్రయత్నం చేశాడు. ఉద్యమ చరిత్ర నిర్మాణానికి మిక్కిలి విలువైన, ఆయా బాధ్యతల్లో వున్న కామ్రేడ్లు, తమకి 1948–1950 మధ్య పార్టీ ఆదేశించిన, పార్టీ అప్పగించిన క్రమశిక్షణను కామ్రేడ్లు ఉల్లంఘించి ఆ సమాచారాన్ని నాశనం చేశారు. “అందుకే నా సమాచార సేకరణ కర్తవ్యం ఊహాతీతమైనంత

క్లిష్టం అయింది" అని రాశాడు జోషి.

జోషి రాజకీయాల్లోకి వచ్చివుండకపోతే, మన కాలపు అత్యుత్తమ చరిత్రకారుడు అయ్యుండేవాడు. ఆయన విశిష్టమైన కృషి చేశాడు. చారిత్రక అవగాహన విషయంలో అదొక గొప్ప కృషి. 1857 తిరుగుబాటును గురించిన ఆయన విశ్లేషణ, ఆ తిరుగుబాటును గురించిన జానపద సాహిత్య సేకరణ విశిష్టకృషి. ఆ తిరుగుబాటును గురించి 'జాతీయ తిరుగుబాటు' గా మార్క్స్ అవగాహన జోషిని నిస్సంశయంగా ప్రభావితం చేసింది. 1857 తిరుగుబాటు శతజయంతి సంవత్సరం సందర్భంగా ఆయన ఎన్నో వ్యాసాలు ప్రకటించాడు. దానిలో యీ అంశం మీద భారతీయ మరియు విదేశీ ప్రసిద్ధ రచయితల, విమర్శకుల, చారిత్రక రచయితల వ్యాసాలు జోడించబడ్డాయి. జోషి రాసిన వివరణాత్మక భూమిక చరిత్రాత్మకమైనది.

> 1857 తిరుగుబాటుకి సంబంధించిన వివాదాలతో, అది మరుగు పరచబడింది. ఆ వివాదాల విషయంలో చర్చించేందుకు వివరించేందుకు నేను ప్రయత్నించాను. నేను వృత్తి సంబంధమైన చరిత్ర కారుడినికాను. అందుకని, సుదీర్ఘమైన ఉదాహరణలద్వారా పాత పద్ధతిలో నేను మాట్లాడవలసి వచ్చింది. ఆధునికశైలి వాళ్లని నేను ఖంగారు పెట్టి వుంటే, నన్ను సమర్థించుకునేందుకు ఒకే మార్గం వుంది. అది యువ రచయితలకు పాత గ్రంథాలు వగైరాలనుంచి యివి తేలిగ్గా వాళ్లకి లభ్యం కావు. పత్రాలను నేను వాళ్లకి సరఫరా చేస్తున్నాను.

1857 తిరుగుబాటును గురించిన జానపద గీతాల సేకరణ జానపద కళల రూపాలను గురించిన ఆయన ప్రత్యేక మెచ్చుకోలుతో ప్రారంభమైంది. ప్రజానీకాన్ని సమీపించేందుకు వాటిని 'సాంప్రదాయిక మాధ్యమాలు'గా పరిగణించాడు. ఆయన హృదయం (గుండె)సమస్య ఆయన జీవితాన్ని అంతం చేసింది. లేకుంటే మనం చరిత్ర కారుడైన జోషీని అలాంటి విలువైన, విశ్లేషణాత్మకమైన మరిన్ని రచనలు చేసిన జోషీని చూసివుండేవాళ్ళం.

జోషి చరిత్రకారుడు, జర్నలిస్టు, కాని, అన్నింటికంటె ముఖ్యంగా, ఆయన ప్రధానంగా మొత్తం ప్రజానీకానికి అంకితమైన రాజకీయవ్యక్తి. ఆయన

వాస్తవంగా ప్రజల మనిషి. జాతీయ, అంతర్జాతీయ ఘటనలు ఆయన మనస్సులో సంచలనాలు కలిగించాయి. తన యింటి ముందు మత కలహాలైనా, లేక చైనా దాడిగాని, చెకోస్లోవేకియా సంక్షోభంగాని, బంగ్లాదేశ్ విముక్తి పోరాటంగాని వాటితో ఆయన ఎల్లప్పుడు విశ్రాంతి రహితంగా భావించేవాడు. వాటికి ప్రతిస్పందించి, ఆ ప్రాంతాలకి స్వయంగా వెళ్లలేనందున, తన రచనల ద్వారా వాటికి ప్రతిస్పందించేవాడు. ఆయన ఎన్నడూ మౌన వీక్షకుడుగా ఉండలేకపోయాడు. తీవ్రమైన అనారోగ్య సమస్యలవల్ల 64 ఏళ్ల వయస్సులో ఆయన గుండె దెబ్బతిన్నప్పటికీ, ఈశాన్య దిశలోని కొండ ప్రాంతాల్లో తురా, దౌకీ పర్యటించాడు. తూర్పు పాకిస్తాన్ సరిహద్దునుదాటి, సంక్షోభదశలో వాళ్లకి ఎంతో కొంత సహాయం చేసేందుకు ప్రయత్నించాడు. ఆయన పర్యవేక్షణలో పశ్చిమబెంగాల్లో ఓ చిన్న బృందం సంఘటితమైంది. మేఘాలయ, మైమెన్‌సింగ్ సరిహద్దు ప్రాంతాలకు వెళ్లేందుకు ఆయన వెంట సునీల్ మున్షీ, ప్రసూన్ మజుందార్ వగైరాలు వెళ్లారు. మేఘాలయ దక్షిణ, తూర్పు ప్రాంతాల్లో ఏర్పడిన సైనిక శిబిరాల గుండా ఆయన గెంతి, తప్పుకొని, ఎగరవలసి వచ్చింది.

సునీల్ మున్షీ జోషిని విశేషంగా ప్రశంసిస్తూ ఆనాటి స్మృతులు రాశాడు. ఆ క్లిష్ట పరిస్థితిలో ఆయన అనుసరణీయతని సహనాన్నీ కష్టమైన పరిస్థితినీ, చెడ్డ వాతావరణాన్నీ ఓర్చుకుంటూ, వర్షాకాలాన్నీ దారుణంగా వున్న రోడ్లనూ సహిస్తూ సునీల్ మున్షీ ప్రశంసించాడు. మధ్యాహ్న లేక రాత్రి భోజనానికి గంజిని యిచ్చినా ఆయన ఎన్నడూ నిరాకరించలేదు. ఆయన ఎక్కడైనా ఎప్పుడైనా ఏదైనా తినేందుకూ, నిద్రించేందుకూ, ఎక్కడ సాధ్యమైతే అక్కడ నిద్రించేందుకూ, అవసరమైతే కారులో సైతం నిద్రించేందుకూ సిద్ధపడ్డాడు. చుట్టూ దోమలున్నా, ఓ చిన్న కారులో యిరుకుగావున్నా, కూర్చోడం భరించరానిదిగావున్నా, జోషి నవ్వు ముఖం ఎన్నడూ యిబ్బంది పడుతున్నట్లు కనిపించలేదు. ఢిల్లీకి తిరిగి వచ్చాక, 'బంగ్లాదేశ్ యాత్ర: ఒక రాజకీయ తీర్థయాత్ర' పేరిట వరుసగా కొన్ని వ్యాసాలు రాశారు. ఆయన యిలా ప్రారంభించారు.

ఇరవై ఏళ్ళ వయస్సునుంచి నా జీవితమంతా కమ్యూనిస్టు పార్టీలో పనిచేసి, యిప్పుడు నేను కమ్యూనిజం చరిత్రపైన భారత కమ్యూనిస్టు పార్టీలోనే

వుంటూ, నా పార్టీ చిల్లర పనులు చేస్తూ, ప్రస్తుతం పరిశోధన చేస్తున్నాను. నా యీ ప్రస్తుత 64 ఏళ్ళ వయస్సులో సైతం, జవహర్ లాల్ నెహ్రూ విశ్వ విద్యాలయంలోని గదిలో సౌకర్యంగా కూర్చుని సాహిత్యపరంగా పరిశోధన చెయ్యడం నాకు అసాధ్యమైంది. సరిగ్గా యిప్పుడు బంగ్లాదేశ్‌లో సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ప్రజాస్వామిక విప్లవం సాగుతోంది. ఒకప్పుడు మన రక్తం, కండలు, ప్రస్తుతం ఆ అత్యంత సన్నిహిత పొరుగుదేశం, మన అత్యుత్తమ సోదరుడుగా కార్యాచరణ ద్వారా నిరూపించు కుంటోంది. మన పాలక శ్రేష్ఠులు కొత్త తెలివైన పదబంధాలతో సంతృప్తి పడుతూంటే, మన జాతీయ రాజకీయ పార్టీలు వాగాడంబరంలోనూ, గూండాయిజంలోనూ మాత్రమే నిమగ్నమైవుంటే, బంగ్లాదేశ్ ప్రజలకి ఏమీ చెయ్యకుండావుంటే, నా విశ్రాంతి రాహిత్యం భరించరానిదైంది.[28]

బంగ్లాదేశ్ విముక్తి అనంతరం, ఒక నూతన జాతి జననానంతరం, అనగా 1971, డిసెంబరు 17న స్వాతంత్ర్యం గురించీ, బంగ్లాదేశ్ విప్లవం గురించీ జోషి యిలా అన్నాడు.

ఇది సంతోషించవలసిన వ్యవహారం కాగా, మనం పెద్దన్న దృక్పథంతో వ్యవహరించనారంభించరాదు. అది మన విషయంలో చాలా సహజమైన విషయం, సరిగ్గా బ్రాహ్మణులు రుణాన్ని రూపొందించినట్లు. వాళ్ళ జాతీయ గౌరవాన్ని మనం దెబ్బకొట్టరాదు. అది మనం చేసినదాన్ని నిరర్థకం చేస్తుంది. మనం వాళ్ళని గౌరవిస్తే బంగ్లాదేశ్ మనల్ని ఇష్టపడుతుంది. పోరాటం ప్రారంభించిన ముక్తివాహినిని మనం తక్కువ అంచనా వెయ్యరాదు. వాళ్ళు ప్రారంభ కృషిచేసి, భారత సైన్యం దాడికి వాళ్ళు మార్గాన్ని సుగమం చేశారు.

ఆయన ప్రస్తుతం పార్టీ రాజకీయాలకు దూరంగా ఉండి వుండవచ్చు, కాని ఆయన రాజకీయ మనస్సు ప్రజానీకం నుంచి ఎన్నడూ దూరంగా లేదు. అదీ పి.సి.జోషి ప్రత్యేకత.

---

28. న్యూవేవ్, వాల్యూం నెం.1, ఇండిపెండెన్స్ డే నవంబర్, 1971.

# 6

# మానవతావాది

పి.సి.జోషి బహుముఖ ప్రజ్ఞావంతుడు. నిజానికి, ఆయనలో ఎన్నెన్నో ప్రముఖ లక్షణాలు ఉన్నాయి. ఆయన కమ్యూనిస్టు సంఘటన కర్త, స్వాతంత్ర్యయోధుడు, జాతీయవాది, రచయిత, జర్నలిస్టు, చరిత్రకారుడు, కళావిమర్శకుడు. ఈ లక్షణాలన్ని ఆయనలో సమీకృతమయ్యాయి. అన్నిటికంటె అధికంగా ఆయన అత్యంత దయాపరుడు, స్నేహశీలుడు, జాతీయవాది, సున్నితహృదయం కలిగిన వ్యక్తి.

పి.సి.జోషి తనతో పరిచయమున్న ఏ వ్యక్తి హృదయాన్నైనా తేలిగ్గా స్పృశిస్తాడు. నిజానికి, ఆయన పార్టీలోని కామ్రేడ్లని సోదరీ, సోదరులుగా పరిగణించాడు. అంతులేని తన ప్రేమతో, వారిపట్ల శ్రద్ధతో ఆయన తనకు తానుగానే సంయుక్త పార్టీ కుటుంబ పెద్ద అయాడు.* పి.సి.జోషి తల్లిలేని బాల్యాన్ని గడిపాడు. అది, తనకు పరిచయమైన వారందరి పట్లా ప్రేమ, ఆప్యాయతలు చూపాలన్న ఆయన వాంఛని వివరిస్తుంది. కమ్యూనిస్టు పార్టీని ఒకే కుటుంబంగా తిరిగి రూపొందించాలన్న ఆయన ఉత్కంఠను నిజానికి ఆయన బాల్యం వివరిస్తుంది.

---

* దురదృష్టవశాత్తూ, యీ విషయంలో పరిగణింపబడిన ఆయన సానుకూల అంశం పార్టీలో చాలామంది చేత విమర్శనాత్మక విషయంగా ఎంచబడింది. ఆయన ప్రత్యర్థులు యీ అంశాన్ని 1948లో ఆయన్ని తక్కువ అంచనా వేసేందుకు ఉపయోగించుకున్నారు, పార్టీ మిత్రుల కుటుంబం కాదనీ, విప్లవాత్మక పోరాట సంఘమనీ అన్నారు.

1940 దశకంలో పార్టీలో ప్రతి ఒక్కరూ సమానుడు, ప్రతి ఒక్కరికీ సమానమైన పరిగణన వుండేది. జోషి యొక్క ఒకప్పటి టైపిస్టు, ప్రైవేటు సెక్రటరీ ఈశ్వరభట్, ఆరోజుల్లో బొంబాయిలోని సి.పి.ఐ కేంద్ర కార్యాలయం రాజభవన్‌లోని కార్మికుల సమిష్టి జీవితం గురించి తన స్మృతులను యిలా రాశాడు. "పార్టీ వాళ్ల అన్ని అవసరాలనూ, ఖర్చులనూ భరించి, నెలకు 10 రూపాయలను పోకెట్‌మనీగా యిచ్చేది. అదో గొప్ప ప్రయోగం." ప్రతి ఒక్కరూ క్రమశిక్షణా భావంతో పనిచేశారు. జోషి ఆధిపత్యం వహించాడు, కాని ఆయన నిరంకుశ తరహావాడు కాదు. పార్టీలో సభ్యులందరూ సమానమైన ఆదరణ పొందేవారు. జోషితో కలిసి పనిచేసిన ఆయన సహచరులందరూ ఆనాటి రాజ్‌భవన్‌లోని జీవితాన్ని ఎంతో గౌరవంతో జ్ఞాపకముంచుకున్నారు.

రాజ్‌భవన్‌లోని పార్టీ వంటశాల ఓ పెద్ద భోజనశాల. కేంద్ర సంఘంలోని కామ్రేడ్లు అందరూ అక్కడ భోజనం చేసేవారు. దిల్షాద్ చారి (దీది)తల్లి మాయ్, సుందరయ్య భార్య లీలా సుందరయ్య వంటశాల పర్యవేక్షణ చేశారు. కామ్రేడ్ గానూ ప్రధానమైన వంటవాడు. ఆదివారాల్లో తప్ప శాఖాహార భోజనాలు. ఆదివారాల్లో మాత్రం మాంసాహార వంటకాలు కోరిన వారికి వడ్డించబడేవి. భోజనాలు ఉదయం 10 గంటలకి, సాయంత్రం 7 గంటలకి జరిగేవి. టీ ఉదయం 7 గంటలకి, మధ్యాహ్నం 2 గంటలకి యివ్వబడేవి. ఆ సమయాల్లో ముందు గంట కొట్టబడేది. అప్పుడు కామ్రేడ్లు వచ్చి భోజనానికీ, టీకి క్యూలో నిలబడేవారు. వాళ్లు తమ పాత్రలను ప్రతి భోజనం తర్వాత కడిగేవారు. సుబ్రత యిలా రాసింది.

> పార్టీ కేంద్ర కార్యాలయంలో పనిచేసేందుకు నేను వచ్చినప్పుడు నా మనస్సును సంచలితం చేసిన విషయం నాయకులకూ, పార్టీ సామాన్య సభ్యులకూ మధ్య ఉన్న అపేక్షతో కూడిన సంబంధం. కామ్రేడ్ జోషి స్వంత జీవన విధానమూ, వ్యక్తిగత ప్రవర్తన మా కమ్యూన్‌లో సమిష్టి కుటుంబ వాతావరణాన్ని సృష్టించింది. మాలో ప్రతి ఒక్కరూ టతన పాత్రలను (ఆమె/అతడు) కడిగి, వాటి వాటి స్థలాల్లో పెట్టేవారు.

---

మాయ్ మంగళూరు నుంచి వచ్చిన సరస్వత్ స్త్రీ. ఆమె హైద్రాబాద్‌కి

చెందిన ఒక ముస్లిం కామ్రేడ్‌ని పెళ్లి చేసుకుంది. ఆమె కేన్సర్ వ్యాధితో చనిపోయింది. హాస్పిటల్‌కి మార్చబడేదాకా ఆమె కమ్యూన్ (వంటశాల) లోనే పనిచేసింది. ఆమె వంటశాలలోని పని బాధ్యతను పార్టీ పనిగా తీసుకుంది. ఈశ్వర్‌భట్ అక్కడి ఒక సంఘటనను గుర్తుచేశాడు. అది, జోషి ఆ కమ్యూన్‌ని సమిష్టి కుటుంబంగా ఎలా నిర్మించాడో, అక్కడున్న సభ్యులందర్నీ ఆయన మానసికంగా ఎంత ఆప్యాయంగా చూసేవాడో తెలియజేస్తుంది. శవదహనశాలలో మాయ్ చితి దగ్గర జోషి ఎంతో గట్టిగా విలపించాడు. అది ఆయనకి తన తల్లిని కోల్పోయినంతగా అనిపించింది.

కాని, పార్టీ కేంద్ర కార్యాలయపు నాలుగు గోడల మధ్య ఒకేచోట జీవించడం ద్వారా, అక్కడున్నవాళ్లు జనంతోను, ప్రజానీకపు జీవితం, సమస్యలు, బాధలతో సంబంధం కోల్పోయారని త్వరలోనే గుర్తించబడింది. మానవ సంబంధాలు లేకుండా కామ్రేడ్లు యంత్రాల్లా తయారు కావచ్చునని జోషి భయపడ్డాడు. అందుకని, తర్వాతి దశలో, చాలామంది కామ్రేడ్లు సంసార జీవితం గడపమనీ, తద్వారా జనంమధ్య జీవించమనీ, పార్టీకోసం పని చెయ్యమనీ ప్రోత్సహించబడ్డారు.

కేంద్ర పార్టీ కార్యాలయాన్ని నిర్వహించడంలో జోషి అత్యంత అధిక శ్రద్ధను చూపాడు. గోవింద్ విద్యార్థి, ఎమ్.సి. ఆచార్య, ఆర్.కె.బోధారావు వంటి ఆయన సన్నిహిత, విశ్వసనీయ సహాయకులు కామ్రేడ్ ఘాటే పర్యవేక్షణలో ప్రతి ఒక్క వివరాన్నీ పరిశీలించాడు.

> ఒక సానుభూతిపరుడి ఇంటిలో (అపార్ట్‌మెంటులోని) పాత పత్రాలు, ఫైళ్లు నిలవచెయ్యబడ్డాయి. రాజ్‌భవన్ నుంచి తొలగించవలసిన గణనీయమైన ప్రతి ఒక్కటీ తొలగించ బడేది. లేకపోతే పోలీసులు వెతుకులాట దాడిలో అవి పోలీసులచేత చిక్కేవి.[1]

జోషి బడలికలేని గొప్ప శక్తివంతుడైన కార్యకర్త. ఆయనకి విశ్రాంతి అంటే ఏమిటో తెలియదు. ఆయన రాత్రి పద్దుపోయేదాకా పనిచేస్తాడు, కేంద్ర పార్టీ పత్రికల కోసం వ్యాసాలు రాస్తాడు. కేంద్రకమిటీ సభ్యులకు, పార్టీ

---

1. గణేశ్ శుక్లా, రచన.

నాయకులకు సలహాలు సూచిస్తాడు. ఆయన సర్క్యులర్ ఎప్పుడూ చప్పిడి రూపంలో వుండదు. ఆ ప్రాంతపు ప్రత్యేక పరిస్థితిలో తన పత్రంలోని విషయాన్ని ఎలా అమలు జరపాలో వివరిస్తాడు. దీన్నిబట్టి ఆ ప్రాంతం ఆయనకి తన వేళ్ల గోళ్లలా తెలుసుననీ, ప్రతివ్యక్తి వ్యక్తిగతంగా తెలుసుననీ తెలుస్తోంది.ఆయన ఇండియాలోని సానుభూతి పరులకి తన లేఖలను పంపేవాడు. గంటలకొద్దీ శ్రమించి పత్రాలు రాసేవాడు. ప్రతిఒక్కరి కుటుంబంతో పార్టీకి సంబంధం కలిగి ఉండేది.

ఈశ్వర్‌భట్ గుర్తు చేసినట్లు ఆయనఒక సుదీర్ఘ రచయిత:

> ఆయనకి చాలా గాఢమైన ఏకాగ్రత వుంది. ఆయన రాయడం మొదలుపెట్టాక పరిసరాల్ని బొత్తిగా పట్టించుకోడు. అలాంటి రచనల మధ్య, ఆయన అకస్మాత్తుగాలేచి, గదుల్లో అటూ యిటూ నడుస్తాడు లేక కారిడార్లలో తన తలను ఊపుతూ, కదుపుతూ, చేతుల్ని ఊపుతూ, తనలో తను గొణుక్కుంటూ నడుస్తూ అకస్మాత్తుగా తన కుర్చీలోకి తిరిగి వెళ్లి, తన రచనను ఆపకుండా, రాయడం తిరిగి మొదలుపెడతాడు. ఆయన నాటు పొగాకును తన అరచేతిలో నలిపి, తన నోటిలో వేసుకుని నములుతాడు.

పాత కామ్రేడ్లు ఎప్పుడూ పి.సి.జోషి నిరాడంబరత గురించీ, జనాన్ని సన్నిహితుల్ని చేసుకునే ఆయనకుగల ఆకర్షణీయశక్తి గురించీ చెబుతూ వుంటారు. సత్యపాల్ డాంగ్ యిలా రాశాడు:

> నేను మొట్టమొదటిసారి పి.సి.జోషిని చూసినప్పుడు ఆయనలోని నిరాడంబరతతో నేను బాగా సంచలనం పొందాను. ఆయన నిక్కరు, పొట్టిచేతుల చొక్కా ధరించి వున్నాడు. ఆయన ఎంత జోరుగా మాట్లాడాడంటే, ఆయన చెప్పినదంతా అర్థం చేసుకోవడం నాకు చాలా కష్టమైంది. అయినప్పటికీ నేను ఆయనకి సన్నిహితుడినయ్యాను. నా అధైర్యం తొలగిపోసాగింది.[2]

ఆయన నిరాడంబరత్వం ఆయన స్వభావానికి సజీవ లక్షణం. ఆయన

2. సత్యపాల్ డాంగే రచన నుండి.

సౌందర్యం శాస్త్రీయ జ్ఞానం. ఆయన సృజనాత్మక మనస్సును వెల్లడించింది. ఢిల్లీలోని అసఫ్ అలీ రోడ్డులోని ఒక చిన్నగదిలో ఆయన జీవించినప్పుడు, ఒక సర్దార్జీ వడ్రంగి సహాయంతో కొత్తరకం గృహోపకరణ సామాన్లను నవీకరించాడు. పెట్టెతో కూడిన మంచం, ముడతపెట్టే టేబిలు, మూడు నాలుగు పెట్టెలు. అప్పట్లో ఆర్థికవేత్త అయిన జూనియర్ పి.సి.జోషికి ఆయన యిలా చెప్పాడు: "చోటులేని చోట చోటును కల్పించు" అది జోషి తాత్విక మనస్సును వివరిస్తుంది.

జోషి ఎన్నడూ ఏవిధమైన విలాస వస్తువులనూ కలిగి వుండలేదు. ఆయన జీవితాంతం వరకూ నిక్కరునూ, పొట్టి చొక్కానూ ధరించాడు, శీతాకాలంలో తప్ప శీతాకాలంలో మాత్రం ఉన్ని వస్త్రాలను, లేక, *గలాబంధ్* కోటును ధరించాడు.

ఆయనతో పనిచేసిన వాళ్లకు, వ్యక్తిగా ఆయన ఎంత నిజాయితీ కలిగిన వ్యక్తో తెలుసు. ఈశ్వరభట్టు యిలా స్మరించాడు:

> నాకు ఆయన మనస్సు గ్రహించే అవకాశం కూడా దొరికింది. కామ్రేడ్ జోషితో నేను పనిచేసిన కాలంలో, ఆయన యితర పొలిట్ బ్యూరో సభ్యులకు వ్యతిరేకంగా ఏమీ చెప్పలేదు. వాళ్ల అభిప్రాయాలకు ఆయన గొప్ప గౌరవం యిచ్చాడు...
>
> జోషిని ఏ ఒక్కరూ అధికారి అనో, లేక ఒక నియంత అనో అనలేక పోయారు... ఆరోపణ మరోలా వుండేది కాదు. ఆయన మరీ సాధువనీ, తగినంతగా ఎదురు పోరాటం జరపలేదనీ, పార్టీ అంతర్గత పోరులో ఆత్మరక్షణ వైఖరి తీసుకున్నాడన్నది ఆ ఆరోపణ.

ఆయన తన సహచరులకు తేలిగ్గా దొరికేవాడు, అందుబాటులో ఉండేవాడు, వాళ్లకి వినయంగా ఉండేవాడు. పి.సి.జోషికి గొప్ప హాస్యవైఖరి, సరసోక్తులశక్తీ వుండేవి. ఆయన ఆప్యాయంగా తన ప్రేమపాత్రుల్ని గట్టిగా నవ్వుతూ ఏడిపించేవాడు. మొహిత్‌సేన్ తన స్వీయచరిత్రలో అలాంటి సరదా క్షణాల గురించి స్మరించాడు. ఆయన యిలా రాశాడు:

> నేనొకసారి గ్రంథాలయంలో *కమ్యూనిస్టు మేనిఫెస్టో* అనే పుస్తకం

చదువుతూ సతమతమవుతున్నాను. ఈలోగా నా మెడమీద ఒక చెయ్యి పడిన విషయం గ్రహించాను. నేను నా తలఎత్తి పైకి చూశాను. అప్పట్లో భారత కమ్యూనిస్టు పార్టీ (సి.పి.ఐ) ప్రధాన కార్యదర్శి అయిన పి.సి.జోషి అందమైన ముఖం అది. తన మామూలు కొద్దినత్తితో నేనేమి చదువుతున్నానని ప్రశ్నించాడు. నేనది ఏ పుస్తకమో చెప్తే, ఆయన నకిలీ గాంభీర్యంగా నేనా ప్రయత్నాన్ని వెంటనే ఆపెయ్యమని చెప్పాడు. ఆయన యింకా యిలా చెప్పసాగాడు, 'మార్క్స్ దీన్ని లెనిన్ కోసం రాశాడు, లెనిన్ స్టాలిన్ కోసం రాశాడు, స్టాలిన్ నాకోసం రాశాడు. నేను నీకోసం రాస్తాను. నువ్వు సరిగ్గా నన్ను చదువు!' ఆయన తర్వాత తన తలను వెనక్కి ఎగరేసి ఘొల్లున నవ్వాడు.[3]

తన మిత్రులకు ఆయన రాసిన లేఖలు సరసోక్తులతో, చమత్కారాలతో నిండి వుండేవి. ఆయన 'సరదా ప్రవర్తన కలిగిన వ్యక్తి ఆయన ముఖం ఎప్పుడూ చిరునవ్వులతో నిండివుండేది'.

ఒక విషయం స్పష్టం, జోషి ఎప్పుడూ క్లుప్తమైన మాటలతో ములిగి వుండలేదు. తనతో విభేదించినవారిని ఆయన ఎన్నడూ దూషించలేదు, వారిపై దుర్భాషలాడలేదు. తన దృక్పథానికి సంబంధించిన సరితనాన్ని ఎదుటి వారిని నమ్మించేందుకు ప్రయత్నించేవాడు, అతేగాని మామూలు తగువులకు పూనుకునే వాడు కాదు, తరచు వ్యక్తులు రాజకీయ సంఘంలో యిలాంటి తగువులు పెట్టుకున్నట్లు.

పార్టీ ప్రధాన కార్యదర్శి దశలోనే జోషి కల్పనాదత్తుని కలుసుకున్నాడు, ఆవిడ అప్పటికి బెంగాల్ విప్లవోద్యమంలో ప్రసిద్ధ వ్యక్తి. 1930వ దశకంలో ఆమె చిట్టగాంగ్ తిరుగుబాటులో పాల్గొంది. అప్పుడు ఆమె సహచరులైన సూర్యసేన్, తారకేశ్వర్, దస్తిదార్‌లు ఉరితీయబడగా, ఆమెపై జీవిత ఖైదు విధింపబడింది. దరిమిలా, రాజకీయ ఖైదీల విడుదల కోసం భారీ ఉద్యమం సాగింది. రవీంద్రనాథ్ టాగూర్, సి.ఎఫ్.ఆండ్రూస్‌లు కూడా ఆమె విడుదల కోసం జోక్యం చేసుకున్నారు. తత్ఫలితంగా, ఆమె శిక్ష రద్దు చెయ్యబడింది.

---

3. మోహిత్ సేన్ రచన.

ఆమె విడుదల తర్వాత, పలువురు తన చిట్టగాంగ్ సహచరులు కమ్యూనిస్టు పార్టీ కోసం పని చెయ్యడాన్ని ఆమె గమనించింది. కమ్యూనిస్టు భావజాలంతో ప్రభావితురాలై, ఆమె కూడా ఆ పార్టీలో చేర్చబడింది. ఆమె చిట్టగాంగ్‌లో నిబద్ధ కార్యకర్తగా మారింది. 1942 డిసెంబరులో బొంబాయిలో జరిగిన పార్టీ క్లాసుకి హాజరయ్యేందుకు ఆమె వెళ్లింది, అక్కడ ఆమె జోషిని కలిసింది. 1943 ఆగస్టు 14వ తేదీన వాళ్లిద్దరూ పెళ్లి చేసుకున్నారు. ఆ పెళ్లి పార్టీ కేంద్ర కార్యాలయంలో జరిగింది. వధువు తరఫున ముజఫర్ అహ్మద్, వరుడి తరఫున రణదివే ఆ పెళ్లికి హాజరయ్యారు. చిటగాంగ్, అల్మోరా కొండ ప్రాంతాలకు చెందిన యిద్దరు విప్లవకారులను దగ్గర చేసిన అదొక చరిత్రాత్మక వివాహం. ఆ సందర్భంగా టీ, బిస్కట్లు యివ్వబడ్డాయి. ఆ పెళ్లి పార్టీ కేంద్ర కార్యాలయపు డాబా మీద జరిగింది. అక్కడ బినయ్ రాయ్, పార్టీ సాంస్కృతిక దళ సభ్యులు కొన్ని విప్లవ గేయాలు పాడారు. జోషి బంధువుల్లో ఒకరు అందమైన ఎర్ర చీరను కల్పన కోసం పంపారు. అది అటుతరువాత ముక్కలు చెయ్యబడి ఎర్రజెండాగా మారింది.

భారీ బెంగాలు కరువు (అది ఆ సంవత్సరము సంభవించింది) వచ్చిన సమయంలో కల్పన సహాయ కార్యక్రమాలో నిమగ్నమైంది, మహిళా ఆత్మరక్షా సమితి(మార్స్) క్రియాశీల కార్యకర్తగా చిటగాంగ్‌లో రేషనింగ్ కోసం కృషి చేసింది. భార్యా భర్తలిద్దరూ పార్టీ పనికి అంకితమైనందున, సంసార జీవితానికి వాళ్లకు స్వల్పసమయం కూడా మిగిలేది కాదు. వారి తొలి బిడ్డ సూరజ్ 1946లో జన్మించాడు. జోషి కుటుంబం నుంచి ఆ బిడ్డకోసం ఒక జత బంగారు గాజులు పంపబడ్డాయి. కానీ, ఆ జత పార్టీ నిధికి చందాగా యివ్వబడ్డాయి. జోషి స్వయంగా బంధువులనుంచీ, మిత్రులనుంచి చందాలు వసూలు చేసేవాడు. నూతన పరిచయస్థులనుండి సైతం నిధుల కోసం సమయాన్ని కేటాయించేవాడు. జోషి మోహిత్‌సేన్ తండ్రిని కలిసినప్పుడు, వాళ్లొక గంట సేపు చర్చించుకున్నారు. ఆ చర్చ చివర్లో జోషి “జడ్జిగారూ, మీరు మాకేమీ యివ్వలేదు” అన్నాడు. మోహిత్ తండ్రి తన పర్సును తీసి టేబిలు మీద పెట్టారు.[4] 1947లో జోషి రెండవ కొడుకు చంద్ పుట్టాడు. అప్పటికి జోషి

4. మోహిత్ సేన్ రచన, పుట 20.

పార్టీలో యిరుకున వున్నాడు, కానీ, కల్పన ఆయన అగ్ని పరీక్షల్లో ఆయన సరసన నిలబడింది. తన స్వపక్షత్యాగిని విడిచిపెట్టెయ్యమని కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం నుంచి ఆమె ఒత్తిడిని ఎదుర్కోవలసి వచ్చింది. అయినా ఆమె జోషికి విశ్వాసపాత్రురాలిగా ఉండిపోయింది. పార్టీలో కల్పన స్థాయి, ప్రతిష్ఠ ఎంతో ఉన్నతమైనవి కావడంతో నాయకత్వంలో ఏ ఒక్కరూ పార్టీనుంచి ఆమెను సస్పెండు చెయ్యడానికిగానీ, బహిష్కరించడానికి గానీ సాహసించలేక పోయారు. జోషి, కల్పనలకు పార్టీ కేంద్ర కార్యాలయంలో ఉండటం అసాధ్యమైంది. త్వరలోనే దాన్ని ఖాళీ చెయ్యవలసి వచ్చింది. అటు తర్వాత, వాళ్లు కలకత్తాకు మారారు. అక్కడ తాము వుండేందుకు చోటు వెతుక్కోవలసి వచ్చింది. ఆయన ప్రొఫెసర్ సుశోభన్ సర్కార్ ఎల్గిన్ రోడ్డులోని యింట్లో వున్నాడు. కొద్దిరోజులపాటు, మధ్యంతర ఏర్పాటుగా సునీల్ జనా యింట్లో వున్నాడు. కొద్దినెలల తర్వాత, జోషి పూర్తిగా పార్టీనుంచి బహిష్కరించబడ్డాడు. కామ్రేడ్లకు, సానుభూతి పరులందరికీ జోషితో ఎలాంటి సంబంధమూ పెట్టుకోవద్దని పార్టీ నుండి ఆదేశం జారీ చెయ్యబడింది. అటు తర్వాత, ఆయన హౌరాలో అద్దె ఇంట్లో ఉన్నాడు.

తను గాఢంగా కోరుకున్న దానికోసం ఆయన అవిశ్రాంత పోరాటం యీ కింది విషయాల కోసం జరిపాడు – పాలిస్తున్న జాతీయ బూర్జువా వర్గపు తప్పుడు విధానాలకు వ్యతిరేకంగా అదేకాలంలో పోరాడే జాతీయ ప్రజాస్వామిక సంఘటనను ఏర్పాటు చేసే రాజకీయ విధానం; ఆ సంఘటన యొక్క స్వతంత్ర, సమైక్య, స్వయం ఆరాధిత సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ రాజ్యాన్ని ఏర్పాటు చెయ్యాలన్న సరైన పంథాకు తోడ్పడటం; అన్ని రకాల మతపరమైన అభివృద్ధి నిరోధకతతో బాటు మితవాద అభివృద్ధి నిరోధకతకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటం చెయ్యడం. ఈ భావాలు ఆయన్ని ప్రధాన కమ్యూనిస్టు ఉద్యమంనుంచి దూరం చేశాయి. ఆయన మనసారా దేశానికి, ప్రజలకు, పార్టీకి, దాని సభ్యులకు అంకితమయ్యాడు. అందుకని ఆయన తన సన్నిహితమైన ప్రియమైన వ్యక్తులకోసం స్వల్పకాలం కూడా వెచ్చించలేక, తన కుటుంబాన్ని ఉపేక్ష చేశాడు. ఆయన యిద్దరు కొడుకులూ తమ బాల్యావస్థలో తమకి అవసరమైన తమ తండ్రి సాంగత్యాన్నీ, మార్గదర్శకత్వాన్నీ

కోల్పోయారు. ఆయన భార్య కల్పన ఆహార సంపాదకురాలే కాదు, రోజు రోజుకు పెరుగుతున్న కుటుంబానికి తనే కుటుంబ పెద్ద కూడా అయింది. పార్టీ హోల్‌టైమర్లకు యీ పరిస్థితి తరచు సంభవిస్తుంది. ఆమె క్రమంగా క్రియాశీల రాజకీయాలనుంచి దూరమైంది, ఇతర పనుల్లో మరింత కాలాన్ని వెచ్చించింది.

జోషి కామ్రేడ్లని కలుసుకోవడం వ్యక్తిగత సంబంధమూలంగా ఆయన వాళ్ల వ్యక్తిగత సమస్యలను గురించి శ్రద్ధ తీసుకునేవాడు. క్లిష్ట పరిస్థితులను, ఛాందస కుటుంబాలనుంచి ఎదురైన అవరోధాలను ఎదుర్కొంటున్న కామ్రేడ్లకు ఆయన దారి చూపేవాడు. ఆయన వాళ్లని ఎన్నడూ తమతమ కుటుంబ సంబంధాలను తెంచుకోవద్దనీ, లోపల వుండే పోరాడమనీ చెప్పేవాడు. 'ఇప్టా' కార్యకర్త రేఖాజైన్ పార్టీ సాంస్కృతిక దళంలోకి ఆమె భర్త నేమీచంద్ జైన్ చేత తీసుకురాబడింది. వాళ్లది ఉత్తరప్రదేశ్‌లోని ఛాందసకుటుంబం. రేఖాజైన్ అత్తగారు తన కోడలు ఒక దళంలో నాట్యం చేస్తుందని తెలుసుకుంది. అది కుటుంబ గౌరవానికి భంగకరమైనదని భావించి కోడలుపైన కోపం తెచ్చుకుంది. రేఖాజైన్ యీ సమస్యను జోషికి చెప్పినప్పుడు ఆయన ఆమెకు తన అత్తగారితో ఓర్పుగా ప్రవర్తించమనీ, అవసరమైతే ఆమెకి పాదాభి వందనం సైతం చెయ్యమనీ సలహా యిచ్చాడు. ఆమె అత్తగారు ఆమెకి తీవ్రమైన లేఖ కూడా పంపిందనీ, తన కోడలుపట్ల ఆమెకు వున్న శ్రద్ధ, ప్రేమలే యిందుకు కారణమని కూడా ఆయన రేఖకి చెప్పాడు. రేఖకి జోషి యిచ్చిన సలహా పనిచేసింది, భవిష్యత్తులో రేఖ తను ఇప్టా కార్యక్రమాల్లో పాల్గొంటున్నప్పటికీ, తన అత్తగారికి ప్రియమైన, అనుకూలవతి అయిన కోడలు అయింది.

జోషి ప్రతి కార్యకర్తను, అతని లేక ఆమె కార్యస్థానంలో, అత్యుత్తములు కమ్మనీ కోరాడు. అది ఆ వ్యక్తి పట్ల యితరులను ఆకర్షింపజేస్తుంది. అది అతన్ని, లేక ఆమెని పార్టీ, మొత్తం మీద దేశపు లేక మొత్తం సమాజపు కార్యక్రమాల్లోకి ఆకర్షించేందుకు వాళ్లకి తోడ్పడుతుంది. వ్యక్తి సామర్థ్యాలనూ, ప్రతిభలనూ అంచనా వెయ్యడంలో జోషికి గణనీయమైన శక్తి వుంది. ఆ విధంగా ఆయన ఆమెని లేక అతన్ని, వారి సృజనాత్మక కార్యక్రమాల్లోకి

ప్రోత్సహించేవాడు.

పార్టీ సభ్యుడిని లేక పార్టీ సానుభూతి పరుడిని యాదృచ్ఛికంగా కలుసుకున్నప్పుడు సైతం అతని లేక ఆమె గుణగణాల్ని, మనస్సునీ, హృదయాన్నీ ఆయన గుర్తించేవాడు. అతన్ని లేక ఆమెని ఏ పనిలో, ఏ పద్ధతిలో పెట్టాలన్నది ఆయనకి అది సరిపోయేది. ఆయన అతి స్వల్ప కాలంలో ఆప్యాయతలను సాధించేవాడు, తను ఎవర్ని కలిస్తే వారికి తనని ప్రీతిపాత్రుణ్ణి చేసుకునేవాడు. తన యీ మానసిక, హృదయాత్మక గుణం ద్వారా ఆయన సి.పి.ఐ కి భారతదేశపు సాంస్కృతిక పునరుజ్జీవన ప్రారంభకుడు అయ్యుండేవాడు"[5]

ఆయన రోజువారీ ప్రోత్సాహం పార్టీ కామ్రేడ్లు పెరిగేందుకు, తమలో నిక్షిప్తంగా వున్న ప్రతిభలను పైకి తెచ్చుకునేందుకూ తోడ్పడేది. అందుకే జోషి ఈ దశలో ఎంతోమంది ఫోటోగ్రాఫర్లని, డాన్సర్లనీ, కళాకారుల్నీ, రచయితల్నీ, జర్నలిస్టుల్నీ పార్టీ పెంచి, అభివృద్ధి చెయ్యగగాడు. *పీపుల్స్‌వార్, పీపుల్స్‌ఏజ్* పార్టీ పత్రికల సంచికలు 1940 దశకంలో సృజనాత్మక కార్యకలాపాల భాండాగారాలు. అవి కార్టూన్లు కావచ్చు, స్కెచ్‌లు కావచ్చు. ఫోటోలు కావచ్చు, ప్రజల జీవితానికి, సంఘర్షణకి సంబంధించిన నివేదిక కావచ్చు. జోషి సమగ్రతావాది. తను ఏ పని చేసినా అందులో అత్యంత నిపుణుడు. ఆయన తన సహ ప్రయాణికుల్లో కూడా దాన్నే ఎదురుచూసేవాడు.

జోషి వ్యక్తిగత ప్రవర్తన కమ్యూన్‌లో సమిష్టికుటుంబ భావాన్ని కలిసి భోజనం చెయ్యడం, పాత్రల్ని కడగడం మొదలగువాటివల్ల పెంపొందించింది. జోషి ఆ జీవితంలోనే ఒక భాగం. బొంబాయి వీథుల్లో ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ పత్రికలను అమ్మడంలో ఆయన తన కామ్రేడ్లతో చేరేవాడు. ఈ పని ఆయన్ని పార్టీ కామ్రేడ్లకు సన్నిహితుణ్ణి చేసింది. ఇంకా బతికున్నవారు యీ రోజున సైతం ఆ రోజులను ఎంతో ప్రశంసనీయంగా స్మరించుకుంటారు.

ఆ స్థాయి నాయకులకు ఆయన జాలి, దయ, అపూర్వమైన గుణాలు. పాతపార్టీ సహచరుడైన సుబ్రతా బెనర్జీ బొంబాయిలోని పార్టీ కేంద్ర

5. గణేష్ శుక్లా రచన, పేజీ 93.

కార్యాలయంలో ఉన్నప్పటి ఒక ప్రత్యేక సాయంత్రాన్ని యిలా గుర్తు చేసుకున్నాడు

> నాకు జ్వరం వచ్చింది. సిక్‌రూమ్ అనే గదిలో నేను ఒక మంచం మీద పడుకుని వున్నాను. జోషి నా గది పక్కన, తన వేళ్లతో సంజ్ఞలు చేస్తూ, దీర్ఘంగా ఆలోచిస్తూ అటూ యిటూ నడిచాడు. అకస్మాత్తుగా, ఆయన కళ్లు నామీద పడ్డాయి. ఆయన తన ఆలోచనలన్నింటినీ పక్కన పెట్టి, వచ్చి నా పక్కన కూర్చున్నాడు, తన అరచేతిని, టెంపరేచర్ని అంచనా వేసేందుకు నా నుదుటిమీద పెట్టాడు, ఓ క్షణం తర్వాత యిలా అన్నాడు. 'ఇంటి బెంగ పెట్టుకున్నావా? కాని మేము నీ పక్కన ఉన్నాం. ఇది కూడా నీ కుటుంబమే, మేమందరం దానిలో భాగస్వాములమే' ఆ సాయంత్రం ఆ మాటలు నాకు గొప్ప ఓదార్పునిచ్చాయి.

జోషి మహిళా కామ్రేడ్ల పట్ల చాలా ఎక్కువ శ్రద్ధ చూపేవాడు. వాళ్లెప్పుడూ తమ కాలాన్ని వంటింటిలో మాత్రమే గడపాలని ఆయనెనప్పుడూ కోరుకోలేదు. అలహాబాద్ రోజులను గుర్తు చేసుకొని, రేఖాజైన్ జోషి భోజనం కోసం తను మూడు నాలుగు వంటకాలు చేసిన సంగతిని రాసింది. ఆ వంటకాలు చూసి ఆయన ఆమెకు వంట చేసేందుకు యింత టైము వృథా చేసుకోవద్దని, ఏదో ఒక్కటి మూతపెట్టిన వేడిపాత్రలో తయారు చెయ్యమని చెప్పాడు. సాదారణ సామాన్య జీవితపు యీ వైఖరి, పనికి యిచ్చిన యీ ప్రధాన ప్రాధాన్యం రేఖను బాగా ప్రభావితం చేసింది.[6] ఒక సాధారణ కామ్రేడ్ భార్య తన జీవితాంతం వరకు, తను రాత్రి ఆలస్యంగా రావలసి వచ్చినా తనను ఎన్నడూ ఏమాత్రం సతాయించని కొద్దిమంది నాయకుల్లో పి.సి.జోషి ఒకడని గుర్తుంచుకుంది. ఆయన ఓ చిన్న పొట్లాంలో బాగా సమం చేసిన బియ్యపుగింజల్ని తెచ్చాడు. తనే వాటిని శుభ్రంచేసి, భార్యని మళ్ళీ వండేందుకు అనుమతించకుండా తినేశాడు. స్త్రీల పట్ల, లేక కామ్రేడ్ల భార్యలపట్ల ఆ మాదిరి శ్రద్ధ చూపడాన్ని పార్టీ నాయకుల్లో ఎన్నడూ చూడం, సాధారణంగా నాయకులు సభ్యులు

---

6. రేఖా జైన్, 'రెమినిసెన్సెస్', *కథాదేశ్,* డిసెంబరు 2006, పుట. 16.

తమని శ్రద్ధగా చూడాలని, కోరుకుంటారు.

ఆయన అరవయ్యవ దశకపు చివరి సంవత్సరాల్లో మీనాబాగ్‌లో నివాసమున్నాడు. అప్పుడు కల్పన న్యూఢిల్లీలోని ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్‌స్టిట్యూట్‌లో పని చేస్తోంది. కల్పన తన పిల్లల్నీ, జోషినీ కూడా చాలా జాగ్రత్తగా శ్రద్ధగా చూసుకునేది. కల్పన కూడా ఆయనతో సమానంగా నిక్కచ్చి అయిన వ్యక్తిత్వం కలిగినది. ఆయనకి కల్పనతో పేచీలు పడిన, ఆవేశాలు వచ్చిన ఘటనలు ఉండేవి. మీనాబాగ్ నుంచి జోషి *బర్సాతీలోని* ఒక అద్దె ఇల్లు ఆర్-12 హౌజ్ ఖాస్‌కి మరాడు. చివరకి 1975 తరువాత జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలోని 27, దక్షిణాపురంలోకి ఆయన మారిపోయాడు. 1973 నవంబరు 17న ఈశ్వరభట్‌కి రాసిన లేఖలో జోషి యిలా రాశాడు.“నా కుటుంబం బాగానే వుంది, కానీ ప్రతి ఒక్కరూ తమ స్వంత జీవితం గడుపుతున్నారు. నేను కుదరనివాడిని, నేను కమ్యూన్ అలవాట్లను వదులుకుని బయటపడలేక పోతున్నాను”.

గుండె సమస్య ఆయన జీవితాన్ని దెబ్బతీసింది. 60 దశకపు చివరి సంవత్సరాల్లో అనేకసార్లు ఆయనకి గుండెనొప్పులు వచ్చాయి. 1975లో ఆయనకి మళ్లీ గుండెపోటు వచ్చింది. ఆయన న్యూఢిల్లీలోని ఆల్ ఇండియా మెడికల్ సైన్సెస్ ఇన్‌స్టిట్యూట్‌లో ఆస్పత్రిలో చేర్చబడ్డాడు, సెప్టెంబర్ నెల మొత్తం అక్కడ వున్నాడు. అటుతరువాత అదే సంవత్సరంలో ఆయన్ని చికిత్స కోసం మాస్కోకి పంపారు, కాని, అది ఆయనకి పని చేయలేదు. ఆయన తన పరిస్థితిని గురించి సరిగ్గా చెప్పుకోలేకపోయాడు, కాని ఆయన కళ్లు చెప్పేవి, ఆయన ముఖం మీద విచారం స్పష్టంగా కనిపించింది. ఆయన సదా తను జీవించాలనీ, ప్రజల కోసం మరింతగా పని చెయ్యాలనీ వాంఛించేవాడు. ఆయన హాజరైన చివరి పార్టీ మహాసభ 1978లో భటిండాలో జరిగింది. ఆయన్ని వీల్‌ఛెయిర్ ఫీద తీసుకు వెళ్లారు. ఆయన కనిపించినప్పుడు కామ్రేడ్లు చాలా సంతోషించి, ఆతన్ని వేదిక మీదకి తీసుకెళ్ళారు.

ఆయన తన అంతిమ దినాలను జె.ఎన్.యు.లోని దక్షిణాపురంలో గడిపాడు. ఎవరైనా ఎప్పుడైనా ఆయన్ని కలుసుకునేందుకు వెళ్లినప్పుడు ఆయన ఎతంతగానో సంతోషపడ్డాడు. తన రాజకీయ ప్రత్యర్థులపట్ల సైతం ఆయన

ఉత్సుకత చూపేవాడు. అది ఆయన గొప్పతనాన్ని వెల్లడించేది. ఆయన గతాన్ని విస్మరించ గలిగేవాడు, క్షమించగలిగేవాడు. ఆయన తన 73వ ఏట, 1980 నవంబరు 9వ తేదీన చనిపోయాడు. ఆయన కృషిలో చాలామటుకు వామపక్ష ఉద్యమానికి సంబంధించిన ఆయన పత్రాలతో బాటు అసంపూర్తిగా ఉండిపోయాయి. అల్మోరాలో హిమాలయన్ సోషలిస్టు ఆశ్రమం నిర్మించాలన్న ఆయన స్వప్నం నెరవేరకుండా ఉండిపోయింది. తన చివరిరోజుల్లో ఆయన తన మూల స్థానానికి తిరిగి వెళ్లాలనీ, అక్కడ పని చెయ్యాలనీ కోరుకున్నాడు. అది చివరి వరకు నెరవేరలేదు.

ఆయన నిష్కపట పహాడీ నవ్వు ఎదుటివ్యక్తి స్మృతిలో శాశ్వతంగా నిలిచి పోతుంది. పి.సి.జోషి మనదేశ చరిత్రలో ఒక అపూర్వమైన కమ్యూనిస్టు దేశభక్తుడుగా స్మరించబడతాడు.






Laser Typesetting at Kavyasri Graphics, Nallakunta, Hyderabad.
Printed at: Pushpak Press Pvt. Ltd., Okhla, New Delhi.

KNVA 03 B213



ఈ గ్రంథం ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడూ, తొలి మార్గదర్శక కమ్యూనిస్టు నాయకుడూ జనబాహుళ్యం చేత పి.సి.జోషి అని పిలవబడ్డ పూర్ణచంద్ర జోషి, భారత దేశంలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికీ, కమ్యూనిస్టు ఉద్యమానికీ, దాని పెరుగుదలకు చేసిన కృషికి సంబంధించినది. ఒకవైపున సామ్రాజ్యవాద శక్తులకు, మరోవైపున మతవాద, కులవాద, అభ్యుదయ నిరోధక శక్తులకు వ్యతిరేకంగా పోరాడేందుకు, 1930-40 దశకాల్లో ప్రగతిశీల, మత వ్యతిరేక శక్తుల విభిన్న రాజకీయ ధోరణులు, ఉద్యమాలతో ఉమ్మడి మార్గాలు కనుగొనేందుకూ దూరదృష్టితో అవిరళ కృషి చేసిన వ్యక్తి జోషి. కొత్తగా స్వతంత్రమైన దేశపు స్వాతంత్ర్యాన్ని నిర్మించేందుకు, పరిరక్షించేందుకు సమకాలిక భారతదేశంలో యితర ఏ భావుక రాజకీయ పార్టీలతో సాంగత్య, సహవాసాలను కోరాలన్న జోషి వైఖరి యీ గొప్ప రాజకీయ, సాంస్కృతిక, సామాజిక నాయకుని దృష్టిని ధ్రువీకరించింది. జోషి శతజయంతి సంస్మరణ కోసం ప్రత్యేకించి ప్రచురించిన యీ పుస్తకం భారత దేశంలో ఆయన పాత్రనీ, కమ్యూనిస్టు ఉద్యమ పాత్రనీ, ఆయన బహుముఖ వ్యక్తిత్వం గురించిన సరైన చారిత్రక దృష్టికోణాన్నీ వివరించింది.

గార్గీ చక్రవర్తి ఢిల్లీ విశ్వవిద్యాలయం, మైత్రేయీ కళాశాలలో చరిత్ర ఉపన్యాసకురాలు. వీరి *'గాంధీ: ఏ ఛాలెంజ్ టూ కమ్యూనలిజం'* 1987లో ప్రచురించబడింది. 2005లో వెలువడిన వీరి మరో పుస్తకం *'కమింగ్ అవుట్ ఆఫ్ పార్టీషన్: రిఫ్యూజీ ఉమన్ ఆఫ్ బెంగాలి'*. ఇందులో విభజనానంతర దశలో బెంగాలీ స్త్రీల అనుభవాలనూ, ఆహార రక్షణ, ఉద్యోగాల కోసం జరిగిన వారి పోరాటాన్ని వివరిస్తుంది. నిడమర్తి ఉమారాజేశ్వర రావు ప్రముఖ రచయిత, అనువాదకులు. తెలుగులోకి వందకు పైగా పుస్తకాలను అనువాదం చేసిన వీరు రష్యాలోని ప్రగతి ప్రచురణాలయంలో అనువాదకులుగా పనిచేశారు.




రూ. 55.00

ISBN 978-81-237-5538-0

నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | **KLVA103B213** |
| పుస్తకం పేరు | పి సి జోషి జీవిత చరిత్ర |
| తారీఖు | **30 January 2025** |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 157 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CT, BCT |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | Akshaya |
| స్కాన్ చేసినది | bhanu |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |